# ఆంధ్రపత్రిక

## నలనామ సంవత్సరాదిసంచిక

[ అరువదియారవ సంచిక ]

[ 1976 - 77 ]

వ్యవస్థాపకులు : శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[ 1938 - 1972 ]

*

సంపాదకుడు : శివలెంక రాధాకృష్ణ

వెల రూ. 3

ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము

**Supplement to Andhra Patrika Issue Dated 31-3-1976**
**Regd. No. H/VJ No. 49**

## నలనామ సంవత్సరాది సంచిక

# విషయానుక్రమణిక

సంచిక : 66 సంవత్సరము 1976-77



*ముఖచిత్రం వివరాలు :*

**"మస్తకాభిషేకం"**

సేకరణ : శ్రీ కోడూరి రామమూర్తి

(సుమారు వందసంవత్సరాలక్రితం కర్నాటక ప్రాంతంలో కాగితంమీద వేసిన బొమ్మ అని శ్రీ రామమూర్తిగారి అభిప్రాయం)

# స్వవిషయం

ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు వెలువడటం మొదలుపెట్టిన ఆరు దశాబ్దాల పయికాలంలో దేశంలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఇంచుమించు ఒక ముప్పాతిక శతాబ్దంకాలంలో ఏర్పడిన పరిణామాలు చాలావరకు ఆధునిక సంస్కృతి చిహ్నాలలో ఒకటయిన వార్తాపత్రికా వ్యవస్థలో పరిణమించిన విధాలలో ప్రతిబింబిస్తాయనవచ్చు. మామూలు మనుష్యుల కోసం నడిచే వార్తాపత్రికలలో అన్నిరకాల చర్చలకీ తావు ఉండాలి వీటిలో పాల్గొనే అవకాశాలు "అసాధారణవ్యక్తుల"కి పరిమితం అయివుండనక్కరలేదు.

ఇప్పుడు భారత ఉపఖండంగా పిలువబతుదున్న భూభాగంలో నివసించేవారు పాశ్చాత్య దేశాలనబడే వాటిలో ఉండే వారికన్నా ఎన్నోవిధాలుగా వెనుకబడిఉన్నారు. తాము భారతీయులమని అనుకునేవారిలో దేశాభిమానం, గతంమీద అభిమానం ఎంత ఉన్నప్పటికీ పాశ్చాత్య దేశాలలో శతాబ్దాలపాటు అభివృద్ధిచెంది పరిణామం పొందిన రాజకీయ, సాంఘిక వ్యవస్థలనే ఇక్కడ ఏర్పరచుకొనాలన్న కోరిక గట్టిపడుతూ వస్తున్నదంటే కాదనటం కష్టం. సంపద విషయంలో ఒక స్థాయిని చేరుకొనటంతో సంఘంలోని దురాచారాలూ, లోపాలూ నశించిపోగలవని కొందరు అంటారు. ఈ వాదానికి చెప్పుకోదగిన ఆధారం ఉన్నట్లు కనిపించదు. నేటి ప్రపంచంలో కొన్ని దేశాలలో పారిశ్రామికోత్పత్తి, ఇతర ఉత్పత్తులు అధికంగానే ఉన్నప్పటికీ ఆ దేశాలలో జాతివిచక్షణ, మత విచక్షణ ఫలితంగా మనుష్యులమధ్య ఏర్పడే వ్యత్యాసాలేకాక తక్కిన వ్యత్యాసాలుకూడా కనిపిసూనే ఉంటాయి. ఇటువంటి వ్యత్యాసాలు కొన్ని సిద్ధాంతాల ప్రచారంవలన మాయమవుతాయని అనటంకూడాకష్టం. నిష్పక్షపాత దృష్టితో పరిశీలించినట్లయితే పాశ్చాత్యదేశాలలో మొత్తంమీద కనిపించే "సమానత్వపు ధోరణులు" వాటినిగురించి ఎడతెగకుండా ప్రచారంచేసే ఇతర దేశాలలో కనిపించవని తెలియకపోదు. (పంతొమ్మిదవ శతాబ్దపు కెమిస్ట్రీ, ఫిజిక్స్ వంటి విజ్ఞాన శాస్త్రాల పద్ధతులు జీవశాస్త్రాలు, సమాజాలకి సంబంధించిన శాస్త్రాలు పనిచేసే విధానాలని "సరిగ్గా అర్థం చేసుకొనటానికి" సహాయపడవని కొందరు హెచ్చరిస్తూనే ఉంటారు. "మత విశ్వాసా"లని పోలినవి యదార్థాలని గుర్తించటానికి అడ్డుపడుతూ ఉంటాయి.)

ఆధునిక సాంకేతిక సాధనాల సహాయంతో అధికారంలో ఉన్నవారు తమ అధికారాన్ని అత్యధికంగా పెంచుకొనటానికి వీలు ఉంటుందన్న హెచ్చరికలు తరుచు వినిపిస్తూనేఉంటాయి. ఈ సాధనాల దుర్వినియోగం ఏవిధంగా ఉంటుందో ఎప్పటికప్పుడు తెలుస్తూనే ఉంటుంది. అయితే, బలవంతంగా విధింపబడే అధికారం క్రమంగా అభివృద్ధి కుంటుపడేట్లు చేస్తుందనికూడా అనిపించక తప్పదు. స్పెయిన్, పోర్చుగల్ క్రమంగా వెనకబడిపోవటానికి ఆ దేశాలలో ఆలోచన, మాటలకి సంబంధించిన స్వేచ్ఛ మత సంస్థల అధిపతుల ఆ దేశాలని బట్టి కుంటుపడిపోవటమేనని కొందరి అభిప్రాయం. పాలించేవారిని విమర్శించేవారు లేకపోయినట్లయితే పొరబాట్లు జరిగే అవకాశాలు మరింత ఎక్కువ అవుతాయి. నియంతృత్వం కొనసాగే దేశాలలో లేక రాజ్యాలలో వైజ్ఞానిక, సాంకేతికాభివృద్ధి అనుకరణ వలననే ఎక్కువగా సాధ్యం అవుతుందని అనిపిస్తుంది.

బ్రిటన్, అమెరికా, స్కాండినేవియా దేశాలు మొదలైన వాటిల్లో అగుపించే స్వేచ్ఛయొక్క స్వరూపాలు అన్నీ అందరికీ నచ్చకపోవచ్చు. మత్తుపదార్థాల వాడకం, సెక్స్– వీటి విషయంలో కనిపించే స్వేచ్ఛ కొందరిని కలవర పెట్టవచ్చు; కాని, వీటిలో కనిపించే "విచ్చలవిడితనం" ఈ పాశ్చాత్య

దేశాల అభివృద్ధికి ఎంతదాకా అడ్డుపడుతోందని ఆలోచించి చూడటం అవసరం. పరిశ్రమలు, ఆహార పదార్థాల ఉత్పత్తి— ఈ రంగాలలో పాశ్చాత్య దేశాలు సాధించిన అభివృద్ధి ప్రపంచంలో ఇతర దేశాలు ఏవీ సాధించలేదు. సాంఘికంగా కూడా ఈ దేశాలలో కనిపించే అభివృద్ధి ఇతర దేశాలలో కనిపించదు. దురాచారాలకీ, ఇతర లోపాలకీ సంబంధించిన చర్చ పాశ్చాత్య దేశాలలో నిర్విరామంగా జరుగుతూనే ఉంటుంది. ఈ చర్చకి నిషేధం ఉండదు. ఇది స్వేచ్ఛగా జరగటం వలననే అధికార దుర్వినియోగం అవకాశాలు తక్కువ అవుతాయంటే అతిశయోక్తి కాదనిపిస్తుంది.

మంచి, చెడుల నిర్వచనాలు అనాదిగా, అంతులేకుండా జరుగుతూనే ఉన్నాయనవచ్చు; ఈ నిర్వచనాల విషయంలో ఎవరికీ సర్వాధిపత్యం లేదనే అనవచ్చు. అధికారంలో ఉన్న వారికి ఈ విషయంలో భ్రమ కలిగితే పొరపాట్లు జరిగే ప్రమాదాలు అధికం అవుతాయి. (ఈ సందర్భంలో తుగ్లక్, ఖిల్జీలవంటి సుప్రసిద్ధ పాలకుల చరిత్రలేకాక, "దీన్ ఇలాహీ" చరిత్ర గూడా గుర్తుకి రాకతప్పదు.) పాశ్చాత్య దేశాలలో కొన్ని శతాబ్దాలబాటు పెంపొందిన వ్యవస్థలమీద ఆ దేశాల వారికి "కాపీరైటు" ఉందని అనుకోనక్కరలేదు. కాని అక్కడ అభివృద్ధి చెందిన ఉత్కృష్టమయిన ఈ వ్యవస్థలే భారత దేశంలో కొత్త చైతన్యాన్ని మేల్కొలిపాయని ఒప్పుకోవాలి. జాతీయ చైతన్యం, దేశభక్తి ఏమాత్రం లోపించనివారు ఎందరో ఈ సత్యాన్ని గుర్తించారు. ఇటీవలే ఫ్రాన్సు కమ్యూనిస్టు నాయకుడు శ్రీ మార్చెయిస్ కొన్ని దశాబ్దాల కృషి, త్యాగం ఫలితంగా వచ్చిన "బూర్జువా స్వేచ్ఛలు" కొన్ని తేలికగా కొట్టివెయ్య తగినవి కావని స్పష్టంగా అన్నారు. భారతదేశంలో ఈ రకం స్వేచ్ఛల వెనుక అంత దీర్ఘమయిన చరిత్రలేదు. అవి అధికంగా పాశ్చాత్య ప్రభావాల ఫలితంగానే ఇక్కడ వెలిసి, అభివృద్ధి చెందాయి. అవి క్షీణించటం వలన పెద్ద నష్టం కలిగినట్లు ఎందరికో అనిపించకపోవచ్చు. ఇది చింతించదగిన విషయం.

# కర్నాటకలో పారిశ్రామిక వికాసము

గడచిన మూడు యేండ్లలోనూ రాష్ట్రంలో రు. 340 కోట్ల పెట్టుబడితో భారీ, మధ్యతరహా పరిశ్రమల రంగంలో క్రొత్త పెట్టుబడులకు 228 లెటర్సు ఆఫ్ ఇంటెంట్/పారిశ్రామిక లైసెన్సులు రాష్ట్రానికి అందినవి. 64000 మందికి వుపాధి అవకాశం కల్పించగలిగే స్తోమత దీనివలన ఏర్పడుతుంది.

క్రొత్త పెట్టుబడులను ఆకర్షించుటకుగాను ముఖ్యంగా ప్రయివేటు రంగంలో పరిశ్రమ స్థాపనకు రాష్ట్ర ప్రభుత్వము, ఇన్‌ఫ్రాస్ట్రక్చరల్ వసతుల అభివృద్ధికి ప్రముఖంగా పారిశ్రామిక ప్రాంతములలోనూ, ఎస్టేట్సు లోనూ, సాంకేతిక, ఆర్థిక సహకారమును పలు సంస్థలద్వారా అందజేసే కార్యక్రమంలో నిమగ్నమై యున్నది. కొత్త పరిశ్రమల స్థాపనకు ఇంకా అనేక రాయితీలను, సౌలభ్యాలను రాష్ట్ర ప్రభుత్వము అందిస్తున్నది.

రు. 50 కోట్ల పెట్టుబడితో 12000 మందికి ఉపాధి అవకాశములతో సుమారు 40 భారీ పరిశ్రమలు 1973 74 లో 30 న్నీ, 1974-75 లో మిగతావి ఉత్పత్తిని ప్రారంభించినవి.

లఘు పారిశ్రామిక రంగంలోకూడా అమితోత్సాహము వెల్లివిరుస్తు గడచిన మూడు యేండ్లలోను 7000 కు మించి యూనిట్లు రాష్ట్రంలో రిజిష్టరు కాబడినవి. దీనితో రాష్ట్రంలోని లఘుపరిశ్రమల సంఖ్య రెట్టింపు అయ్యింది. ఈ యూనిట్లద్వారా మూలధనపు పెట్టుబడి సుమారు 60 కోట్లకు పెరిగింది 7500 మందికి వుపాధి కల్పన జరిగింది.

బిజాపూరు, బీదర్, హస్సన్ వద్ద గ్రామీణ పారిశ్రామిక ప్రాజెక్టులు మూడింటికి మంజూరు లభించి పని చేయడం ప్రారంభించాయి.

లఘుపారిశ్రామిక రంగంలోనూ, ప్రత్యేక వుపాధికల్పన కార్యక్రమంలోనూ, గ్రామీణ పారిశ్రామిక ప్రగతి లోనూ 1972—73 నుంచి రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రత్యేక విధానంవలన పరిశ్రమలు అన్ని ప్రాంతా లలో సమానంగా విస్తరించడంలోనూ, నిరుద్యోగ నిర్మూలనలోనూ గణనీయమైన ఫలితాలు యిచ్చాయి.

పబ్లిక్ రంగంలో సాధించిన అత్యద్భుతమైన అభివృద్ధికి నిదర్శనం 'కుద్రేముఖ్ ఇనుపఖనిజం ప్రాజెక్టు' ఈ ప్రాజెక్టు అభివృద్ధికి ఇరాన్ 63 కోట్ల రూపాయలను భారతదేశానికి ఋణం యిచ్చుటకు సంసిద్ధత తెలిపింది ఖనిజవనరులను వుపయోగించి, అనేక అనుబంధ సంస్థల ప్రారంభమునకు ఈ ప్రాజెక్టు వుపయుక్తపడుతుంది.

---

-: జారీ చేసినవారు :-

డైరెక్టర్, సమాచార, ప్రచార శాఖ,
కర్నాటక రాష్ట్రప్రభుత్వము, బెంగుళూరు-560001.

# తె ను గు మ ఱు గు లు

డా. తిమ్మావజ్ఝల కోదండరామయ్య

## బసవపురాణము-కథాసూత్రము

పాల్కుఱికి సోమనాథుడు అనుభవసారము, చతుర్వేదసారము మొదలగు కొన్ని గ్రంథములను శైవతత్త్వ ప్రతిపాదకములుగాను, పాశివరమ్య ప్రతిష్ఠాపకములుగాను రచించుటయేకాక వృషాధిపశతకము, బసవోదాహరణము, పండితారాధ్యోదాహరణము మొదలగు లఘుకృతులను స్తోత్రగ్రంథములుగా రచించి శైవమతావలంబకులగు నాంధ్ర మహాజనులకు సిద్ధాంత గ్రంథములను, స్తోత్రగ్రంథములను సమకూర్చినవాడయ్యెను. మల్లికార్జున పండితారాధ్యుడు తన శివతత్త్వసార రచనమునం దాశించి సాధించిన యుభయలక్ష్యములును వీని మూలమున సిద్ధించినవి. అంతటితో నాతనికి తృప్తి కలుగలేదు. కావ్యముయొక్క కాంతాసమ్మితత్వముచేత సాధించుఫలము సిద్ధాంత ప్రచారముకంటెను, స్తోత్ర రచనములకంటెను అధికము, బలవత్తరము అని గుర్తించిన సోమనాథుడు బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, మల్లమదేవీ పురాణము అను కావ్యములనుకూడ రచించి యీ మూడు విధము లయిన ప్రయోజనములను తాను సృష్టించిన శైవ గ్రంథ సంచయము మూలమున సాధించెను.

బసవపురాణము వీరశైవమతోద్ధారకుడగు బసవేశ్వరుని జీవితమును అభివర్ణించు గ్రంథరాజము. అతడు క్రీ. శ. 1120–1168 సంవత్సరముల నడిమికాలమున కల్యాణకటకము రాజధానిగా పశ్చిమ చాళుక్యరాజ్యమును పరిపాలించిన కలచుర్య వంశజుడగు బిజ్జలునికి మంత్రియు, దండనాథుడునై యుండినవాడు. అట్టి బసవేశ్వరుని జీవితమునందు కావ్యరూపమున సంతరించుట మాత్రమేకాక అతడు ప్రసక్తానుప్రసక్తముగా —

> 'పూరితంబై యొప్పు పూసలలోన
> దారంబు క్రియఁ బురాతన భక్త వితతి
> చరితలలోపల సంధిల్ల బసవ
> చరితమే వర్ణింతు... ... ... ...'
>
> — బస 1 9 పుట.

అని అతఁడే చెప్పకొనినటు తన కావ్యరాజమున బసవేశ్వరుని చరిత్రము తోబాటు పురాతన నూతన భక్తుల చరిత్రములను పెక్కింటిని అభివర్ణించెను. శైవమతావలంబకులకు బసవేశ్వరుని చరిత్రముతోబాటు ప్రాచీన శివభక్తుల చరిత్రములుకూడ ఉపాదేయములగుటచే వానిని తత్తదుచితస్థానములయందు మనోహరముగా అభివర్ణించు బసవపురాణము వారికి పరమోపాదేయ మయినది.

బసవపురాణము ఒక స్వతంత్ర గ్రంథము. అది యే సంస్కృత గ్రంథమునకును అనువాదముకాదు. స్వతంత్ర గ్రంథములు కథాపూర్ణోదయాదులవలె ఉత్పాద్యగ్రంథములు కావచ్చును. అది యట్లుత్పాద్యగ్రంథమునుకాదు. కనుక అందలి యితివృత్తము అటు సంస్కృత మూలకముకాదు, ఇటు తన మేధస్సుచే అభ్యూహించి రచించిన కల్పిత గ్రంథమును కాదు. అది కేవలము దేశీయమయిన స్వతంత్ర గ్రంథము. దక్షిణదేశమున తనకించుక పూర్వకాలమునందు వెలసిన ఒకానొక చారిత్రక పురుషుని జీవితచరిత్రయందలి యితివృత్తము. దాని నయినను అంతకుముందెవ్వరును రచించియుండలేదు. అం దమస్యూతముగా తెలుపబడిన పురాతన భక్తుల చరిత్రములు భక్తజనులు అనుదినము తమ గోష్ఠిప్రసంగములలో చెప్పకొనునట్టివి. నూతన భక్తుల చరిత్రములు బసవేశ్వరుని సమకాలమునందును, తదనంతర కాలమునందును శైవమతము వ్యాపించియుండిన దేశభాగములయందు — తెలుగు, తమిళ, కన్నడ దేశములయందు — భవ్యజీవితము గడపిన భక్తజనులకు సంబంధించినవి. అవి యెల్ల చెదరులు చెదరులుగా ఆనోట ఆనోట వినబడుచుండిన కథలే కాని వాని నెల్ల ఒక్కచో ఒక సూత్రమున గుది గ్రుచ్చిన గ్రంథ మేదియు అతనికాలమునాటికి వెలసియుండలేదు. బసవపురాణము యొక్క అవతారికలో సోమనాథుడు తన గ్రంథమునకు పురాతన భక్త గీతార్థ సమితియే మాతృక అయినట్లు పేర్కొనెను. (బస. 1–9 పుట) పురాతన గీతము లనక 'గీతార్థము' లనుటచే అతడందలి విషయమును మాత్రమే పరిగ్రహించెనని విశదమగును. బసవగీతాదులు పురాతన భక్తచరితములను ప్రస్తావవశమున తడవుచు స్థూలముగా వానినిగూర్చి తెలియజేయుచుండగా వానినెల్ల కథారూపమున రచింప నెంచిన సోమనాథునికి మరికొన్ని కథావివరములు కావలసి వచ్చెను. అట్టి వివరముల నాతడు తన కాలమునాటి భక్తవరుల నడిగి తెలిసికొనెను. ఈ విషయము నాతడు బసవ పురాణమున ఇట్లు పేర్కొనెను.

'ప్రస్తుతి కెక్కిన బసవని చరితఁ
జెప్పితి భక్తులచే విన్నమాడ్కిఁ
దప్పకుండఁగను యథాశక్తిఁజేసి'

—బస. 7–584 పు.

సోమనాథుడు అనుభవసారమును రచించునాటికి అతనికి బసవేశ్వరుని గూర్చి యేమియు తెలియదు. అందతడు మూడు పద్యములలో మల్లికార్జున పండితారాధ్యుని ప్రస్తుతించి యుండెనే కాని బసవేశ్వరుని గూర్చి యించుకంతైన ప్రస్తావించి యుండలేదు. అతడే పండితారాధ్య చరిత్రమునందలి అవతారికలో ఉదాత్తమగు భక్తి భావముతో, భృత్యాచారముతో తన బసవ తన్మయత్వమును ప్రకటించి యుండుట గమనార్హము. అనుభవసారము రచించిన పిదపనే యాతడు భక్తజనుల మూలమున బసవేశ్వరుని చరితమును, అతని మహిమాదికమును వినఁగ గలిగెను. బసవేశ్వరునిపై ఎనలేని భక్తి గౌరవము లాతనికి కుదురుకొనినవి. తద్భక్తి ప్రేరితుడై యతడు తొలుత బసవరగడ, బసవాద్య రగడ, గంగోత్పత్తి రగడ మొదలగు లఘు కృతులను రచించి సంస్కృత భాషా గ్రథితములును, సంస్కృతపదభూయిష్ఠములును అగు నాగేయకృతులు జనవశీకరణమునకును, మతప్రచారమునకును సహాయకములు కావేరవని తలచి, తాను తెనుగుపై వలపు పచరించి ఆ తెనుగు నుడికారపు మెరుగులు తురంగలించునట్లుగా బసవపురాణమును దేశీయమగు ద్విపదచ్ఛందములో సప్తాశ్వాస పరిమితమగు కావ్యముగా సంతరించెను.

ఇట్లు తనకు పూర్వకాలమందు బసవాదులగు పురాతనభక్తులు పాడిన గీతములను, తనకాలమునందలి భక్తజనులు బసవేశ్వరుని గూర్చియు, అతని మహిమాదికములను గూర్చియు చెప్పిన కథలను, విశేషములను ఆధారముగా చేసికొని సోమనాథుడు బసవపురాణమును బసవేశ్వరుని జీవిత చిత్రణ ప్రధానముగా, పురాతన నూతన భక్తుల చరిత్రములనుస్యూతము లగునట్లుగా రచింప సంకల్పించెను. కాని అతనికి ఉద్దిష్ట సకల విషయ సంపన్నముగా ఆ యా కథలనెల్ల ఏకసూత్రమున గుది గ్రుచ్చువిధానము గోచరింపదయ్యెను. అట్టి కథా సూత్రము–రచనా ప్రణాళికను ఒకదానిని తనకు తెలుపవలసినదిగా అతడు భక్తగోష్ఠిలో తన మిత్రులను అర్థించెను. ఆ భక్తగోష్ఠిలో నుండిన అతని మిత్రులు కరస్థలి సోమనాథయ్యగారు, మల్లినాథుడు, రెంటాల మల్లినాథుడు, దోచమాంబ, గౌరగి త్రిపురారి అనువారు. వారతనికి కథాసూత్రమును అనుగ్రహించిరి. వారు తెలిపిన కథా

సూత్రమును అనుసరించి 'పూరితంబై యొప్పు పూసలలోన దారంబు క్రియఁ బురాతన భక్తవితతి చరితల లోపల సంధిల్ల బసవ చరితము'ను ఆతడు సంతరించెను. ఈ విషయము బసవపురాణావతారికలో ఇట్లు కలదు:

> 'అసదృశంబై యొప్పు బసవపురాణ
> మెనకంబుతోఁ జెప్ప నిష్టమయ్యెడుఁ
> వరకథాసూత్రంబు వెర వెఱింగించి
> చరితార్థుఁ జేయరే కరుణతో ననుచు
> ... ... ... ... ... ... ... ... ...
> బసవ పురాణంబుఁ బసరించుశక్తి
> నసలార నొసఁగితి మట్లు గావునను
> రచియింపు బసవపురాణంబు నీవు
> నచలిత భక్త హితార్థంబు గాఁగ'—
>
> —(1 6 పుట)

కథాసూత్రము అనగా కావ్యేతి వృత్తమునకు సంబంధించిన ప్రణాళిక. నన్నయభట్టారకుడు సంస్కృత భారతమును ఆంధ్రీకరింప దలచినవాడగుటచే అతనికి కావ్యప్రణాళికయొక్క ఆవశ్యకము లేక పోయినది. మూలమునందలి ప్రణాళికను అనుసరించి అనువాదరచనము సాగించుటయే ఆతడు చేయవలసిన పని. నన్నెచోడుడు శివపురాణము, కాళిదాసకృతమగు కుమార సంభవము అను గ్రంథములను మూలములుగా గ్రహించినను అతడు స్వతంత్రముగానే కావ్యనిర్మాణము చేయ గడగినవాడగుటచే అతడు తన కావ్యమున కొక ప్రణాళికను కల్పించు కొనవలసినవాడయ్యెను. కన్నడ భాషలో ఇట్టి కావ్యప్రణాళికను కావ్యాంతమునందు చేర్చుట సంప్రదాయము. (చూ. పంపభారతము 4 ఆ. 53వ) వారిచే ప్రభావితుడయిన నన్నెచోడుడు కూడ తన కుమార సంభవమునందలి కృత్యవతరణికలో కథాసూత్రము నొకదానిని పరికల్పించు కొనెను. (చూ. కుమారసంభవము 1 ఆ. 67, 68, 69 ప,) నన్నెచోడుడు తన కావ్యకథాసూత్రమును స్వయముగా, స్వతంత్రముగా పరికల్పించుకొని కావ్యనిర్మాణము చేయగా పాల్కురికి సోమనాథుడు బసవపురాణమను స్వతంత్ర కావ్యమును రచింప సంకల్పించి శ్రీశైలమునందు భక్తజనుల గోష్ఠిలో తనకు కథాసూత్రమును తెలిపి తన్ను చరితార్థుని చేయవలసినదని భక్తవరేణ్యులగు తన మిత్రవరుల నర్థించెను. వారును అతనికి కథాసూత్రమును తెలిపి యాతనికి బసవ పురాణమును పసరించు శక్తిని అనుగ్రహించిరి. వారి యాజ్ఞను తలమోచి యాతడు బసవపురాణ రచనమునకు తొడగెను. భక్తజను లాతనికితెలిపిన కథాసూత్ర మెట్టిదో, బసవ పురాణము నందు సోమనాథుడు వారు అనుగ్రహించిన కథాసూత్రమును ఎంత వఱకు పాటించెనో పరిశీలింప వలసి యున్నది.

బసవపురాణము బసవేశ్వరుని జీవిత చరిత్రమును, పురాతన నూతన భక్తుల చరితములను కలగాపులగముగా గుదిగుచ్చి యెత్తి రచించిన అందదుకుల కావ్యముకాదు. సోమనాథుడే పేర్కొనినట్లు 'పూసలలోన దారంబుక్రియఁ బురాతన భక్త వితతి చరితల లోపల సంధిల్ల బసవచరితము' అందు అభివర్ణింపబడినది. పురాతన భక్త వితతి చరితలు అనెడి పూసలలో అనుస్యూతముగా నుండునట్లు బసవ చరితము అను దారము కూర్పబడినది. బసవ చరితమును తీర్చి దిద్దుటలో ఏ యే భక్తుల చరిత్రములు ఎక్కడెక్కడ కూర్పవలెనో, ఎట్లుగా వానిని వర్గీకరించుకొని కూర్చిన కావ్యము శోభావహముగ నుండునో అను విషయములోనే ఆతడు తన మిత్ర జనుల సహకారము నర్థించెను. వారును ఆతనికి ఆయాయి విషయములందు చక్కని సూచనలనే యొసగి కావ్య నిర్మాణమునందాతనికి తోడ్పడి రను విషయము బసవ పురాణ కావ్యమును తిలకించినపుడు మనకు తప్పక స్ఫురింపగలదు.

అందలి ప్రథమాశ్వాసమున శివుని యానతిపై నందికేశ్వరుడు మర్త్యలోకమున బసవేశ్వరుడుగా జన్మించుటయు, బసవేశ్వరుడు తనకు వడుగు వలదని తండ్రితో వాదించి యిల్లువదలి పోవుటయు, అతని మేనమామయగు బలదేవదండనాయకుడు తన కుమార్తెయగు నాగాంబిక నిచ్చి యాతనికి వివాహము చేయుటయు, బసవేశ్వరుడు కప్పడి సంగమేశ్వరమున కేగుటయు, సంగయదేవు డాతనికి ప్రత్యక్షమగుటయు-అను బసవకథావిషయములు ప్రపంచింపబడినవి. ఇందు ప్రస్తావవశమున శిలాదుడు, నందికేశ్వరుడు అను పురాతన భక్తుల కథలు అభివర్ణింపబడినవి.

ద్వితీయాశ్వాసమున బసవేశ్వరుడు కల్యాణ కటకమున బజ్జలుని కడ దండనాయక పదవి నందుటయు, అతడు అల్లమ ప్రభుదేవరకు విందుపెట్టగా అతడు బసవనికి వరము లిచ్చుటయు తరువాత నతడు కొన్ని మహిమలు ప్రదర్శించుటయు, అభివర్ణింపబడినవి. పిదప సంగమేశ్వరుడు బసవని మూడవకన్ను అడుగుకథ, బసవడు గొల్లెత చల్లకడవ పడకుండ పట్టినకథ, శివుడు పార్వతికి బసవని మహిమ తెలిపినకథ అను బసవకథావృత్తాంతములు వివరింపబడినవి. వీనిలో—అల్లమప్రభునికి విందుపెట్టిన సందర్భమును పురస్కరించుకొని పార్వతి ప్రమథులకు విందుపెట్టినకథ — వంగకాయలు లింగములైన కథను వివరించుసందర్భమున బల్లేశు మల్లయ్యకథ, కాటకోటయ్యకథ—జొన్నలు ముత్తెములైన కథను తెలుపు సందర్భమున మొఱటద వంకయ్య కథ బసవడు గొల్లెత చల్లకడవ పడకుండ పట్టిన కథను పురస్కరించుకొని తిరుచిట్టంబలునికథ-శివుడు తన హృదయమున బసవని చూపిన సందర్భమును వివరించుటలో సిద్ధ

గేయ కథానిక:

# ఆలుమగల లడాయి

శ్రీ పోచిరాజు శేషగిరిరావు

శశియు సౌరమూర్తి శరదిందు కౌముదీ
కాంతిలోన కలియుగాన కలియ
వింత వింతలైన విడ్యూరములు గొల్పు
భావ వలయములు ప్రవర్తిలంగ.

భాగధేయములు ప్రతికూలంబై
అవరోధించిన వంతరంగముల—
చంద్ర సూర్యులకు జాయాపతులకు
అట్టె తెగెను అనురాగ తంతువులు.*

## చంద్రాదేవి

ఆనంద ఖేలన మ్మాహ్లాద రుచిరమ్ము
పానీయ సదృశమ్ము భాస్వచ్ఛ కోరికకు —
నవ మిధున పంక్తులకు నవయుగోదయ విభము
సవదరించిన కాంతు లవతరించిన వేళ

మానవాళికి నేను మంగళాభ్యుదయముల్
సోనసోనగ కురియుచుందు నెప్పటికి, నా
కౌము దీ పర్వమ్ము గర్వ కారణమంచు
మోము ప్రక్కకు త్రిప్పె ముదిత చంద్రాదేవి.

## సూర్యుడు

దక్షిణ నాయకతా విభవుండను
అక్షి పర్వమగు అఖిల జగతికిని
చక్షుః ప్రీతిగ పార సాంద్రమై
వరలు వెన్నెలకు ప్రగతి నా వలనె.

నా వలనే కద నాడెము పోడిమి
పావన యశమును - భాసురరూపము
ముదల కింపకే ముదితా ! గరువము
వదలుము వేగమె పదిలముగా ననె.

## చంద్రాదేవి

కోమలి ముఖమున గోళాకృతితో
సామర్షము సాక్షాత్కరించెను
పసి చెడి శశియెటు చాలని పోలిక
పసిడి మొగము వసివాళులు వాడెన్.

## గ్రహరాజు

గ్రహ రాజు దురాగ్రహమున తీవ్ర
ప్రహతుని పోలిక వ్యథితుం డయ్యెను
మనసులు విరిగెను: మమతలు జారెను :
వినువీథియె యొక పెను జ్వాలిక యయి.

## సూర్యచంద్రులు

చంద్రాదేవియు సౌర విభుండును
రుంద్రత తోపగ రూక్షాక్షములన్
సికతా తలమున చేరి, వాలుకా
ప్రకరము లొండొరుపై నెగజిమ్మిరి.

## మేఘదూత

తూరుపు దెసలో తోచిన మేఘుడు
వేరు వేరు నయి విజ్జోడవు నా
యిరువురి మదులన్ పొరపొచ్చెములన్
సరి పఱచెను నెర జాణతనమున్.

సూర్యుడు చిమ్మిన చూర్ణపు టిసుకయె

* చంద్ర సూర్యులు భార్యాభర్తలనీ, వారు వివాదపడిన ఫలితంగా నక్షత్రాలేర్పడ్డాయనీ చెప్పే వైదేశిక జానపద కథ దీనికి స్ఫూర్తి.

రామయ్య అను నూతన భక్తుని వృత్తాంతము—అను మొదలగు విషయములు సందర్భోచితముగా గుది్రగుచ్చబడినవి.

తృతీయాశ్వాసమున బసవేశ్వరుడు ఒక మిండ జంగమునకు రాజధనము నొసగగా మంత్రులావిషయమును రాజున కెఱిగించిరి. బిజ్జలుడు నిక్కచ్చిచేయగా బసవేశ్వరుడు లెక్క కగ్గలముగా అందు ప్రభుత్వధన ముండుటను చూపెను. ఈ సందర్భమున నక్కలు గుఱ్ఱములైన కథను ప్రసక్తానుప్రసక్తముగా చొప్పించెను. పిదప బసవ కథావిషయములనే వివరించుచు ముగ్ధ సంగయ్యకథను పురస్కరించు కొని అతనిని పోలిన రుద్రపశుపతి, నక్కనైనారు, బెజ్జమహాదేవి, గొడగూచి, దీపద కళియారు, నాట్యనమిత్తండి, ఉడుమూరి కన్నప్ప-అను ముగ్ధభక్తుల కథలను వివరించెను. పిదప అభివర్ణింపబడిన సకవేశ్వర మాదిరాజయ్యకథ బసవకథాసంబంధియే. ఆతడు నూతన భక్తుడు.

చతుర్థాశ్వాసములోని మడివాలు మాచయ్య కథ బసవేశ్వరుని కాలమునందు జరిగినది. దానిని పురస్కరించుకొని బసవేశ్వరుడు బిజ్జలునకు శివభక్తుల మహిమాధిక్యమును తెలుపుచు ఇరువదాండారి, బావూరి బ్రహ్మయ్య అను భక్తుల కథలను వివరించెను. మాచయ్య కడ కేగిన బసవన్నకు మాచయ్యయే తెలిపినట్లుగా శంకరదాసికథ, జగదేక మల్లనికథ, నిమ్మవ్వకథ, అందు సిరియాలునికథ, హలాయుధుని కథ మున్నగు పెక్కు కథలు, వాల్మీకేశుడు ఒరయనంబికి చెప్పినట్లుగా బాణునికథ మొదలగు పెక్కు శివభక్తుల కథలు వర్ణింపబడినవి.

పంచమాశ్వాసమునందు బసవనికి సమకాలికుడయిన కిన్నర బ్రహ్మయ్య బసవనియొద్దకు పోయిన కథను తెలుపుచు ప్రసక్తాను ప్రసక్తముగా కలకేత బ్రహ్మయ్య, మోళిగ మారయ్య, కన్నడ బ్రహ్మయ్య, ముసిడి చౌడయ్య, సురియ చౌడయ్య, తెలుగు బొమ్మయ్య అనువారి కథలు వివరింపబడినవి.

షష్ఠాశ్వాసము బసవనికి సమకాలికుడగు ఏకాంత రామయ్య జైనులను ఢీకొనిన సందర్భమును పురస్కరించుకొని ప్రసక్తాను ప్రసక్తముగా జైనసమయులనుపరిభవించిన ఇరుత్తండి, పిళ్ళనైనారు, నిడుమారడు, నమినంది. సాంఖ్యతొండరు కోవూరి బ్రహ్మయ్య, తేడర దాసయ్య, హిరియ నాచయ్య, వైజికవ్వ, షోడ్డలదేవు బాచయ్య మొదలగు శివభక్తుల కథలు వివరింపబడినవి.

సప్తమాశ్వాసమునందు శివనాగుమయ్య అను శ్వపచ భక్తుని బసవేశ్వరుడు గౌరవింపగా అతనిని ఆక్షేపించిన బజ్జలునికి బసవన్న తెలిపినట్లుగా కల్లిదేవయ్య, బిచ్చి బారయ్య, మాదర దూడయ్య మొదలగు శ్వపచ భక్తుల కథలు వివరింపబడినవి. తరువాత బసవకథా సంబంధులగు బోయలతగవు, బసవన్న విషమారగించుట, జగదేవ దండనాయకుని కథ, అల్లయ్య మధుపయ్యల కథ వివరింపబడినవి. వీనిలో జగదేవ దండనాయకుని కథను పురస్కరించుకొని ఏలేశ్వరు కేతయ్యగారి కథయు, సవరద నాచయ్య కథయు తెలుపబడినది.

ఇట్లు మహిమాత్మకములగు కథలు, ముగ్ధ భక్తుల కథలు, భక్తుల ఆధిక్య స్థాపకములగు కథలు, అధమ కులుల కథలు, జైన సమయ విధ్వంసము చేసిన భక్తుల కథలు, శ్వపచ భక్తుల కథలు అని పురాతన భక్తుల కథలనెల్ల వర్గీకరించుకొని, బసవేశ్వరుని జీవిత చరితాను వర్ణమున ఏయే ఘట్టములయందు ఏయే కథలను కూర్పదగునో ఆ ప్రణాళికను భక్తజనుల గోష్ఠిలో మిత్రులగు శివభక్తులతో కూడ బలుకుకొని, వారి యాదేశము చొప్పున ఒక 'కథాసూత్రము'ను పరికల్పించుకొని సోమనాథుడు ఆ సూత్రముబడి తన బసవపురాణమను స్వతంత్ర కావ్యమును తీర్చిదిద్దెను. కురుపాండవుల చరితమును ప్రధానేతి వృత్తముగాకల మహాభారతమునందు ప్రసక్తానుప్రసక్తముగా ఉపాదేయ నీతి విషయాది పరికలితములగు ఉపాఖ్యానములు చేర్పబడినట్లుగా, శ్రీ మహావిష్ణు కథాప్రధానమగు మహాభాగవతమునందు అందందు ఉపాఖ్యానములు పరికల్పింపబడినట్లుగా-పురాతన భక్తజనులకు సంబంధించిన కథావృత్తాంతములను ఉపాఖ్యానములవాడ్క ప్రధానవృత్తమగు బసవ కథయందు తానే స్వతంత్రముగా పరికల్పించుకొనిన కథాసూత్రము ననుసరించి చేర్చి సోమనాథుడు తన కావ్యమునకు ఇతిహాస పురాణములతోడి సమానత్వమును సమాకలించుకొనెను. బసవపురాణమని తన కావ్యమునకు పేరిడుటలో అతని యుద్దేశము కూడ అదియే.

—

యర్థముగాదు. "పురి=హృదయగుహే, శయనాత్ పురుషః" అని శంకరులు. సర్వజీవుల హృదయాలయములయందు జీవరూపమున నుండువాడుగాన పరమాత్మకు పురుషుడని నామము కలిగినది. పరమాత్మయే హృదయగుహలందు ప్రవేశించినాడనుటకు విశ్వకర్మసూక్తము లోని "స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమచ్ఛదో వర ఆవివేశ" అన్నవాక్యమే పరమప్రమాణము. "ఆవివేశ" అన్న పదము నాధారము చేసికొనియే "అనుప్రవేశతత్వమును" ఉపనిషత్తులు విస్తరించినవి. ఈ విధముగా జగత్కారణ తత్వమును పురుషశబ్దముతో పేర్కొనుచు వచ్చిన పురుషసూక్తము, ఆ పురుషుని సృష్టి మహిమను వర్ణించి వర్ణించి కడకిట్లన్నది—

"అద్భ్యః స్సంభూతః పృథివ్యై రసాచ్చ
విశ్వకర్మణ స్సమవర్తతాధి
తస్య త్వష్టా విదధ ద్రూప మేతి
తత్పురుషస్య విశ్వ మాజాన మగ్రే."

జగత్కారణమగు ఆ పురుషునికి, విశ్వకర్మనామము వ్యవహార యోగ్యము, సార్థకమునని వేదము భావించినట్లు స్పష్టమగుచున్నది. ఈ విశ్వకర్మయే మొట్టమొదటి జగచ్ఛిల్పి. ఈ విషయమును వేదమే యిట్లు నిర్ధారణ చేయుచున్నది.

యజుర్బ్రాహ్మణ ప్రథమాష్టకములోని దిగువమంత్ర మేమనుచున్నదో చూడుడు—

"స ప్రథమ స్సంకృతి ర్విశ్వకర్మా
స ప్రథమో మిత్రో వరుణోఽగ్నిః
స ప్రథమో బృహస్పతి శ్చికిత్వాన్"

భాష్యం : "సమీచీనా కృతిః నిర్మాణం యస్యాసౌ సంకృతిః" యోగ్య మగు నిర్మాణశక్తి గలవాడు సంకృతి యగుచున్నాడు. అనగా శిల్పియని భావము. అట్టి సంకృతుల (శిల్పుల)లో ప్రథముడు విశ్వకర్మ. ఆ విశ్వకర్మతర్వాత చెప్పదగిన శిల్పులు—మిత్రుడు, వరుణుడు, అగ్ని, బృహస్పతి మున్నగువారు. కనుక వేదమే విశ్వకర్మను అదిమ శిల్పిగా భువనశిల్పిగా పేర్కొన్నదన్నమాట. ఈ విశ్వకర్మ అనేకావతారములు దాల్చి, ఋషియు, ప్రజాపతియు, శిల్పిబ్రాహ్మణుల కూటస్థుడును అయి శిల్పములను, శిల్పసంప్రదాయమును విస్తరించినట్లు వేదములోను పురాణాగమములలోను ప్రమాణము లున్నవి.

వేదవాఙ్మయములో ఈ విశ్వకర్మకు తరువాత పేర్కొనదగిన శిల్ప ప్రజాపతి త్వష్ట. ఈ త్వష్ట విశ్వకర్మయొక్క అవతారమే అని ఇంతకుముందే ఉదాహరించిన "విశ్వకర్మణ స్సమవర్తతాధి, తస్య త్వష్టా విదధ ద్రూప మేతి" అన్న పురుషసూక్తమంత్రము చెప్పుచున్నది. విశ్వకర్మకు త్వష్ట ఒక్కడే కాక, మను, మయ, శిల్పి, విశ్వజ్ఞ అను మతినల్వురు కొడుకు లున్నారనియు, వీరైదుగురు లోకమున అయో, దారు, తామ్ర,శిలా, స్వర్ణమయము లైన పంచశిల్పములకు ప్రవర్తకులైనారనియు స్కాంద, బ్రహ్మాండ, వసిష్ఠాది పురాణాదులు వాకొనుచున్నవి. విశ్వకర్మకు సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణులనెడి పంచర్షులుదయించినారని యజుర్వేదము. వీరి వలన పంచశిల్పములుచేయు విశ్వబ్రాహ్మణులు ప్రభవించినారని పురాణ శిల్పాగమాదిశాస్త్రములనుచున్నవి. ఈనాటి విశ్వబ్రాహ్మణశిల్పులీ సానగాది పంచవింశత్యుత్తరశతబ్రహ్మర్షుల గోత్రోత్పన్నులనుట సుప్రసిద్ధ విషయము.

వేదములలో అడుగడుగునకును బహుళముగా దర్శనమిచ్చువాడు త్వష్ట. ఋగ్వేదప్రథమమండలము 13వ సూక్తములో మొట్టమొదటగా త్వష్ట్రు శబ్ద మగపడుచున్నది—

"ఇహ త్వష్టార మగ్రియం
విశ్వరూప ముపహ్వయే
అస్మాక మస్తు కేవలః"

"తక్షూ, త్వక్షూ—తనూకరణే" అను ధాతువులనుండియు, "త్విష దీప్తౌ" అను ధాతువునుండియు త్వష్టృశబ్ద స్వరూపము నిష్పన్నమగుచున్నదని సాయణులు. అనగా ఒక వస్తువునకు సావయవమగు రూపకల్పన చేయువాడు త్వష్టయని యర్థము. ఈ మంత్రము నందలి "విశ్వరూపం" అను పదమునకు భాష్యములో "విశ్వాని రూపాణి త్వష్టృత్పన్నత్వేన" అని వ్రాయుచూ "త్వష్టా వై పశూనాం మిథునానాం రూపకృత్" అన్న తైత్తిరీయ సంహితావాక్యమును ప్రమాణీకరించినారు సాయణులు. దీనినిబట్టి సమస్త రూప శిల్పములకు నిర్మాతయు, అధిపతియు త్వష్టయే యని స్పష్టమగుచున్నది. ఇందుకు అనుగుణముగా వేదములో త్వష్టృదేవుని సృష్టి వైభవమును ఈ వాక్యములు వివరించుచున్నవి—

"త్వష్టా రూపాణా మధిపతిః"
"త్వష్టా రూపాణి హి ప్రభుః"
"త్వష్టా రూపాణి వికరోతి"
"త్వష్టారగ్ం రూపాణి వికుర్వన్తం విపశ్చిం"

ఏకాగ్నికాండ మంత్ర ప్రశ్నములోని మంత్ర మొక్కటి వధూవరులను నిర్మించు దేవుడీ త్వష్టయే యనుచున్నది:—

"త్వష్టా జాయా మజనయ త్త్వష్టాస్యై త్వాం పతిం.
త్వష్టా సహస్ర మాయూగ్ంషి దీర్ఘమాయుః కృణోతు వామ్".

ఓవరుడా! త్వష్ట నీ కీమెను భార్యగా సృజించినాడు. అట్లే ఈ వధువుకు నిన్ను భర్తగా చేసెను. అట్టి త్వష్ట మీకు దీర్ఘాయుర్భాగ్యము నొసంగుగాక! అని మంత్రార్థము. ఈ మంత్రము చదువనిది వైదిక వివాహము పూర్తికాదు. ఇంతియేకాదు. గర్భములో నున్న పిండమునకు ఇంద్రియములను కల్పించి రూపనిర్మాణము చేయునది గూడ త్వష్టృశక్తియే యని ఋగ్వేద దశమమండలములోని దిగువ మంత్రమనుచున్నది:—

"విష్ణుర్యోనిం కల్పయతు, త్వష్టా రూపాణి పిగ్ంశతు,

అసించతు ప్రజాపతి ర్ధాతా గర్భం దధాతు తే"

ఇందు త్వష్ట రూపనిర్మాణ కారుడగు దేవుడని స్పష్టపరుప బడినది. గర్భాధాన సంస్కారములో ఈ మంత్రమును చదువుదురు. అనిర్వచనీయ మగు దైవశిల్పమును బట్టియే మానుష శిల్పము విలసిల్లినదని చెప్పుటకు, త్వష్టృ విశ్వకర్మల సృష్టి శిల్పమును గూర్చి ప్రస్తావించుట యైనది.

దేవేంద్రునకు ఆయస మైన వజ్రాయుధమును జేసి యిచ్చినది త్వష్టయేయని వేదములో పలు తావుల వర్ణింపబడియున్నది.

"మహ్యం త్వష్టా వజ్ర మతక్ష దాయసం"

— ఋక్కు 8.1.5.3.

త్వష్టృ దేవుడు నాకు ఉక్కుతో వజ్రాయుధమును జేసి యిచ్చినాడని యింద్రుడే స్వయముగానన్నాడు.

"అస్మా ఇదు త్వష్టా తక్ష ద్వజ్రం,
స్వపస్తమం స్వర్యం రణాయ"

అని అథర్వవేదమనుచున్నది.

"త్వష్టాస్మై వజ్రం స్వర్యం తతక్ష" అని ఋక్కు.

ఈ మంత్రములలో "అతక్షత్" అను క్రియకు వజ్రాయుధమును నిర్మించి పదునుపెట్టినాడని భావము. స్వర్యమనగా స్వర్గమునకు మేలుగూర్చునదని భావము.

వేద ప్రసిద్ధ దైవశిల్పాచార్యులలో విశ్వకర్మ, త్వష్ట, విశ్వరూపుడు అనువారు మొదటగా పేర్కొనదగిన వారు. విశ్వరూపాచార్యుడు త్వష్ట యొక్క కుమారుడే.

"విశ్వరూపో వై త్వాష్ట్రః
పురోహితో దేవానా మాసీత్"

అని యజుర్వేదము. త్వాష్ట్రుడనగా త్వష్ట యొక్క కుమారుడన్నమాట. ఈ విశ్వరూపుని కథ వేదమునందే కాక, భాగవతాది పురాణముల యందును వర్ణింపబడియున్నది. ఈ మువ్వురి తర్వాత పేర్కొనదగిన వైదిక శిల్పులు ఋభువులు. వీరు— ఋభువు, విభ్వా, వాజ—అని మువ్వురు. అంగిరో మహర్షి అష్టమపుత్రుడగు సుధన్వ శిల్పాచార్యుని కుమారులు వీరు. రథాదినిర్మాణమునందు అద్వితీయ చాతుర్యముగల రథకారులు వీరు. వీరి ప్రభావము ఋగ్వేదములో పదునొకండు సూక్తములు వర్ణించుచున్నవి.

"తక్షన్ రథం సువృతం విద్మనాపస
స్తక్షన్ హరీ ఇంద్రవాహో వృషణ్వసూ
తక్షన్ పితృభ్యాం ఋభవో యువద్వయః
తక్షన్ వత్సాయ మాతరం సచాభువం"

— ఋక్కు 1.7.31.1.

శిల్ప కర్మ కౌశలము గల ఋభువులు అశ్వినీ దేవతలకు మంచి చక్రములు గల రథమునుజేసి యిచ్చిరి. ఇంద్రునకు దృఢములైన గుఱ్ఱములను నిర్మించిరి. నిర్మించినారనుటవలన ఈ గుఱ్ఱములు యంత్రబద్ధములని తెలియుచున్నది. ముసలివారైన తమ తలిదండ్రులకు యౌవనముతో గూడిన ఆయుష్యమును బెంచిరి. ఈ మాటను బట్టి ఋభువులకు వైద్య శాస్త్ర ప్రావీణ్యము గూడ నున్నట్లు స్పష్టము. దూడకోసమై యోగ్యమగు ధేనువును నిర్మించిరి. ఇంతేకాదు.

"తక్ష న్నాసత్యాభ్యాం పరిజ్మానం సుఖం రథం,
తక్షన్ ధేనుం సబర్దుఘాం."

— ఋక్కు. 1.2.1.

ఋభువు లశ్వినీ దేవతలకు నిర్బంధము లేకుండ, సర్వత్ర సంచరింపగలదియు, పైనిగూర్చుండుటకు సుఖకరమైనదియు నగు రథమును, పాలు పితుకుకొనుటకై యొక ధేనువును జేసిరని మంత్రార్థము. ఈ మంత్రములోని "సబర్దుఘాం" అన్న మాటను "సర్వదుఘాం" అని కొందఱును, "కామ దుఘాం" అని కొందఱును పఠించినారు. 'సర్వ దుఘాం ధేనుం' అనగా సమస్తము నిచ్చు కామధేనువని వారి అభిప్రాయము.

కాశ్యప శిల్పమునకు ఉపోద్ఘాతము వ్రాసిన "వఝె కృష్ణశర్మ"గారు కామదుఘాం అను పాఠమును గ్రహించి కామధేనువొక మహా యంత్రమనినాడు—

"శిల్పజ్ఞా యద్య దిష్టం త త్సాధయితుం
సమర్థాం ధేనుం నిర్మముః. అనేన కామదేను
నామ్నా ప్రసిద్ధం కించి న్మహాయంత్రం భవతీతి
తర్కయామి. విశేషత స్తక్షధాతోః ప్రయో
గాత్ కృతిమత్వం లక్ష్యతే"

అన్నవి ఆయన వాక్యాలు. తక్ష ధాతువునకు శిల్పించినారనికదా అర్థము. విష్ణుని అవతారములని చెప్పబడెడి మత్స్య నరసింహాదులు గూడ యంత్రమయ శిల్పములనియె సమరాంగణ సూత్రధారాది శిల్ప శాస్త్రకారుల తలంపు.

ఈ ఋభువులకు రథాశ్వ ధేన్వాదుల నిర్మాణ చాతుర్యమేకాక, ఒక్క పాత్రను నాలుగుగా జేయు ప్రజ్ఞయు నున్నట్లు ఋభు సూక్తములంబట్టి తెలియుచున్నది. మానవ శిల్పులగు వీరు తమ శిల్ప చాతుర్యమువల్ల ఇంద్రాదులను మెప్పించి దేవత్వము నంది హవి

ర్భాగములను గూడ స్వీకరించినట్లు దిగువ మంత్రము చెప్పు చున్నది:

"విష్ట్వీ శమీ తరణిత్వేన వాఘతో
మర్తాస స్సంతో అమృతత్వ మానశుః
సౌధన్వనా ఋభవ స్సూరచక్షస
స్సంవత్సరే సమపృచ్యన్త ధీతిభిః."
— ఋక్కు 1.7.30

ఈ ఋభువుల తరువాత చెప్పదగిన మహా శిల్పి కశ్యప ప్రజాపతి. ఈయనను గూర్చి తైత్తిరీయ బ్రాహ్మణములోని ఒక మంత్ర మిట్లనుచున్నది :—

"య త్తే శిల్పం కశ్యప రోచనావత్,
ఇంద్రియావ త్పుష్కలం చిత్రభాను,
యస్మిం త్సూర్యా అర్పితా స్సప్త సాకం
తస్మిన్ రాజాన మధివిశ యేనమ్."!

ఓ కశ్యప ప్రజాపతీ! నీ శిల్పము కాంతిమంతమును, శక్తి సంపన్నమును సంపూర్ణమునై చిత్ర విచిత్రములతో ప్రకాశించు చున్నది. నీ శిల్పమునందు సప్త సంఖ్యాకులైన సూర్యులు నిలిచి యున్నారు. అట్టి శిల్ప (విశిష్టమగు భవనము) మునందీ రాజునకు ఆశ్రయ మొసంగుము. ఈ కశ్యపుడు విశ్వకర్మ యొక్క అంశావతార మని మంత్రాంతరము లనుచున్నవి. కశ్యప శిల్పముచే ప్రభావిత మైనందుననే భూమికి 'కాశ్యపి' అను పేరు గలిగినది. ఈనాటి "కాశ్యప శిల్పం" అను శిల్ప శాస్త్రగ్రంథ మీ కశ్యప ప్రోక్తమే అందురు.

ఋగ్వేదములో రథములేకాక, ఆయుధము, ధనుస్సు, కుంతము మొదలగు ప్రహరణ సాధనముల నిర్మాణ ప్రశంసయు పొడకట్టుచున్నది. ఒక మంత్రము —

"అహం రుద్రాయ ధను రాతనోమి
బ్రహ్మద్విషే శరవే హంత వా ఉ" అనుచున్నది.

అనగా నేను రుద్రునికోసమై ధనుస్సును నిర్మించుచున్నానని అర్థము. ఈ ధనుర్నిర్మాణము త్రిపురాసుర సంహారముకోసమని సాయణుల భాష్యము. మఱొక మంత్రములో చక్రములు లేని రథ మగపడు చున్నది.

"యం కుమార నవం రథ మచక్రం మనసా కృణోః"

చక్ర రహితమగు ఈ రథ మెట్లుండెడిదో ఎవరు చూచి వచ్చినారు ?

వేద కాలమున విగ్రహ నిర్మాణ కళ లేదనియు, అందుచే మూర్తి పూజ వైదికము కాదనియు కొందఱనుచుందురు. కాని ఆ వాదమును పూర్వపక్షము చేయుటకు తగిన ఆధారములు వేదమునందే యున్నవి. చూడుడు :

"క ఇమం దశభి ర్మమేంద్రం క్రీణాతి ధేనుభిః,
యదా వృత్రాణి జంఘన దథైనం మే పున ర్దదత్."
— ఋక్కు 4–20–10

"నా ఇంద్రుని పది ఆవులనిచ్చి యెవడైనను కొనినచో బాగుండును. అయితే, ఆతడు తన పాపములు నశించిన పిమ్మట నా యింద్రుని నాకిచ్చివేయవలయును" అనుచున్నాడొక శిల్పి. ఇంద్రుని కొనవలయునన్నచో ఆ ఇంద్రుడు ప్రతిమా రూపుడు కాకున్న పొసగదుగదా. దీనికి తోడు అక్కఱ గడచిన తర్వాత తన యింద్రుని తనకిచ్చివేయవలెననుచున్నాడు. దీనినిబట్టి ఋగ్వేదకాలపు శిల్పాచార్యులు మూర్తులను నిర్మించి వాటిని పూజకులకు అద్దెకిచ్చు ఆచార మున్నట్లు స్పష్టమగుచున్నది కదా !

"ఇహైవ ధ్రువాం నిమినోమి శాలాం
క్షేమే తిష్ఠతు ఘృత ముక్షమాణా"
"ఇహైవ ధ్రువా ప్రతితిష్ఠ శాలే
అశ్వావతీ గోమతీ సూనృతావతీ"

ఈ మంత్రములందు యజమానుడు వాసయోగ్యమగు భూమి యందు గృహ నిర్మాణము చేసి సత్సంతానాది సౌభాగ్యమును, గవాశ్వాదుల సమృద్ధిని గోరుచున్నట్లు స్పష్టమగుచున్నది.

ఈ యంశములనుబట్టి వేదవాఙ్మయమున గృహ నిర్మాణ కళ, రథ రచనము, మూర్తి నిర్మాణము, యంత్రమయాశ్వాదులశిల్పము, ధనురాద్యాయుధ సృష్టి ప్రస్తుతము లయినట్లు తెలియుచున్నది. ఇరకను దైవమానవ భేదములతో నొప్పు శిల్పములను గూర్చి ప్రస్తావింపనైతిని. వేద ప్రసిద్ధులగు సానగాది ఋషిపంచకమేమి, మనుమయాది బ్రహ్మలేమి, కశ్యపాది ప్రజాపతులేమి, భృగు భరద్వాజాగస్త్యాది ఋషులేమి — వీరందఱును మహా శిల్పాచార్యులేకాక, శిల్ప శాస్త్ర నిర్మాతలనిగూడ మనకు అనేక సాక్ష్యము లున్నవి. ఈ వ్యాసమున దిఙ్మాత్రముగా శిల్పప్రశంస చేయబడినది. ఇదియంతయు ఒక బృహద్గ్రంథము కావలసినంత మహా విషయము. ఈ శిల్పముల యొక్క పావిత్ర్యమును యాజుషాథర్వణ మహా శిల్పోపనిషత్తు విస్తరముగా పేర్కొనుచున్నది:

"శిల్పేనైవేద ముపబృంహితం,
యేభి స్సుఖం జీవేయు ర్లోకాః"
— శిల్పోపనిషత్తు !

క థా ని క :

# మనసున మల్లెలు

శ్రీ కె. ఎస్. వి.

"ఫ్లవర్ వేజెస్ కావాలి..." అంది సునీత.

"ఆఫీసుకెళ్ళి కార్ పంపిస్తాను-వెళ్ళి తెచ్చుకో-" అన్నాడు శంకరం బ్రైనాట్ సర్ట్ అద్దంలో చూసుకుంటూ.

"సాయంత్రం ఇద్దరం వెళ్తే... ..."

"సాయంత్రం సంగతి సాయంత్రం...... పెందరాళే తెముల్తుందో లేదో తెలీదు. ఆఫీసులో అంతా కొత్త కదూ..."

"లేడీ స్టెనో గ్రాఫర్లున్నారు కాబోలు......"

"నా ప్రియమైన సునీత! నువ్వూ ఆడపిల్లవేకదూ మరి..."

సునీత నవ్వింది. "సాయంత్రం సాధ్యమైనంత తొందరగా వొచ్చేయ్యండి..."

"ఓకే..."

"థేంక్యూ!..."

* *

ట్రాన్స్ఫర్ మీద ఆవూరొచ్చి సరిగా ఇది నాలుగో రోజు. శంకరానికి ఆఫీసులో అంతా కొత్త.

కొత్తగా దిగిన ఇంట్లో సునీతకూ కొత్తే!

కాని, సునీతకు వూరు కొత్తేం కాదు. ఆరున్నర సంవత్సరాల క్రితం ఇక్కడే డిగ్రీ చదివింది.

* * *

"గాంధీరోడ్కి పోనీ..." అంది సునీత డ్రైవర్తో. కారు పరుగెడుతోంది.

నిన్నటి దినం కూడా ఇలాగే కార్లో వొచ్చింది సునీత. డోర్ కర్టెన్ల కోసం.

బజారువెంట కారుదిగి నడుస్తూంటే చప్పున ఆదిమూర్తి గుర్తొచ్చేడు.

ఎన్ని సాయంత్రాలు అతనో కలిసి ఆ ఫుట్పాత్ మీద నడిచింది తను!

కార్ ఆపేడు డ్రైవర్, హోటెల్ భీమాస్ దగ్గిర.

"ముందుకు వెళ్ళమంటారా అమ్మగారూ?... వన్వే అంటున్నాడు పోలీసాయన ఎలాగ?..."

"వద్దులే...దిగి నడుద్దాం..."

కారు దిగింది.

హోటెల్ భీమాస్ ఎదురుగా హోటెల్ డీలక్స్! ఉలిక్కి పడింది.

డీలక్స్లోనే కదూ మొదటిసారిగా తను ఆదిమూర్తితో టీ తాగింది. "ఈ వూరంతటికీ టీ ఇక్కడే బాగుంటుంది..." అన్నాడు.

టీ తర్వాత చార్మినార్ సిగరెట్ ముట్టించేడు.

ఘాటు వాసన.

ఆదిమూర్తి దగ్గ రెప్పుడూ ఆ వాసనే.

"ఇక్కడెక్కడా ఫ్యాన్సీషాప్స్ లేవమ్మగారూ!..."

"ముందు కెళదాం..."

నడుస్తోంది సునీత.

వెనకగా అనుసరిస్తూ డ్రైవర్.

'హైకో ఫ్యాబ్రిక్' లో ఎర్రంచు తెల్ల చీరలు వ్రేళ్ళాడుతున్నాయి.

["నీకు నల్లంచు తెల్లచీర బాగుంటుంది..."

"కాదు-ఎర్రంచే..."

"కాదు - నల్లంచే..."

"సరే-నీ ఇష్టం..."]

తన బర్త్డేకి చీర ప్రెజెంట్ చేసేడు ఆదిమూర్తి. ఈ షాప్లోనే కొన్నది!

[ఆ మరుసటి దినం-బర్త్డే నాడు...

"నిజం-నీకు ఎర్రంచు తెల్లచీర కూడా బాగుంటుంది!]

"ఫ్లవర్ వేజ్లిక్కడుంటాయమ్మగారూ!......"

ఫ్యాన్సీషాప్ దాటివెళ్ళిపోయిన సునీత డ్రైవర్ మాటతో ఆగి వెనక్కొచ్చింది.

షాపతను సాదరంగా ఆహ్వానించేడు. రకరకాల ఫ్లవర్ వేజెస్ చూపిస్తున్నాడు.

షాపంతా కలయ జూస్తోంది సునీత.

గాజు వస్తువులు చాలా వున్నాయి.

వాటిలోంచి ఏవోచూపులుతొంగిచూస్తున్నాయిహృదయంలోకి.

కళ్ళు తిరుగుతున్నట్టనిపించింది సునీతకి.

రెండు ఫ్లవర్ వేజెస్ తీసుకుంది.

"ఫ్లవర్స్ చూడండి..." అంటూ ప్లాస్టిక్ పువ్వుల కట్ట వొకటి ముందుంచేడు షాపతను.

["సివిలైజ్డ్ లైఫ్‌లో ఈస్తటిక్ సెన్స్ దిగజారడానికి నిదర్శనం ప్లాస్టిక్‌పూలు...ఏమంటావు సునీ...ప్లాస్టిక్ పువ్వులు తయారుచేసేవాళ్ళని, అమ్మేవాళ్ళని, కొనేవాళ్ళని, వాటినిచూసి ఆనందించేవాళ్ళని ... అందర్నీ షూట్‌చేసి పారెయ్యాలి... ఐ హేట్ దెమ్ !......]

"పెద్ద పెద్ద పువ్వులు కూడా వున్నాయండీ..." అంటూ ఇంకో కట్ట ముందు పెట్టేడు షాపతను.

"ఏవీ వొద్దు—" అంది కరుగ్గా సునీత.

చిన్నబోయినా, పైకి నవ్వుతూ—"ఇంకేమైనా కావాలాండీ—" అన్నాడతను.

"నో థేంక్స్—"

ఫ్లవర్ వేజెస్‌తో కార్లో కూచుంది సునీత.

"ఇంటికేనా అమ్మగారూ ?..."

"వూఁ..."

టవర్‌క్లాక్ దగ్గర పడుతూండగా సునీత మనస్సులో కొత్త వూహ మెదిలింది.

"వొద్దు—ఇటు—రైట్‌కి తిప్పు..."

గోవిందరాజస్వామి గుడిగోపురం ఎత్తుగా గంభీరంగా వుంది.

[గుళ్ళూ గోపురాలూ చాలా అందంగా వుంటాయి ... కాని; దేవుడంటే మాత్రం...వూఁహూఁ...నాకు నమ్మకం లేదు..."

"పోనీలెండి దేవుడికి మాత్రం మనుషుల మీద నమ్మకం వుంటుంది... ..."

"నాన్సెన్స్! సునీ!...అది నీలాంటి వాళ్ళు కల్పించే అందమైన భ్రమ. దేవుణ్ణి చంపేస్తే...పూర్తిగా చంపేస్తే...మరుసటి దినం పొద్దునకల్లా ప్రపంచం పూర్తిగా బాగుపడిపోతుంది......"]

అంతా ఆవేశమే అదిమూర్తికి.

పోలీస్‌స్టేషన్ సమీపిస్తోంది కార్.

"యూనివర్శిటీకి పోనీ..." అంది సునీత, అనుకోకుండానే.

కొద్దిగా ఆశ్చర్యపోయేడు డ్రైవర్, సీట్లో సర్దుక్కూచుని గేర్ మార్చి వేగం హెచ్చించేడు.

ఆరు సంవత్సరాలపైనే అయింది కదూ తను కాలేజీ వదిలిపెట్టి ! ఆ తర్వాతెప్పుడూ ఇటుకేసి రానేలేదు.

అంతా చాలా మారిపోయింది.

యూనివర్శిటీకెళ్ళే దారిలోనే చాలా చాలా మార్పులు జరిగేయి. పాతచెట్లు కూలిపోయేయి. వాటి స్థానంలో కొత్త భవనాలు లేచేయి.

బాలజీకాలనీదగ్గర మునుపున్న మర్రిచెట్టిప్పుడులేదు. ఆ చెట్టు వూడలు సాయంత్రాలు ఎంతచక్కగా వూగుతుండేవి ! అదిమూర్తీ తనూ కలిసి యూనివర్శిటీ నుంచి వస్తూంటే-"రండి-రండి-టౌన్‌లోకి ఇదే స్వాగతం ! " అని ఆహ్వానించేట్టు వూగేవి !

తీరా యూనివర్శిటీ కేంపస్‌లోకి వెళ్ళేసరికి కొత్త ప్రపంచంలోకే ప్రవేశించినట్టనిపించింది సునీతకు.

కారాపించి, దిగి నడవడం మొదలెట్టింది.

లైబ్రరీదాకా నడిచింది.

ఆ దారి పొడుగునా ఏవేవో పాతవిగ్రహాలను కొత్తగా ప్రతిష్ఠించేరు.

కళ్ళు తిరిగినట్టయింది.

వినాయక విగ్రహం అరుగుమీద చతికిల పడింది.

లైబ్రరీగేటు పక్కగా ఉన్న చెట్టుకింద అదిమూర్తి నిలుచుని నవ్వినట్టయింది.

లేడీస్ హాస్టల్ నుంచి తన రాకకోసం అతనెన్నిసార్లు అక్కడ కని పెట్టుకు నిలబడాడు !

ఏమయ్యేడు అదిమూర్తి ?

కారు తీసుకొచ్చేడు డ్రైవర్.

తను అలిసిన సంగతి గ్రహించేడు.

ఎక్కి కూర్చుంది.

"అదిగో-అటు తిరుగు-కేంటీన్ వొస్తుంది......"

ఆశ్చర్యం !

కేంటీన్ ఇవతల ఇంతకుముందు బీడుగావున్న జాగాలో బ్రహ్మాండమైన బిల్డింగ్ కడుతున్నారు, నత్తగుల్ల ఆకారంలో వున్న పెద్ద బిల్డింగ్.

అధునాతనమైన ఆడిటోరియం అని చూడగానే తెలుస్తోంది.

ఆరేళ్ళ కితం ఆ పరిసరాల్లో తచ్చాడుతూ అదిమూర్తీ తనూ ఎన్ని కబుర్లు చెప్పుకున్నారో ! !

ఏదీ ఆదిమూర్తి ? ఏమయ్యేడు ?

"కాఫీ తాగుతారా అమ్మగారూ ?..."

"వూహూఁ...వొద్దు..." వాచీ చూసుకుంది సునీత.

"ఇంటికెళ్ళిపోదాం..."

కారు కదిలింది.

విశ్రాంతిగా సీటుకి జేరగిలబడింది సునీత.

కాని లోపల అశాంతి.

ప్రేమించానని అనలేదు ఆదిమూర్తి. తనూ అనలేదు. కాని ఇద్దరికీ తెలుసు. ఒకరంటే ఒకరికిష్టమని.

బైటపడని ప్రేమ.

కాని అర్థమైంది.

ఏం లాభం ?

అంతా ఆవేశం ఆదిమూర్తికి.

వాళ్ళ నాన్నతో ఏదో దెబ్బలాట. "నన్ను మరచిపో–" అని తనకో వుత్తరం, బస్, అంతే !

కలకరిగినట్టు మాయమైపోయేడు ఆదిమూర్తి.

ఏదో రైలు ప్రమాదంలో చనిపోయేడన్నారు కొందరు. కాదు మిలిటరీలో చేరేడని–కాశ్మీర్ వెళ్ళిపోయేడని-బర్మాలో స్థిరపడిపోయేడని...రకరకాల వదంతులు.

ఏదీ ఖచ్చితంగా తెలీదు.

అసలు బ్రతికున్నాడా ఆదిమూర్తి ?

తనకు సలహా ఇచ్చినంత సులభంగా అతనూ తనని మరచిపోయేడా ?...

డోర్ తెరిచి పట్టుకున్నాడు డ్రైవర్.

దిగింది సునీత.

★ ★ ★

"జీడిపప్పులేని ఉప్మా–ప్రేమలేని సంసారంలా రసహీనంగా వుంటుందోయ్...అఁ...చాలు...చాలు..." అంటూ ఇంకా ఉప్మా వొడ్డిస్తూన్న సునీతను వారించేడు శంకరం.

"పోనీ పుట్టెడు జీడిపప్పు–" అంటూ స్పూన్‌తోపిరి వేస్తోంది సునీత.

ఉల్లాసంగా ఉన్నాడు శంకరం.

అనుకోకుండా ఆఫీసులో పని తొందరగా తెమిలింది. రెక్కలు గట్టుకుని ఇంటికొచ్చేడు.

"తొందరగా రెడీ అవుతే–టౌనంతా వో రవుండేసొద్దాం..." అన్నాడు శంకరం. వాచీ చూసుకున్నాడు "ఆరవుతోందే... పోనీ... ఏదైనా సినిమా కెళ్దామా ?... ఈ వూళ్ళో థియేటర్లెలా వుంటాయో !......"

ఇద్దరూ కార్లో కూచునే సరికి ఆరుంబావు.

శంకరం డ్రైవ్ చేస్తున్నాడు. "ఏ హాల్కాం ?"

"మీ యిష్టం..."

"నీ ఇష్టం చెబ్దా..."

సీరియస్‌గా భర్తవేపు చూసి ఉన్నట్టుండి ముక్కెగరేసి వెక్కిరించింది సునీత. "వెవ్వే..." అంది.

పక్కున నవ్వొచ్చింది శంకరానికి. వోచేతో సునీత తలపట్టుకుని వూయించి "–పిచ్చి–" అన్నాడు.

"రోడ్డుమీద మీకిదేం పిచ్చి ?–" అంటూ భర్త చెయ్యి తీసి స్టీరింగ్ మీద పెట్టింది సునీత. "ఇంకా నయం ... ఆక్సిడెంటయేది..." అంది.

అంతలో ...

ఆక్సిడెంటే అయినట్టు 'కెవ్వు' మంది సునీత.

"ఏమయింది ?..." అన్నాడు శంకరం, బ్రేక్ పెడల్ తొక్కి.

కిళ్ళీబడ్డీదగ్గరున్న సినిమా పోస్టర్ని చూపిస్తూ "మల్లీశ్వరి" అంది సునీత.

ఇద్దరూ హాల్లోకొచ్చేసరికి అప్పటికే సినిమా బిగినైంది.

"నేనీ సినిమా ఇంతకుముందు చూసేను–"అన్నాడు శంకరం.

"నేనూను–" అంది సునీత, సీట్లో సర్దుకుని కూచుంటూ. "నేను నాలుగుసార్లు చూసేను" అంది మళ్ళీ. [బాగా గురుతుంది ఆదిమూర్తితో కలిసి మ్యాట్నీ చూడడం. "మనసున మల్లెలు" పాట వింటూ ఆదిమూర్తి ఏడ్చేడు. ఎందుకని ?]

శంకరం సినిమాలో లీనమైపోయేడు.

పాత సినిమా.

ఇంకా కొత్తగా వుంది. ఇప్పటికీ!

కాలం వొక్కసారిగా వెనక్కి తిరిగినట్టయింది సునీతకి.

వాసన, ఏదో వాసన, పరిచితం.

చార్మినార్ సిగరెట్ వాసన, ఘాటు.

ఆదిమూర్తి దగ్గర అదే వాసన.

ముందు సీట్లో ఎవరో దగ్గుతున్నారు.

నిదానించి చూసింది సునీత.

ఉలిక్కిపడింది.

భార్య శశికళకు పాయని మచ్చలు
నిలిచె నేటికిని నీలాంకములై
అలుకలు మలగెను వెలుగులు విరిసెను.

పోరు వలదనుచు పొందుమేలనుచు
వార లిర్వురు నవారిత రీతిని
కరగిరి - డెందము లొరగగ, ప్రేమకు
భరితానందముతో రవళించిరి.

## ప్రే మ త రం గ ము

చూపు తీపులో సుధా బిందువులు
ప్రాపయి నిల్వగ భాను శశులకును
అచ్చర తామల హర్షోత్కర్షము
ముచ్చట గొలిపెను మురుఘలు చిమ్ముచు—

పొంగి పొరలిన దపూర్వముగా నటు
వింగి దాకి హవణించెడు తీరున
ప్రేమ తరంగము - ప్రేయసీ ప్రియుల
కామదేవ తార్చా మహితమ్ముగ

యుగ మొక లిప్తగ నుల్లాసమునన్
నిగనిగ దీప్తులు ధగ ధగ మెఱయన్
జగా వెలుగులో జాయా పతులకు
నిగారములు తెలి నీటులు గులికెన్.

ఆ కంఠమ్ముగ నాసవమ్ములన్
సాకూతమ్మగు చతుర వాక్కులన్
కౌగిలింతలన్ కమనీయముగా
సాగె వసంతము సాంద్ర సుభగమై.

శివసుందరమై చిద్విలాసమై
అవతరిల్లగా ఆమని సమయము
యువ రసికుండగు రవి స విలాసత
నవనీతములో నవకము లూర్చెన్.

వనీ రమ్యమౌ వసంత వేళలు
ధునీ వేగమున తొణికిస లాడన్
సనీలిమములౌ కనీనికలలో
ఘనీభవించెను కాంత విలాసము.

## ర వ ర వ లు

రేయును పవలును రెప్పపాటులో
పోయెను — ఎటులో పొరపులు బలసెన్
సవసవగా ఎటౌ రవ రవ వాడమున్
జవజవలాడిరి చంద్ర సూర్యులిటు

రేగిన గాయము రేపె మంటలను—
సాగెను మంటలు సమర కల్పమయి—
వాగలిర్వురకు వారని వేండ్రము,
ఘోరముగా పెను హోరు ముసురుకొనె.

## వి డా కు లు

శశికళయే పటు సాహసమ్మునన్
వశము దప్పి యువ వరు విడనాడెన్
విడాకులైనవి — వేదనలో బడి
జడి జడి ధారలు జారె నేత్రముల.

మాతృ రక్తి యెటు మాయంబయ్యెనొ
ప్రాతర్వేళను ప్రదక్షిణించుచు
కన్న సంతతిని కత్తికి బలి యిడె
భిన్న భిన్నముగ కన్నతల్లి శశి.

ముక్క ముక్కలయి పుంఖపుంఖముగ
చక్క నెగిరి అవె రిక్కలయ్యెనట !
తక్కి [illegible] ము లు తా మీనములయి
ముక్కుచు మూల్గుచు మునిగి తేలునట!

తొ మ [illegible]గాడిన పూవుతో సమానంబయ్యె
వ గాడు వ్యథిత పథిక వలె శశికళయు
చం[illegible] లు గురియు గండ్రవోలికనయ్యె
వేండ్రమ్ము తీవ్రమయి విధుర భానుండపుడు.

# వేద వాఙ్మయములో శిల్ప ప్రశంస

## డాక్టర్ కొండూరు వీరరాఘవాచార్యులు

బ్రహ్మాండసృష్టి ఆరంభమయిననాడే, విశ్వశిల్పము అంకురించినది.

అతివిచిత్రము, పరమోపయోగము, ఆనందదాయకము నగు పారమేశ్వరసృష్టిశిల్పమును గాంచియే మానవులు లౌకిక శిల్పములకు రూపురేకలు దిద్దుకొన్నారు. శిల్పశబ్దమునకు కౌశలముతో గూడిన కర్మ యని అర్థము. ఈ యర్థమునందే వేదవాఙ్మయములో శిల్ప శబ్దము ప్రయోగింపబడినది. యజుర్బ్రాహ్మణములోని దిగువమంత్రములో శిల్పశబ్దమునకు కర్మకౌశల మని సాయణులు భాష్యము వ్రాసియున్నారు—

"యేభి శ్శిల్పైః పప్రథానా మదృగ్ంహత్
యేభి ర్ద్యా మభ్యపిగ్ంశ త్ప్రజాపతి
యేభి ర్వాచం విశ్వరూపాగ్ం సమవ్యయత్
తే నేమ మగ్న ఇహ వర్చసా సమఙ్ధి,"

భాష్యం: ప్రజాపతిః, యేభి శ్శిల్పైః=కర్మకౌశలైః.
రాజునకు పట్టాభిషేక మొనర్చు సందర్భమున ఈ మంత్రమును పఠించు టాచారము. దీనిభావ మిది —

విశ్వకర్మ ప్రజాపతి ("ప్రజాపతి ర్విశ్వకర్మా" అని యజురారణ్యకవాక్యము)యేకర్మకౌశలములచేత ఈ భూమిని నదీనదసముద్ర పర్వతారణ్యాదులచేత సుందరమును, సుదృఢము నొనర్చెనో, అట్లే యేకర్మకౌశలములచే ఆకాశమును నక్షత్ర తారాగ్రహమండితముగా నొనర్చెనో, ఏ కర్మకౌశలములచే వాక్కును శబ్దార్థాలంకార, రస, గుణ శోభితముగా చేసెనో—అట్టికర్మ కౌశలములచేతనో యగ్నీ! యీ రాజును వర్చస్వినిగా నొనర్చుము. అనగా శిల్పమువలె నీతడు జన మనోహరుడు కావలెనని ఆశంస.

వేదములో శిల్ప మనునది విశ్వసృష్టితోనే ప్రారంభ మగుచున్నది. విశ్వముయొక్క సృష్టి విధానమును వర్ణించు సూక్తములను విశ్వోత్పత్తిసూక్తములని విజ్ఞులు పేర్కొన్నారు. ఇట్టి సూక్తములలో "నాసదాసీన్నో సదాసీత్" అను సూక్తము మున్మొదటగా పేర్కొనదగినది. ఈ సూక్తము జగత్సృష్టికి పూర్వమున్న తత్త్వమును సత్తనిగాని, అసత్తనిగాని చెప్పుటకు వీలుగా దనియు అది "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" అన్నట్లు అవాఙ్మానస గోచర మైనదనియు చెప్పుచున్నది. దానినుండియే ఆకాశాది క్రమమున పదార్థము, జీవము ఆత్మ-మున్నుగా గల విశ్వము ఆవిర్భవించినది. ఆదిమ మైన ఈ జగత్కారణతత్త్వము జగముయొక్క సృష్టి, స్థితి లయాది సర్వకార్యములకు కారణమైనందున దానిని విశ్వకర్మశబ్దముతో వేదములోని విశ్వోత్పత్తి సూక్తమొకటి వర్ణించినది. ఆ సూక్తమునకు విశ్వకర్మసూక్త మని పేరు. ఈ విశ్వకర్మ సూక్తము ఋగ్వేదములోని దశమమండలమునందును, కృష్ణ యజుర్వేద చతుర్థ కాండమునందును కలదు. ఋగ్వేదీయ విశ్వకర్మ సూక్తమునకన్న యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తము కొంచెము పెద్దది. ఈ రెంటికిని సాయణాచార్యులవారు విస్తృతమగు భాష్యమును వ్రాసి విశ్వకర్మయొక్క పరాత్పరత్వమును, విశ్వసృష్టికర్తృత్వమును స్థాపించియున్నారు. ఆ సూక్తముయొక్క ప్రారంభమిది—

"య ఇమా విశ్వా భువనాని జుహ్వద్
ఋషి ర్హోతా నిషసాద పితా నః.
స ఆశిషా ద్రవిణ మిచ్ఛమాన
పరమచ్ఛదో వర ఆవివేశ.
విశ్వకర్మా మనసా యద్విహాయా
ధాతా విధాతా పరమోత సన్దృక్.

— ఇతి యజుర్వేదీయము.

"విశ్వవిషయాణి సృష్టి స్థితి సంహారరూపాణి —(కర్మాణి) యస్యాసౌ విశ్వకర్మా"—అని సాయణులు. ఈ సృష్ట్యాదులలోనే సమస్త కర్మములు అంతర్భవించునని వేదహృదయము. ఈ విశ్వకర్మయే ఆదిమ శిల్పి, విశ్వశిల్పి.

సృష్టికర్తకు శిల్పితో పోలికను ఋగ్వేదములోని మఱియొక మంత్రముగూడ చెప్పుచున్నది.

"బ్రహ్మణస్పతి రేతా సం కర్మార ఇవాధమత్
దేవానాం పూర్వ్యే యుగే ఽసతః స్స దజాయత"

—ఋక్కు 8.3.1.

ఆ బ్రహ్మణస్పతి ఈ జగములను కర్మారుని (కమ్మరి అనగా శిల్పి) వలె ఊది నిర్మించెను. కర్మకారుడు కొలిమిలో, లోహముల నూది వస్తువులను సృష్టించునట్లు సృష్టికర్త (ప్రకృతి (పదార్థము) నూతగా గొని, (దానిని దర్శించి— స ఈక్షత లోకాన్ను సృజా ఇతి) జగములను సృష్టించినాడని భావము. సృష్టికర్తను విశ్వకర్మ నామముతో బేర్కొనుట వేదముల కత్యంతము ఇష్టమనుటకు, పురుషసూక్తమే పరమ ప్రమాణము. పురుషుడనగా నిచ్చట మగవాడని

రింగురింగుల క్రాపు, చదరపుతల, నిడుపాటి చెవులు. అదిగో వాసన. ఆదిమూర్తి.

ఆదిమూర్తే కాదుగదా!

"భలేవుంది కదూ?..." అన్నాడు శంకరం.

తెరమీద రెండెడ్ల బండి.

"ఊరును చేరాలి..." పాట.

భానుమతి నవ్వులో — గొంతులో — చూపులో......ఎంత ముగ్ధత్వం!......

సునీత మనసు వూగిపోతోంది.

ముందుసీట్లో అతను ఆదిమూర్తేనేమో!

ఆదిమూర్తే అయితే!...చూస్తాడా తనని, గుర్తిస్తాడా? నవ్వుతాడా? పలకరిస్తాడా? ఏమంటాడు? చూడనట్టు వెళ్ళిపోతాడేమో?! వెళ్ళిపోతే?...వూహూం...

ఆదిమూర్తే కాదేమో!...ఇంకెక్కడి ఆదిమూర్తి!...వెళ్ళిపోయిన హీరో ఆఖరి పేజీలో తిరిగిరావడం—నవలలోనే!

ఇది జీవితం!......

"అంతలో పరధ్యానమా?..." అంటున్నాడు శంకరం.

ఇంటర్వెల్.

లైట్లెప్పుడు వెలిగేయో!

ముందుసీటతను—ఏడీ — లేచి వెళ్ళిపోయేడే!

కాలం మారిపోవడం గురించి మాట్లాడుతున్నాడు శంకరం. కాలం మారుతుంది. దుస్తులు మారిపోతాయి. టేస్ట్ మారిపోతుంది. సివిలిజేషన్ మారిపోతుంది. అయితే వీటన్నిటిమధ్యా—మారని దొకటుంది. ఏమిటది?

ఏమిటో చెప్పడం లేదు శంకరం. అసంబద్ధంగా మాట్లాడుతున్నాడు.

కొంచెం చిరాకనిపించింది సునీతకి. "ప్చ్!"— అంది.

సినిమా మళ్ళీ మొదలైంది.

చీకట్లో తడుముకుంటూ వొచ్చి కూచున్నాడు ఎదుటి సీటతను.

నడక—ఆ నడక—ఆదిమూర్తేనా ?

ముఖం కనిపిస్తే బాగుణ్ణు.

దగ్గుతున్నాడు.

మళ్ళీ అదే వాసన.

బయట సిగిరెట్ తాగి వచ్చాడేమో!

ఆదిమూర్తే!...సందేహం లేదు!!

ఇన్నాళ్ళకి ఇన్నేళ్ళకి మళ్ళీ ఆదిమూర్తి!

"ఆదిమూర్తీ"— అని పిలిస్తే?—పలకరిస్తే?

శంకరం ఏమనుకుంటాడు? ఏమంటాడు?

చుట్టూ జనం వొకర్తో వొకరు ఏమనుకుంటారు?

చుట్టూ జనం తమలో తాము ఏమనుకుంటారు?

—ఇంతకీ—ముందుసీటతను ఆదిమూర్తి కాకపోతే?

—గుడ్ గాడ్—

ఇన్సల్ట్ కదూ?

గుండెబరువైపోయింది సునీతకి.

అంతలో—తెరమీద—

స్వప్నపు టింద్ర జాలంలా పాట మొదలైంది—

"మనసున మల్లెల మాలలూగెనే...

కన్నుల వెన్నెల డోలలూగెనే..."

తెరమీద దృశ్యం. నలుపు—తెలుపు, అలల నిగనిగ.

మల్లీశ్వరి కన్నుల్లో కోటి పౌర్ణిమల కాంతి.

"అలలు కొలనులో!

గలగల మనినా..."

పాట సునీతగుండెలో స్మృతులకు రెక్కలిచ్చి విసురవేస్తోంది.

అంతలో—

"గడియయేని నను విడచిపోకుమా

ఎగసిన హృదయము పగులనీకుమా..."

కలుక్కుమంది గుండెలో

ఎగసిన హృదయం పగులగొట్టిందెవరు?......

ముందుసీటతను దగ్గుతున్నాడు.

—వొక్కసారిగా యీ లోకంలో కొచ్చిపడింది సునీత.

తెలినే తెలీదు—చెంపలు తడిసిపోయేయి—

ఏడుపు.

కన్నీరు.

ఎందుకెందుకు?

రోదసిలో పడేసినట్టు ఆదిమధ్యాంత రహితంగా వుండిపోయింది సునీత

'రెండోసినిమా క్కూడా వుండిపోదామా ?... అంటున్నాడు శంకరం.

ఉలిక్కిపడి చూసింది సునీత.

ఏడీ ముందుసీటతను? లేడు.

అసలు హాలంతా ఖాళీ.

ఐతే-ఇంతకీ అతను ఆదిమూర్తేనా ?

అయ్యో! మొఖం చూసివున్నా బాగుండేది.

థియేటర్ గేట్ దాటేక కార్‌స్పీడ్ హెచ్చిస్తూ-"మూడీగా వున్నావేమిటోయ్...మల్లీశ్వరి కథ సుఖాంతమే..." అన్నాడు శంకరం.

ఫుట్‌పాత్ వెంట పరుగెడుతున్నాయి సునీత కళ్ళు.

చాలాదూరం వొచ్చేసేక ఊహ ఆశవొదులుకుంది.

ఆదిమూర్తేనా? అవునేమో! అయితే?...

ఆదిమూర్తి కాదేమో!...కాకపోతే...

ఆలోచనలో కొంచెం ఏనుగెత్తింది సునీతకి.

"పరధ్యానమా?..." అంటున్నాడు శంకరం.

"ఊఁ..." అంది పరధ్యానంగా. అంతలో తేరుకుంది. "ఊఁహూఁ..."

సదిన్నర దాటేక బాల్కనీలో వాలుకుర్చీలో ని్శ్శాంతిగా కూచుని "ఇవాళ వెన్నెలుంటే బావుండునోయ్..." అన్నాడు శంకరం.

తమలపాకు చిలకలు చుడుతూ ఏమీ అనలేదు సునీత.

"మబ్బుగావుంది-వానొస్తుందేమో!..." అన్నాడు శంకరం. ఆకాశంలోకి తలెత్తి చూసేడు.

అతని వాలకం వింతగా వుంది.

సునీత మనసింకా సినిమా అనుభూతితో నిండుగా వుంది. దుప్పటి కప్పుకుని కలలు గనాలనుంది. కొంగు భుజాల చుట్టూ కప్పుకుని తమలపాకుల పళ్ళెం లోపలికి తీసికెళ్తూ- "నేను పడుకుంటాను-" అంది.

శంకరం ఆ మాట విన్నట్టే లేదు. "ఊఁ...హూఁ...హూ... ఊఁ...హూఁ...హూ..." అంటూ కూనిరాగంతీస్తూ, మధ్యలో ఆగి- "మల్లీశ్వరి కథ సుఖాంతమే గాని అందులో ఎంతవిషాదముంది!..." అన్నాడు.

సునీత వినాలని అన్నాడుగాని, సునీత అక్కడలేదని గమనించ లేదు శంకరం.

గదిలో తెల్లటి మల్లెపూవులాంటి పరుపుమీద పడుకుని దుప్పటి కప్పుకోబోతోంది సునీత. క్షణం ఆగి మసక వెలుతురులో బాల్కనీలోవున్న శంకరంవేపు చూసింది.

శంకరం గొంతు బాగుండదు. పాడడం రాదతనికి. అయినా- ఆ రాత్రి నిశ్శబ్దంలో ఆ చీకట్లో వొంటరి బాల్కనీలో తనకు తాను వినిపించుకుంటున్నట్లు...

"మనసున మల్లెల మాలలూగెనే
కన్నుల వెన్నెల డోలలూగెనే..."

అని గొంతెత్తి వెర్రిగా పాడుతున్నాడు శంకరం-

చీకటి గదిలోంచి మసక వెలుగుల బాల్కనీలోని ఆ దృశ్యం చూసి ఆ పాటవిని నిలువునా జలదరించిపోయింది సునీత.

ఉలిక్కిపడింది.

మనసులో తళుక్కున మెరుపు.

శంకరం గొంతులో ఎంత స్వచ్ఛత! ఎంత సహజత్వం!!

తన మనసులో ఆదిమూర్తి జ్ఞాపకాల మల్లెలు!

మరి-

శంకరం మనసులో ఏ మల్లెలున్నాయో!!.........





# ఆశ్చర్య కరమైన పెరుగుదల

చేతియందుండు నాణ్యంతోబాటు సుజీయొక్క ఆశ్చర్యం సహితం పెరుగుతూనే వుంది. దీనికి ఆమె ముఖంలోని చిరునవ్వే సాక్షి. ఆ చిరునవ్వు మీ చిరునవ్వుగానూ వుండనివ్వండి. నమ్మికమైన చిరునవ్వు. అది భద్రత మరియు తృప్తికి ఆధారం.

గరుడాయందు నమ్మకము యున్నచో మీ పెట్టుబడికి మంచిమొత్తం మరల మీకు లభించుటయన్న మాట. ఇప్పుడే పొదుపుచేయండి; నిజంగా అది మంచిది. ఆ తరువాయి మీకు కావలసిన సమయమందు తీసుకోవచ్చు.




Garuda

గరుడాయందు మీ ప్రణాళిక కలను నిజం చేసుకోండి

**గరుడా చిట్ అండ్ ట్రేడింగ్ కంపెనీ (ప్రై) లిడ్.**

రిజిస్టర్డు ఆఫీసు : 86 హిల్ రోడ్డు, బాంద్ర బొంబాయి-400050
సెంట్రల్ ఆఫీసు: 115-డి మౌబ్రేస్‌రోడ్డు, మద్రాసు-600018

IMAC-G-30

ఆంధ్రప్రదేశ్‌లో గల మా బ్రాంచీలు :

★ ఆళ్లగడ్డ ★ చిత్తూరు ★ కడప ★ గుడివాడ ★ హైదరాబాద్ ★ నంద్యాల
★ నెల్లూరు ★ ఒంగోలు ★ ప్రొద్దుటూరు ★ విజయవాడ.

# శృంగార ఏక ఏవ రసః*

శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రి

చైతన్య స్వరూపములయిన సర్వభూతములయందును ఇంద్రియాలకు పనిచేయు లక్షణమున్నది. ఇంద్రియములకు తాను ప్రభువై ప్రవర్తించెడు మనస్సునకు మనుష్యులమీదనే అధికారము చేయగలదన్నకీర్తి వచ్చినది. ఆ మనస్సున కొక ధర్మముగలదు. దానిపేరు ఆస్వాదాంకుర కందము. అనుభవాభిముఖమై యుండెడు లక్షణము. అనుభవప్రాప్తి ధారావాహికముగా నుండును గనుక అది రసము. తదనుభవము వలన మనస్సుపొందిన యవస్థ ఆనందము. తదవస్థను మరల మరల పొందవలయునని మనస్సెప్పుడును సిద్ధముగా నుండుటచేత అది యెప్పుడును అనుభవాభిముఖమై యుండుననియు ఆ యుండుటయే దాని ఆస్వాదాంకుర కందలక్షణమనియు చెప్పుదురు.[1] అనుభవములను మోసికొని వచ్చెడు విభావాది సామగ్రినిబట్టి మనస్సు అనుభవ భేదములను గుర్తించగలదు. అందువల్లనే శృంగారాదులయిన రసభేదములేర్పడినవి. ఏ రసానుభవమువల్లనైనను మనస్సు పొందెడు యవస్థ ఆనందమే గనుక కావ్యమున అంగిరసమేదైనను కావ్యపరమార్థ రూపమైన ప్రయోజనము ఆనందముగానే చెప్పబడుచున్నది.[2]

అది యేదైనను మనస్సునకు రసాస్వాద లక్షణమున్నది. దానికి స్వాదాత్మ యనిపేరు. మరియు నది కూటస్థరూపమనియు చెప్పబడును. అన్ని రసభావములను ఆస్వాదించుచున్నదికదా-అందుకని.

అసలు రసభావము లెన్నియనియు విచారింపవలయును. గట్టిగా నిలబడ గలిగినవి తొమ్మిది భావములు. వాటినిబట్టి వచ్చినవి తొమ్మిది రసములు. రసభావ ప్రపంచమదంతయును నింతేనా? ఇంతమాత్రము కూడా లేదని భరతుడు శృంగార—రౌద్ర—వీర—బీభత్సరసములను, రతి—క్రోధ—ఉత్సాహ—జుగుప్సా—భావములను మాత్రమే ప్రధానముచేసి చెప్పెను. ఇక మిగిలియున్నట్లు మన మనుకొనుచున్న హాస్య—కరుణ—అద్భుత—భయానక రసములును హాస—శోక-విస్మయ—భయ—భావములును వరుసగా ఆయా రసభావములనుండి సముత్పన్నములైనట్లు మహర్షి ప్రవచించెను.[3]

రసభావ ప్రపంచ మనంతమన్న తెలివిలేక కాదిట్లు సంగ్రహించి చెప్పుట. ఉపదేశము సూత్రప్రాయముగానే ఉండవలయును. దీనిని మననము చేయుటచేత ఇక మిగిలిన సమస్తమును స్వయముగా తెలిసికొనవలయును. కానిచో అనంతమైన విజ్ఞానమున ప్రత్యంశమును ఉపదేశించుట సాధ్యముకాదు. సీమితముగాని విజ్ఞానముయొక్క ఉపదేశము ముగియుట యెప్పుడు? జీవితమంతయు నుపదేశమేయైనచో ఇంక స్వయముగా ఆర్జించుకొనునదేమున్నది? స్వార్జితమును గూర్చిన చింతలేదన్నచో అస లుపదేశమెందుకు? ఉపదేశమున కెప్పుడు ప్రేరక లక్షణమే కలదు. అది యెప్పుడును సూక్ష్మరూపమున నుండును. మరియు రహస్యముగా కూడ ఉండును. అందువలన మహర్షి చెప్పినట్లు రసభావము లట్లేయుండును.

మరియు నొక విషయము కలదు. ఆలంకారికులందరును విభావానుభావ సాత్త్విక సంచారీ భావస్థాయి భావములను సర్వరససాధారణములుగా చేసియు ఉపదేశించుటలేదు. ఒక్క శృంగార రసపరముగానే ఉదాహరణములమీద వివరించుచున్నారు. ఇతర రసములను స్మరించిన వారికి వివరింపవలయునని తెలియదా? ఇట్లే శృంగారమును తెలియజెప్పినచో మిగిలిన రసభావవివేకమునందీ జ్ఞానమే దోహదము చేయగలదు. చేయగలుగుటకు మనము దానికి అవకాశమును కల్పింపవలయును. అనగా తెలియ జెప్పినదానిని స్వయముగా తెలిసికొనవలయును. అప్పుడది సమయమునకు సహాయము చేయును.

ఇంకొక్క ప్రశ్న. ఉపదేశమునకు శృంగారమును మాత్రమే ఎందుకు గ్రహింపవలయును? దేనిని గ్రహించినను ఈ ప్రశ్న దానిమీదనుపుట్టుటకు వీలున్నది. కనుక శృంగారము గ్రహింపబడినది.

ఇంతమాత్రమేకాదు. ఇంకనూ ఉన్నది.

## II

అనుకూలపడిన అర్థవిశేషమునందు అనుభవాసక్తిని చెందు మనోలక్షణమునకు రతియనిపేరు. అన్నిరసముల యనుభవమునకు ఈ రతి మనోలక్షణమే కారణము. అలంకార కౌస్తుభ గ్రంథకారుడు చెప్పిన స్వాదాత్మ ఈ రతిరూపముగానే కనిపించుచున్నది. అగుచో రతి నొక్క శృంగారమునకు స్థాయిభావముగా చెప్పుటలోగల తాత్పర్యమును విచారింపవలయును. ఆలంబన విభావరూప ఉపాధి భేదములనుబట్టి రసములును రత్యాదులును నానాప్రకారముగా నగుచున్నవి. అనగా రసము ననుభవించు మనోలక్షణముపేరు రతి. రతి శృంగారమునకు స్థాయి. అగుచో శృంగారమే రసము కావలయును. రసోవైసః[4] నిష్కలబ్రహ్మము నామరూపాభి వ్యక్తికొదిగి సకల బ్రహ్మమైనప్పుడు

సుకృతమనియు మరియు నది రసరూపమనియు చెప్పబడుచున్నది. ఏది స్వయంకర్తృకమో అది సుకృతము. వేదాంతవాక్య శ్రవణ మనన జనిత జ్ఞానముచేత ఆస్వాదనీయ మగుచుండుటచేత నా బ్రహ్మమును రస స్వరూపమనుచున్నారు. తృప్తిహేతువై ఆనందకరమయినప్పుడే ఆస్వాద నాసక్తి గలిగి స్వాదాత్మ ప్రవర్తించును. బ్రహ్మము అస్వాద్య మగుచుండుట వలన అది రసరూపమును ఆనందరూపమును అయి యున్నది. కనుక రసమనగా సకలబ్రహ్మము. తదనుభవాసక్తిగల మనోవృత్తి రూపజ్ఞానము రతి. శృంగారమే రసమయినచో శృంగారము సకల బ్రహ్మమును అగుచున్నది, అగుచో శృంగార మనగానేమి? వేదాంత ప్రసిద్ధిగల రస శబ్దమును కావ్యాత్మగా గ్రహించిన అలంకారికులు శృంగార మనగా నేమని భావించిరో కూడా విచారింపవలయును. మొత్తముమీద భరతుని వద్దనుండియు ఈ శృంగారరసము నిండు యౌవనములో ఉన్న ఉత్తమ స్త్రీ పురుష ప్రకృతులకు సంబంధించి ఉండును [5] అన్న అభిప్రాయమే రకరకములుగా అలంకారికులయందు కనిపించుచున్నది. [6] ఆనందవర్ధన అభినవగుప్త పాదాచార్యులవంటి తాత్త్వికాలంకారికులును స్త్రీ పుంసయోగమునే శృంగారముగా ప్రవచించిరి [7]. సకల బ్రహ్మము స్త్రీ పుంసాత్మకముగా నుండును. ఉన్నదనగా జగద్రూపమున వ్యక్తమైనదని యర్థము. రసరూపమైన బ్రహ్మము జగద్రూపకముకాగా జగత్తును రసరూపమైనది. శృంగ మనగా రెండనియు. అరపదమునకు దళమనియు సౌభాగ్య భాస్కరము నందు భాష్యము వ్రాయబడియున్నది. [8] రసరూపమైన బ్రహ్మము రెండుదళములుగా నున్నది. అందుచేత సకల బ్రహ్మముశృంగారరసము. రసమునకు స్థాయి రతియే గనుక శృంగార రసమునకును స్థాయి అదియేయైనది. రసముయొక్క ప్రథమావతారము స్త్రీ పుం రూపమున రెండు దళములు. సంపృక్తములు. అందువలన రసమనగా స్త్రీపుంస యోగాత్మకమైన శృంగారమేగాని మరొకటికాదు. రసముయొక్క సంపూర్ణత్వము రెండు దళములుగా నున్నది. శృంగార రస సంపూర్ణా అన్నప్పుడు శ్రీ లలితాదేవి తాను స్త్రీ పుంసాత్మకమైన సకల బ్రహ్మముగా నున్నదని యర్థము. కనుక రసమనగా శృంగారమే రసము. రసం హ్యేవాయం లబ్ధ్వా ఆనందీ భవతి. ఆ రసమునుపొంది జీవకోటి ఆనందించుచున్నది. బ్రహ్మముయొక్కయు జగత్తుయొక్కయురూపము శృంగారరసముగానున్నది గనుక జగత్తును బ్రహ్మమయము చేయుటకు కావ్యముదయించినది అనియును శృంగారరసముగానే ఉన్నది. సకల బ్రహ్మశృంగారము అరూపహార్యము. జగచ్ఛృంగారము రూపహార్యము. అనగా బాహ్యరూపసాధనమువల్లనే ఆనందానుభవము. కావ్యశృంగారము బాహ్యానంద సాధనరహితమయ్యును విద్వత్పరితోషహేతువుగా నున్నది. బాహ్యసాధనములమీద ఆధారపడిన విశ్వమానవులు రసానందము విషయమున కామోపహతులగుచున్నారు. అందువలన మోద ప్రమోదములనే ఆనందమని భ్రమించిపోవుచున్నారు. వారిని శ్రేయోమార్గములకు త్రిప్పుటకే కావ్యమవతరించినది. బాహ్యసాధనములు లేకుండ కావ్యరసములు విద్వాంసులను పరితోషము పొందజేయుచున్నవి. విశ్వులయందీ సాధనము వారికి ఆనందమును కూర్చుచున్నది. బాహ్యసాధనము లున్నచోట ఆనందము లేదు. ఉన్నను దుఃఖముతో కూడుకొనియున్నది. అది లౌకికరసము. లోకములోని రసము లప్పుడనుభవించుటకేగాని చర్వణముచేయుటకుకాదు. కావ్యరసములు అలౌకిక రసములు. చర్వణము చేయవలసినవి. ఏ విధములయిన బాహ్యసాధనములును లేక నిరీక్షణులయిన బ్రాహ్మణులా బ్రహ్మానందరసము ననుభవించుచున్నట్లే సహృదయులయిన విద్వాంసులును బాహ్యసాధనములను విసర్జించియే కావ్యరసము ననుభవించుచున్నారు. వారికిని వీరికిని పెద్ద భేదమున్నట్లు లేదు. అందుకని కావ్యానందము బ్రహ్మానంద సహోదరము. కావ్యానందమును అనుభవింప నేర్చినవాడు బ్రహ్మానందానుభవమునకు సన్నిహితుడుగా నున్నాడని యర్థము. విశ్వుల నా విధముగా పరివర్తింపజేయుచున్నది గనుక కావ్యలక్ష్యము విశ్వశ్రేయమని చెప్పబడినది–ఇట్లు జీవబ్రహ్మైక్యమునకు సాధనముగానున్న రసము శృంగారమగుటచేత అలంకారికులు దాని విషయముననే విభావాను భావాదులను నిరూపించుచున్నారు. ఆస్వాదనీయ రసములలో శృంగారము కనిష్ఠికాధిష్ఠితము.

శృంగార భేదములను చూచినను అదే రసముగా కనిపించుచున్నది. సంభోగము—విప్రలంభము—అని కదా! అవ్యాకృత పరబ్రహ్మరసము సంభోగము. వ్యాకృత పరబ్రహ్మరసము విప్రలంభము. అవ్యాకృతము నిర్విశేషము. వ్యాకృతము సవిశేషము. పరబ్రహ్మము విశేషవిధురముగా నుపలబ్ధముకాదు. అందువలన వ్యాకృత బ్రహ్మము నుపాసించి అవ్యాకృతమును పొందవలయును. శృంగారము నుపాసించి రసమును పొందవలయును. అనగా విప్రలంభము నుపాసించి సంభోగమును పొందవలయును. పరబ్రహ్మము బుద్ధి గుహా సంబంధముచేత వర్ణింపబడినట్లుగానే కావ్యమునందు రసము స్త్రీ పురుష సంబంధముచేత వర్ణింపబడుచున్నది. స్త్రీ పురుషాత్మకమైన ఉపాధి లేనిచోట రసోత్పత్తి లేదు. రస ప్రాప్తి లేదు. బిందు పీఠగత నిర్విశేష బ్రహ్మాత్మక శ్రీమత్కామేశ్వరీ కామేశ్వర మిథునమే ప్రథమ మిథునము. బ్రహ్మము రసము. బ్రహ్మాత్మకమైన యీ మిథునము శృంగార రసము.

## III

ఇప్పుడితరరసము లెందుకు గ్రాహ్యములుకాలేదో కూడా విచారింపవలయును. శృంగారము తప్ప మరొక్క రసమేదియును స్త్రీ పురుషులిద్దరును కలిసి అనుభవింపవలసినవికావు. స్త్రీ పుంసయోగమే పూర్ణత్వము. మిగిలినరసములయం దసంపూర్ణత్వమే మిగిలినది. ఇద్దరును కలిసి యనుభవింపని దానిని ఎవరికి ప్రదర్శింపవలయును?

శృంగార విభావములయందు శృంగారరసమున్నది. హాస్య విభావములయందు హాస్యములేదు. శకుంతలా దుష్యంతులయందు శృంగార రసానుభవమున్నది. సీతారాములయందు కరుణరసానుభవమున్నది. విదూషకునియందు హాస్య రసానుభవములేదు. గిరీశమునందునులేదు మనయందు హాస్యము పుట్టుటకు వారాస్పదులు. అంతమాత్రమే. గిరీశము నాయకుడైనచో హాస్యనాయకునియందు హాస్యము లేదని చెప్పవలయును. రౌద్రము రాక్షస దానవ ప్రకృతులకు సంబంధించినది. మానవులలో ఉద్ధతులకు సంబంధించినను సర్వమానవ సాధారణము కాదు. అయిన క్రోధము రౌద్రముదాకపోదు. వీరముత్తమ ప్రకృతికను గనుక ప్రకృతులందరకు నుపాదేయమైనది. దీనిని స్త్రీ పుంసాత్మకముగా ప్రయోగించుటకు వీలున్నది. విశ్వమున కుత్సాహమే శ్రేయస్సాధనము. భయానకము సృష్టించి లోకమును ప్రదర్శింపవలసినంత అవసరమైనదికాదు. మరియు వీలయినంతవరకు నది తొలగింప దగినది. బీభత్సముకూడ భయానకము వంటిదే. లోకాతీతమైన వస్తువును ఆలంబనముచేసి కావ్యము నల్లి దానివల్ల లోకమునకు చేసెడు మేలులేదు కావ్యవస్తువునందు లోకముండి తీరవలయును. పైమెట్టు కెక్కుచున్నట్లుండవలయును. విస్మయమును సృష్టించి చేయగలిగినది లేదు. మానవులయందలి ఇచ్ఛాజ్ఞాన క్రియాశాంతశక్తుల యునికిని విశ్వశ్రేయస్సునకు ప్రేరకముగా కావ్యములు నిరూపింపవలయును. అందువలన శృంగారము స్త్రీ పురుష ప్రవృత్తి రసము. ప్రవృత్తి భంగమంతయు కరుణము. ప్రవృత్తి ధర్మబద్ధముగా నుండవలయుననుట వీరము. ప్రవృత్తి జీవుని నివృత్తి లక్షణమునకు దోహదముచేయుట శృంగారమును శాంతపదమునకు చేర్చుట. ప్రవృత్తి నివృత్తులు భగవదధీనములుగా నున్నట్లు శృంగారశాంతములు కావ్యములయందు మహాకవుల యధీనము నందున్నవి. కామోపహతులయిన విశ్వులను కావ్యశృంగారమునకు త్రిప్పి శాంతమునకు చేర్చుటయే కావ్యప్రయోజనము. కావ్యశృంగారమే కావ్యరసము. అదే బ్రహ్మానంద సహోదరము అలంకారికులు శృంగారము నొక్కదానినే లక్ష్య లక్షణములలో ఎందుకు నిరూపించుటకు పూనుకొనిరో, ఇతర రసముల నెందుకందుకు గ్రహింపలేదో ఇప్పుడు తెలియవచ్చును.

## IV

శృంగారమే ప్రధానముగా కావ్యములను కల్పించుటలో భారతీయ కవుల కంతగా అభినివేశమున్నట్లు కనిపించదు. శృంగారము వాచ్యముగాను, శాంతము ధ్వన్యర్థముగాను మనవారు కావ్యములను భావించిరి. అసలు శృంగారము వర్ణింపనే రాదనువాదమును కలదు. అలా వర్ణించేవారు మూఢులని కూడ చెప్పుదురు. 9 బ్రహ్మచర్యమే వ్రతముగా ఆచరింపదగినదన్న బ్రహ్మజిజ్ఞాస యెంతయున్నదో మన పూర్వులయందు ప్రజాతంతువును కొనసాగింపక త్రెంపివేయరాదను ప్రవృత్తి మార్గమున కర్మజిజ్ఞాసయు అంతయున్నది. అందువలన కావ్యములయందు కవులు ప్రవృత్తి నివృత్తి పక్షములను సహింపక జగన్మంగళమును కోరి ప్రవృత్తిని నివృత్తికి నిమిత్తముగాచేసి కావ్యములను వెలయించిరి. అందువల్లనే కావ్యములు లోకమునకెంత సన్నిహితములుగా నున్నవో వేదాంతమునకును అంత సన్నిహితముగా నున్నవి. విశ్వశ్రేయోదాయిక లక్షణము కావ్యమునకు చెప్పిన లాక్షణికుని హృదయము నందీ యభిప్రాయము కూడ ఉన్నది.

జగత్తుయొక్క ఈ సాగుదలకు స్త్రీపురుష సంయోగమావశ్యకమే యైనను అది మరొక దానికి సాధనమేగాని అదే సాధ్యవస్తువుకాదు. స్త్రీత్వ పుంస్త్వములతోడి దేహములకంటె తాము ఏకాకారమున నేరుగానున్న జ్ఞానము కలుగుట నుద్దేశించియే స్త్రీ పురుష యోగము ప్రారంభింపబడినది. ఈ మహాయోగమునందు సిద్ధి పొందిన సాధువుల జీవితమే జగత్తునకు ఆదర్శము గనుక వారినే కావ్య నాయకులుగాచేసి వర్ణించెదరు. అట్టిచో శృంగారముగా కనిపించునది శాంతముగా పరిణమించుచున్నది. ఈ విధముగా మహాకవులు కర్మమునకు బ్రహ్మమునకు పరిణామసిద్ధిచేత ఏకరూపతను సాధించి ప్రదర్శించిరి. మహాకవులు ఆహార నిద్రాభయమైథునములను పశులక్షణములను సూక్ష్మముగా విచారించి కర్మబ్రహ్మమీమాంసా వివాదమును తాము పరిష్కరించుటకు ఈ దేశమున నడుముకట్టిరి. మన భారతీయ మహాకవులు అంతటి ప్రజ్ఞావంతులు అనుభవజ్ఞులు గనుకనే వేదాంత విచారణావసరములయందు కాళిదాసాదుల వాక్యములను ప్రమాణముగా తాత్వికులు గ్రహించిరి.

జగదుత్పత్తి హేతువైన స్త్రీ పురుష సంయోగము సంయోగ శృంగారము. వియోగము వియోగ శృంగారము. శృంగార కావ్యమున మూడువంతుల మూడుపావులు వియోగశృంగారమే వర్ణింపబడుచున్నది కదా! శృంగారముగదాయని సంయోగమును వర్ణించరేమి? అది సర్వజంతు సాధారణ కార్యము. దాని విషయమున మనదేశమున ప్రేరేపణ అక్కరలేదు. అక్కరలేని దానిని పదిమందిముందు చెప్పుట అసభ్యము. కవిత్వము కళకదా! అసభ్య విషయవర్ణనమునకు ఒక కళను కూడ జోడింపవలయునా? అందుకనియే మనకవులు వియోగ శృంగారమునే శృంగారముగా భావించిరి. నిజానికి ప్రపంచ సాహిత్యమునందు కూడ శృంగారమనగా సంభోగ శృంగారముకాదు.

వియోగమునందు మహాకవులు కావ్యనాయికా నాయకుల ముఖముగా జగదుత్పత్తి స్థితి సంహార కావ్యమీమాంస చేయించుచున్నారు. శృంగారమును శాంతమునకు పరిణమింపజేసిన మహాకవులందరును ధర్మజిజ్ఞాసాద్వారమున బ్రహ్మజిజ్ఞాసచేసి వదలినవారే. అందువల్లనే అక్కడ రసము శాంతము. శాంతము రసరాజముగా పరిగణనమునకు వచ్చుటకు కాళిదాసాది భారతీయ మహాకవులు వ్యాసవాల్మీకులను

మాచుకొనుచు ఆ విషయమున దృఢసంకల్పముతోను విస్పష్టమైన దర్శనముతోను దీక్ష వహించినట్లు రచించుటయే కారణము.

శాంతమే పరమమైన రసము. అదే ఆనందరసము. తాదృశమైన రసరాజముయొక్క వికాసమునకు శృంగారమంతగా దోహదము చేయుచున్నది గనుకనే-మరియు తన వియోగ స్వరూప ప్రదర్శనముచేత బ్రహ్మైక్యమునందు జీవున కభిలాషమును పేరేపించుచున్నది గనుకనే ఆనంద వర్ధనాచార్యులవారు శృంగారముయొక్క ప్రహ్లాదన లక్షణమును అంతగా కొనియాడినది.[10]

జగదవిచ్ఛిన్నతకు శృంగార మవసరమైనను జగత్తును నడిపించునది ధర్మము గనుక శృంగారమున కధిష్ఠానముకూడ ధర్మమే ధర్మశృంగారమే శృంగారము.

## V

ప్రకృతియందే జీవులను ఒకానొక నైతిక ధర్మమున కొదిగించి నడిపించు లక్షణమున్నది. ప్రకృతిగతమైన సృష్టిధర్మమే సర్వజీవుల యొక్కయు భౌతికాకారములను ఆయా విధములుగా స్త్రీ పుంసాత్మకములుగా రూపొందించిన విధము కనిపించుచున్నది. జీవధర్మమును జీవి ఆలోచనయు ఏకరూపమున జగత్ప్రవృత్తికి ననుకూలముగా కొనసాగుచున్నవి. శృంగారమును వ్రాయుటకు మొదలుపెట్టిన మహాకవులు ఆయా జీవధర్మ ప్రపంచ వైలక్షణ్యముమీద పనిచేయుదురు. శృంగారమును ధర్మనిష్ఠముచేసి శాంతమునకు అభిముఖముగా తాదాత్మ్యమునకు నడిపించుటను మహాకావ్య శిల్పకళగా మన పూర్వ మహాకవులు భావించిరి. కొందరు సలక్షణముగా తమ కావ్యములయందు నిరూపించిరి.

మనిషికి తాను కర్మచేయుటకు మాత్రమే యోగ్యుడని, ఆ యోగ్యతను నిరూపించుకొనుటలోనే తన మహనీయ లక్షణమున కభివ్యక్తి యున్నదని ఎరిగి ప్రవర్తించుట యందభిలాషమును పుట్టించుటకె కవులు కావ్యనాయకులను ధర్మనిష్ఠులుగా ప్రదర్శింతురు. విశ్వ మానవ సమాజములో తాను సమధికుడుగా నుండుటకు కర్మ దోహదము చేయునన్న తెలివి మనిషికి కలిగించుటయే విశ్వ శ్రేయోదాయకమైనదని ఆ విధముగా మానవజీవితమునకు ధర్మమును అధిష్ఠానముగా ప్రబోధించుటయే కావ్యలక్షణము.[11] ధర్మ రక్షణము మరియు జనరంజకము కావ్యలక్షణములు. జనరంజన మంతయును

ధర్మ సంరక్షణార్థమే. రాజు ప్రజలను రంజింపజేయుట యెందు కనగా వారు వారి ధర్మములనుండి వైదొలగక ప్రవర్తించుటకు. రాజధర్మము వంటిదే కవిధర్మముకూడ. అందువల్ల కవి తన కావ్యము నందు ధర్మ రక్షకులను ప్రధానముగా ప్రవర్తింపజేయును. తాదృశు నకు సంబంధించినశృంగారము-ధర్మశృంగారముగానేయుండును. కావ్య నాయకుడు ధీరోదాత్తుడుగా నుండవలెనన్నప్పుడు లాక్షణికుని హృదయ మున విశ్వ శ్రేయోదాయకమైన ధర్మరక్షకత్వము నాయకునియందు స్థాపించి ప్రదర్శింపవలయునని యున్నది. మహాకవులట్లే కావ్యములు రచించిరి. ధర్మరక్షకత్వమునే శ్రీరామునియందు భవభూతి లోకా రాధన యనినాడు.[12] తాదృశమైన లోకోత్తర నాయకాశ్రయణము చేత శృంగారమును నిరూపింపవలయును. లోకమునందనురక్తులును-తేజోవైదగ్ధ్యము గలిగిన ఉత్తమ ప్రకృతులును అయిన నాయక పురుషులయొక్క శృంగారము నెందుకు వర్ణింప వలయుననగా ధర్మ కర్మలకు స్త్రీ పురుషుల అన్యోన్య లక్షణము కదా నిదానము'—అందు కని.

ధర్మనిష్ఠ కలిగిన మహా కవులు నాయికా నాయకులయందు ఆంతరంగికములయిన సంస్కార విశేషములను దర్శించి పరస్పరాను రక్తికి వాటిని హేతువులుగా కల్పించెదరు. అంతేగాని బహిరుపాధులను వర్ణించి అనురాగ హేతువులుగా కల్పించరు. కల్పించినచో ఉదాత్తత యుండదు. పరిణత మనస్కులయిన నాయికా నాయకు లెప్పుడును అంతర్ముఖులుగానే యుందురుగాని బహిర్ముఖులుకారు. బహిర్ముఖ త్వమునందు పరిణతిలేదు.

పరిణతులుకానివారియందు బాహ్యోపాధుల నాశ్రయించిన కామ ప్రవృత్తియుండును. కామాత్మత వర్ణింపదగినంత గొప్ప విషయము కాదు. లోకము నేర్చుకోదగినదానిని వర్ణింపవలయునుగాని నేర్చుకొన్న దానిని పిష్ట పేషణముచేసి యేమి ప్రయోజనము? అందుకనియే ధర్మప్రపంచము నానాప్రకారము గనుక దానిని ఒక లక్ష్యమునకు గురిచేసి కావ్యమునందు వర్ణింపవలయును. ధర్మమునవలంబించినందు వలన పురుషునకు సహజముగ కలిగెడు ఉత్సాహముతోడి బలమును కవులు తమకావ్య విశేషములచేత ప్రజలయందు పుట్టింపవలయుననగా కావ్యశృంగారమునకు ధర్మమధిష్ఠానము చేయబడవలయును. చేయ బడనిచో కావ్యా లాపాంశ్చ వర్జయేత్. ఎందుకు వర్జింప వలయు ననగా అదంతయు అనౌచిత్యము.[13] ఉత్తమ నాయకత్వములేనిచోట వ్యవహారము రసాభాసమేకదా?

# VI

అన్ని రసములయందును రసాభాసముండవచ్చును. అయినను శృంగారమునందే దానికి చలామణి ఎక్కువగా నున్నది. రసాభాసమగా నేమో తెలిసినను రసమనగా నిదిగదాయనియును తెలియును. రసముకాక రసమువలె ప్రకాశించునది రసాభాసము. అనగా రసము ఫలానా అని తెలిసికొనుటలో భ్రమ ప్రమాదముల కవకాశమున్నది. విభావాది సామ గ్రిని పరిపూర్ణము చేసినప్పుడు రసముగాని, అసంపూర్ణములుగానున్నప్పు డెంతగా రసమును వర్ణించినను అది రసాభాసమేకాని రసముకాదు. మరియు అన్యోన్యాలంబనమైన ప్రేమలేనిచోట ఎంత వర్ణించిన అంత రసాభాసము. తిర్యగధమ నాయకా లంబనముగా ప్రేమవృత్తములను ప్రవర్తింపజేసినచో అది రసాభాసము. ఏకపక్షముగా కొనసాగెడు ప్రేమ రూప చిత్తవృత్తిని వర్ణించినకొద్దియు, తదాలంబన విభావమును మూఢముగా ప్రదర్శించుటయే యగును. ఇంతచెప్పిన తరువాత ఇంకను ఇది కావ్యములయం దుత్తమ తరగతి రచన కనుకూలమైనది కాదని చెప్పవలయునా?[14] దీనికివలెనే బాహ్యాభ్యంతర శృంగారచేష్టలను యదేచ్ఛగా ఉపాధులయందారోపించి వర్ణించరాదు. బాహ్యసాధనలచేత లోకమున మనిషి ఎట్లును రమించుచునే యున్నాడు. సాధ్య సామ గ్రిని తొలగించి భావాంబర వీధులకు మనిషిని తెచ్చుటకుకదా కావ్యము లుద్దేశింపబడినవి? మరల అక్కడ కూడా సాధన సామగ్రిని వర్ణిం చుట వలన కావ్యోద్దేశ్యము దెబ్బతినుచున్నది. సాధన సామగ్రిని చూపిం చిన కొలదియు మనస్సు కామచారిణియగును. భావాంబరములకు త్రిప్పినచో నది అకామహతమై మహోదాత్తమైన స్వాదాత్మ కాగలదు.

అద్వితీయ పరబ్రహ్మమునకు సదసద్రూపము లున్నట్లు[15] కావ్యమునకును సదసల్లక్షణమున్నది. మరియు పరబ్రహ్మము తాను సృజించిన జగత్తును తానే ప్రవేశించి దానిని మూర్తా మూర్తాదిక ముగా చేసినట్లు కవియు తాను సృజించిన కావ్యమునందు తన ప్రతిభా రూపమున తాను ప్రవేశించి వాచ్యార్థమును అప్రధానముగాను వ్యంగ్యా ర్థమును ప్రధానముగాను చేయుచున్నాడు. అసత్పదార్థము సత్పదార్థ ప్రతీతికి దోహదము చేయుచున్నది. కావ్యముయొక్క అసల్లక్షణము దాని వాచ్యార్థమును ప్రసవించెడు శబ్దము నందున్నది. ఆ శబ్దమును పట్టుకొనియే కావ్యమున సత్పదార్థమైన ధ్వన్యర్థమును అనుభవము మీద తెలిసికొనవలయును. బ్రహ్మము అద్వితీయము కనుక శబ్దమును బ్రహ్మమే. బ్రహ్మజ్ఞానమున కదియే మార్గము. ముల్లు పెట్టి ముల్లును తీసికొన్నట్లు శబ్దబ్రహ్మమును పట్టుకొని సత్యజ్ఞానా నంతరూప బ్రహ్మమును తెలిసికొనవలయును.

దేవతలలో బ్రహ్మయైన పరమాత్మ కవులలో పదవియై యున్నాడు.[16] పదమనగా వ్యాకరణసిద్ధమైన సుశబ్దము. తాదృశ మైన సూక్ష్మపద ప్రయోగము నెరిగిన కవులు పదవికి తగినవారు. అనగా మహాకవులు. కవియు బ్రహ్మయు నొకటే. పరమేశ్వరునకు వలెనే కవియును విశ్వశంభువు.[17] జగత్తునకు వారు సుఖమును కలుగజేయుచున్నారు. కవి బ్రహ్మ—కావ్యము జగత్తు — కావ్యానందము

బ్రహ్మానందము – ఈ విధముగా బింబప్రతిబింబములన్నట్లుండుట చేత జగదాత్మయైన బ్రహ్మము రసరూపమైనట్లే కావ్యాత్మయైన జ్ఞానము రసరూపము.

జగత్ప్రవృత్తికి స్త్రీ పుంస యోగము హేతువు. ఆ యోగమే శృంగారము. అద్వితీయమైన రసముయొక్క ప్రథమావతారము శృంగారము. శృంగార రసమే ఉపాదేయము. ఇదిచాల ప్రమాద భూయిష్ఠమైనది. దీనియనుభవము వ్యష్టి విషయము. దీని యభివ్యక్తి సమిష్టి విషయము. సమిష్టితత్త్వమును తెలియని కవి చేతిలో పతనమును, తెలిసినకవి చేతిలో ఔన్నత్యమును పొందును. దీని యౌన్నత్యమువల్ల విశ్వమునకెంత మేలు చేకూరునో దీని పతనమువల్ల అంత కీడు మూడును. అందువల్ల రసమనగా శృంగారమే రసము.

# అథో జ్ఞాపికలు

★ భోజ మహారాజు సరస్వతీ కంఠాభరణము.

1. కవికర్ణపూరగోస్వామి "అలంకార కౌస్తుభము."
2. సన్నిధానమువారి "కావ్యాలంకార సంగ్రహము." పుటలు. 313, 314.
3. శ్రీ పి. యస్. అప్పారావు. నాట్య శాస్త్రము. పుట. 200.
4. తైత్తిరీయోపనిషత్తు. అనువాకము. 7
5. శ్రీ పి. యస్. అప్పారావు. నాట్యశాస్త్రము. పుట. 202.
6. శ్రీ సన్నిధానమువారి కావ్యాలంకార సంగ్రహము పుటలు 317–320. శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి వ్యాస రత్నావళి. పుట. 55.
7. స్త్రీ ఇతి నామాపి మధురం అభినవగుప్తుడు.
   శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనోరసః
8. శ్రీ లలితా సహస్రనామ భాష్యమ్. నామసంఖ్య 376.
9. లాటీ నేత్రపుటీ పయోధరఘటీ రేవాతటీ నిష్కుటీ పాటీర ద్రుమ వర్ణనేన కవిభిః మూఢైః దినం నీయతే.
10. శృంగార ఏవ మాధురః పరః ప్రహ్లాదనోరసః
11. The moral is the measure of health, and in the Voice of Genius I hear invariably the moral tone, even when it isdisowned in words; health melody and wider horizon belong to moral sunrivility The finer the sense of Justice, the better poet. EMERSON.
12. స్నేహం దయాంచ ప్రీతించ యదివా జానకీ మపి ఆరాధనాయ లోకానాం ముంచతో నాస్తిమే వ్యథా.

    ఉత్తర రామచరిత్ర.

    క్రియాణాంఖలు ధర్మాణాం సత్పత్న్యో మూలకారణం.

    కాళిదాసు. కుమారసంభవము.
13. అనౌ చిత్యాదృతేనాన్యత్ రసభంగస్య కారణం. ధ్వన్యా.
14. వ్యాసరత్నావళి. పు. 71.
15. ఏకం సత్ విప్రాబహుధావదంతి. ఋగ్వేదము.

    1–164–46.
16. బ్రహ్మదేవానాం పదవీః కవీనామ్. తైత్తిరీయ నారాయణ ప్రశ్న. 12 అను.
17. తైత్తిరీయోపనిషత్తు. నారాయణప్రశ్న. 13 అనువాకము.



# ప్రాచీన భారత గణిత శాస్త్రజ్ఞులు

డా. విశ్వనాథ అరుణాచలం

భారతదేశంలో నాగరికత వికసించిన కాలంనుంచీ శాస్త్రవిజ్ఞానం కూడా పెంపొందుతూ వచ్చిందన్న విషయం అందరూ ఎరిగినదే. కానీ వేదకాలంనుంచి వివిధశాస్త్రాలు ఎట్లాగా మానవజీవితాలతో ముడిపడి, అభివృద్ధి చెందుతూ వచ్చినవో కొంతవరకే తెలుసుకోవచ్చు. శాస్త్రజ్ఞుల జీవితాలకు సంబంధించిన వివరాలు, వారు పరిశోధనలలో ఏ ఏ కష్టాలను ఎదుర్కోవలసి వచ్చినవో ఆ వివరాలు ఏవీ మనకు సులక్షణమైన గ్రంథరూపంలో లభింపవు గనుక భారతదేశ విజ్ఞాన శాస్త్ర వికాసచరిత్రను క్షుణ్ణంగా తెలుసుకోవటం సాధ్యంకాదు. ఈ వ్యాసంలో గణితశాస్త్ర వికాసానికి తోడ్పడిన ప్రాచీనకాల శాస్త్రజ్ఞులను గురించి కొంత ప్రస్తావిస్తాము.

## బౌధాయనుడు (క్రీ. పూ. 500-425)

క్రీ. పూ. ఐదవశతాబ్దిలో జీవించి ఒక బృహద్గ్రంథాన్ని రచించి అఖండఖ్యాతిని ఆర్జించిన బౌధాయనుణ్ణి గురించిన వ్యక్తిగత జీవితవిశేషాలు తెలుసుకొనేందుకు ఆధారాలేవీ లేవు. అయితే బౌధాయనుడు రచించిన శుల్బసూత్రములు కృష్ణయజుర్వేద భాగంగా నేటికీ ప్రచారంలో ఉన్నవి. మూడు భాగాలుగా విభాజనమైన శుల్బ సూత్రాలలో నిత్య కామ్యయజ్ఞకర్మలలో యజ్ఞవేదికల్ని రచించడానికి కావలసిన గణిత విజ్ఞానం పొందుపరచడమైనది.

భుజాలను నిర్దేశించినప్పుడు దీర్ఘచతురస్రాన్ని ఎట్లాగ నిర్మించడం, ద్విసమబాహు సమలంబ చతుర్భుజ నిర్మాణము, దత్త భుజాలుగల చతురస్రాన్ని ఎట్లా నిర్మించడం, జ్యామితీయ వైశాల్యాలను నిర్దేశించినట్లు వేర్వేరు రూపాలలో ఎలానిర్మించడం, పిథగోరస్ (Pythagoras) సిద్ధాంతమని ప్రఖ్యాతికెక్కిన లంబకోణ త్రిభుజానికి సంబంధించిన సిద్ధాంత నిరూపణ, మొదలైనవి బౌధాయన శుల్బసూత్రాలలో గ్రథితమైన విషయాలు — బౌధాయనుడే అంటాడు — "ఇవన్నీ నేను మొదటిసారిగా ప్రవచించిన రహస్యాలు కావు. నా కంటే ముందు గణితమేధావులు ప్రవచించిన సత్యాలను సిద్ధాంతాలను క్రోడీకరించి, అక్కడక్కడా క్రొత్తకోర్పులతో శుల్బ సూత్రాలను రచించినాను. చాలచోట్ల తైత్తిరీయ సంహితలోని విషయాలను ధారాళంగా వాడుకొన్నాను".

## గర్గ (క్రీ. పూ 300 ?)

సూర్యుణ్ణి, చంద్రుణ్ణి, అందమైన చుక్కల్ని చూచిననాడే మానవునిలో ఖగోళరహస్యాలను తెలుసుకోవాలనే జిజ్ఞాస పుట్టింది. అప్పటినుంచి నిర్విరామంగా కృషి చేస్తూనే ఉన్నాడు మానవుడు — వేదాలను ప్రమాణంగా తీసుకొంటే మొట్టమొదట నక్షత్రమండలాన్ని లెక్కించిన ఖ్యాతి గర్గ అనే ఖగోళ శాస్త్రజ్ఞునికి చెందుతుంది. గర్గ విజ్ఞానానికి సంబంధించిన వైయక్తిక విషయాలు లభించడం లేదు. వరాహమిహిరుని కంటే గర్గ పూర్వీకుడని వాదించేందుకు ఆధారాలు ఉన్నాయి. ఇతడు మహాభారతకాలంలోనివాడని చెప్పేందుకు కూడా ఆధారాలున్నాయి. భారతవీరుడైన అర్జునునకు జ్యోతిష్కుడుగా గర్గ ఉండినట్లు కొందరు ఊహిస్తున్నారు — శ్రీకృష్ణ భగవానుడు జననకాలమప్పటి వివిధ గ్రహ, నక్షత్రముల ఉనికిని గర్గ చక్కగా వివరించినాడు.

క్రీస్తుశక ప్రారంభంలో క్రోడీకరింపబడి గ్రథితమైన గర్గ సంహితలో గర్గ బోధనలున్నాయి— కొన్ని చారిత్ర కాధారాలనుబట్టి గర్గ క్రీ. పూ. మూడవ శతాబ్దివాడని చెప్పవచ్చు.

## లగధ (క్రీ. పూ. 900)

ప్రాచీన భారతదేశ గణితాన్ని గురించి ప్రస్తావించే ప్రతి ఒక్కరూ,

"యథాశిఖా మయూరాణాం నాగానాం మణయోయథా
తద్వత్ వేదాంగ శాస్త్రాణాం గణితం మూర్ధనిస్థితమ్".

అనే శ్లోకాన్ని వల్లిస్తారు. ఈ శ్లోకం వేదాంగ జ్యోతిషగ్రంథంలోనిది అంటారు— ఈ గ్రంథకర్త లగధఋషి. తన కాలంవరకూ అందరికీ తెలిసిన ఖగోళ శాస్త్రవిషయాలనన్నిటినీ సేకరించి, వర్గీకరించి ప్రకటించిన విజ్ఞాని లగధ. విద్యావంతుడై వేద రహస్యాలను క్షుణ్ణంగా తెలుసుకోవడానికి అత్యవసరమైన అధ్యయన భాగాలలో ఖగోళశాస్త్రమొక్కటని అందరినీ నమ్మించినవాడు లగధ. కాలమానాన్ని ప్రామాణీకరించిన ఖ్యాతి లగధకే లభించింది సంవత్సరాలు, మాసాలు, ముహూర్తాలు, లగ్నాలు, పర్వాలు దినములు,

ఋతువులు, అయనములు, ఇవన్నీ లగధ కాలంలోనే ప్రామాణ్యములయ్యాయి.

## మేధాతిథి (క్రీ. పూ. 200 ?)

మేధాతిథి వేదకాలఋషి. సంఖ్యామానాన్ని సంస్కరించి, బృహత్సంఖ్యలకు మొట్టమొదట నామకరణం చేసిన గణితజ్ఞుడు మేధాతిథి. ఋక్, సామ, యజుర్వేదాలలో వందలకొలది పనసలలో మేధాతిథి ప్రస్తావన ఉన్నది. ఈతడు కణ్వగోత్రీకుడట. ఏక,దశ, శత, సహస్ర, అయుత ($10^4$), నియుత ($10^5$) ప్రయుత ($10^6$), అర్బుద ($10^7$), న్యార్బుద ($10^8$), సముద్ర ($10^9$), మధ్య ($10^{10}$), అంత ($10^{11}$), పరార్థ ($10^{12}$) మొదలైన సంఖ్యలను ఊహించి, పేరుపెట్టిన మొట్టమొదటివ్యక్తి మేధాతిథి. అంకెలకు స్థానముల ప్రకారం విలువలను కట్టి లాక్షణికంగా సంఖ్యలను వ్రాసే పద్ధతి బాగా ప్రచారంలోకి వచ్చింది మేధాతిథి కృషివల్లనే అని చెప్పవచ్చు. భారతదేశంలో ప్రావిర్భవించిన దశాంశన గణనపద్ధతి ఖలీఫా అల్ మన్సూర్ పరిపాలన కాలంలో (క్రీ. శ. 753–774) అరబ్ దేశాలకు ప్రాకింది-

## ఆర్యభట్టు (క్రీశ. 476-?)

భారతీయ మత విషయాలలో ముడివడి, వారి సాంస్కృతిక జీవితాలలో పెనవేసుకొని అభివృద్ధిచెందిన విజ్ఞానశాఖ ఖగోళ శాస్త్రము, సూర్యసిద్ధాంతాది శాస్త్రగ్రంథాలు గ్రహ పరిభ్రమణాలను గురించి, నక్షత్ర స్థానాలను గురించి వివరంగా చెబుతాయి ఆర్యభట్టు రచించిన ఆర్యభటీయం. అమూలాగ్రం మవులిక గ్రంథంగా పరిగణింప బడనప్పటికీ, ఆర్యభట్టు నాటికి ప్రచారంలో ఉన్న సుపరిచిత ఖగోళశాస్త్ర సూత్రాల సంహితగా ఆర్యభటీయానికి సంక్రమించిన అఖండఖ్యాతి ఎన్నటికి తరగదు.

నేటి పాట్నా సమీపంలో ప్రాచీన కాలంలో కుసుమపురం ఉండేది. ఆర్యభట్టు ఈ కుసుమ పురంలో నివసించినట్టు ఆధారాలున్నాయి– శాస్త్ర ప్రాచుర్యాన్నిబట్టి అతడు కేరళ దేశీయుడని, చాణక్యునివలె కేరళమునుండి పాటలీపుత్రమువైపు వెళ్ళి యశస్సు కెక్కిన పండితుడని పలువురు అభిప్రాయపడుతున్నారు.

భారతదేశచరిత్రలో స్వర్ణయుగమని ప్రశస్తిగాంచిన గుప్తుల రాజ్యపాలన కాలంలో ఆర్యభట్టు జీవించినాడు. శాస్త్ర రంగము, సాహిత్య రంగము, కళారంగము మూడు పువు లారు కాయలుగా ముమ్మరంగా వృద్ధిచెందినపుడు ఆర్యభట్టు విజ్ఞాన పరిశోధనలు ఫలప్రదములైనాయి. ఆర్యభటీయము నాల్గు భాగాలగ్రంథము. దశగీతిక, గణితపాద, కాలక్రియపాద, గోళపాదముల పేర్లతో ఆర్యభటీయము 118 శ్లోకాల గ్రంథముగా మనకు లభించినది. భూమి గోళాకారంగా ఉన్నదన్న విషయం గ్రంథస్థంగా మనకు ఆర్యభటీయములో లభిస్తుంది. రాహువు సూర్య చంద్రులను కబళించినప్పుడు గ్రహణాలు ఏర్పడుతుందనే మతవిషయక విశ్వాసాన్ని అధిగమించి, భూమి, చంద్రుల నీడలే ఈ గ్రహణాలకు కారణాలని ధ్రువీకరించినాడు ఆర్యభట్టు. ఇంకా చంద్రుడు స్వయంగా ప్రకాశం లేనివాడని, సూర్యుని వెలుగు సోకడంవల్లనే తాను వెలుగుచున్నాడని స్పష్టంగా తెల్పి చెప్పినాడు. విషువత్తుల గమనాన్ని చర్చించినాడు. గ్రీకు శాస్త్రవేత్త టాలమీ (Ptolemy) ప్రతిపాదించిన అధివృత్తాల (Epicycle) సిద్ధాంతాన్ని గూడా ఆర్యభట్టు స్వతంత్రంగా పరామర్శించినాడు.

బీజగణితంలోనూ, జ్యామితిలోనూ ఆర్యభట్టు కృషిచేసినాడు. Π విలువను3.1416గా గణించినాడు. పిథగోరస్‌పేర ప్రసిద్ధికెక్కిన జ్యామితీయ సిద్ధాంతము ఆర్యభట్టుకు తెలుసుననేందుకు ఆధారాలు ఆర్యభటీయంలో ఉన్నాయి. సంఖ్యలను అక్షరరూపంలో వ్రాయటాన్ని కూడా మొట్టమొదట ప్రవేశపెట్టినవాడు ఆర్యభట్టు. ప్రచార సాధనాలు ఏవీలేని ప్రాచీనకాలంలో భారతవిజ్ఞాన జ్యోతిని విదేశాలకు ప్రసరింపజేసిన మేధావులలో ఆర్యభట్టు ముఖ్యుడు. అరబ్‌దేశాలలో ఆర్యభట్టు సూత్రాలు బాగా ప్రచారంలోకి వచ్చినవి. వారు అర్జబ్ హర్ అని అర్యభట్టు పేరును పలికేవారు. అనిర్ధారిత సమీకరణాల సాధనలో Solutions of Indeterninate Equations గ్రీకు శాస్త్రవేత్త డయోఫాంటస్ Diophantus కంటే ఆర్యభట్టుకే ఎక్కువ విషయాలు తెలిసి ఉండినదని చెప్పేందుకు ఆధారాలు చాలా ఉన్నాయి. కాని మన దురదృష్టమేమో ఆర్యభట్టు రచించిన బీజగణితసూత్రాలు మనకు ఇంతవరకూ దొరకలేదు.

## శ్రీసేన (క్రీ. శ.400...)

సమకాలీన పాశ్చాత్య ఖగోళవిజ్ఞాన భాండాగారాన్ని అర్థం చేసుకొని సంస్కృత భాషలో పదిలపరచిన శ్రీసేన మహానుభావుడు క్రీ. శ. ఐదవ శతాబ్దిలో ఉండినట్లు ఊహింపబడుతున్నది. సార్థకంగా తతని గ్రంథానికి రోమక సిద్ధాంతమని నామకరణం చేసినాడు. రోమకసిద్ధాంతంలోని ముఖ్య సామగ్రి పాశ్చాత్య జనితమైనప్పటికీ, ప్రతి సూత్రమును గణించుటలో భారతీయ ఖగోళపద్ధతులను; సంప్రదాయములను విరివిగా వాడినాడు శ్రీసేన. సౌరమాన, చాంద్రమాన కాలగణనాన్ని అనుసరించినాడు. రోమకసిద్ధాంతం ప్రకారం 365 దినములు, 55 నిమిషములు, 12 సెకనుల కాలవ్యవధి ఒక సంవత్సరమవుతుంది. యుగప్రమాణ గణనపద్ధతిద్వారా సంవత్సర వ్యవధిని ఉత్పన్నం చేయవచ్చు. శ్రీసేన పూర్వసిద్ధాంతులు ఉజ్జయినీ

అక్షాంశాన్ని ప్రారంభ అక్షాంశంగా తీసుకొనేవారు. శ్రీసేన యవనపుర (అలెగ్జాండ్రియా) అక్షాంశాన్ని ప్రారంభ అక్షాంశంగా తీసుకొన్నాడు. సూర్యోదయంనుంచి మరునాటి సూర్యోదయం వరకు భారతీయ సంప్రదాయప్రకారం దినపరిమాణం అయితే శ్రీసేన గ్రీకుల పద్ధతిని అనుసరించి సూర్యాస్తమయం నుంచి మరుసటి సూర్యాస్తమయం వరకు గల వ్యవధిని ఒక దినంగా తీసుకొన్నాడు.

దురదృష్టవశాత్తు శ్రీసేన రోమక సిద్ధాంతగ్రంథం మనకు లభించడంలేదు. శ్రీసేనునికి తరువాతివాడైన వరాహమిహిరుని రచనలలో పంచసిద్ధాంతాలను పేర్కొన్నాడు. ఈ పంచ సిద్ధాంతాలలో రోమక సిద్ధాంతమొకటి. వరాహమిహిరుని రచనలనుంచి మనకు లభ్యమైనవే శ్రీసేనుని గురించి ప్రస్తుతం ప్రచారంలో ఉన్న విషయాలు. రోమక సిద్ధాంతమనే పేరుతో క్రీ. శ. 1600లో రచింపబడి ప్రస్తుతం లండన్ నగరం, ఇండియా ఆఫీసు లైబ్రరీలో ఉండే గ్రంథం (ఇది అసలు మూలగ్రంథం కాదనే ఆక్షేపణ ఉన్నది) కూడా కొంత ఉపకరిస్తుంది.

## వరాహమిహిరుడు (క్రీ శ. 499 587)

మగధసామ్రాజ్యకాలంలో ఉజ్జయినిలో వరాహమిహిరాచార్యుడు జన్మించినాడు. ఇతనితండ్రి ఆదిత్యదాసు. ఖగోళ జ్యోతిష్యమునందు అసమానపాండిత్యము సంపాదించినవరాహమిహిరుడు విశ్వవిఖ్యాతిగాంచిన ప్రాచీన భారతశాస్త్రజ్ఞులలో ఒకడు. పంచసిద్ధాంతభాగము ఇతని సుప్రసిద్ధ గ్రంథము. ఇతని రచనలలో మొదటి భాగముగా ఖగోళ శాస్త్రము మనకు లభిస్తుంది. మిగతా రెండవ, మూడవ భాగములు జ్యోతిషమునకు సంబంధించినవి—తన కాలంలో బహుళ ప్రచారము ప్రతిష్ఠ పొందిన పౌలిశ, రోమక, వాశిష్ఠ, సూర్య, పైతామహ సిద్ధాంతాలను పంచసిద్ధాంతాలుగా పేర్కొని చక్కని ఖగోళవిజ్ఞానాన్ని గ్రథించినాడు వరాహమిహిరాచార్యుడు. ఈ పంచసిద్ధాంతాలలో లుప్తమైపోగా మిగిలింది సూర్య సిద్ధాంతమొక్కటి. ఆర్యభటీయ సూత్రాలను ప్రాతిపదికగా వరాహమిహిరుడు సూర్యసిద్ధాంతాన్ని ప్రవచించినాడు. కాలాన్ని యుగాలుగా, అయనాలుగా, ఋతువులుగా, నెలలుగా, పక్షాలుగా, దినములుగా, ముహూర్తములుగా, ఘడియలుగా, విఘడియలుగా విభజించడాన్ని చక్కగా విపులీకరించినాడు వరాహమిహిరుడు. అధికమాసాలు ఎట్లాగా వస్తాయో, క్షీణమాసాలు ఎట్లా వస్తాయో సహేతుకంగా నిర్ణయించినాడు — సిద్ధాంత చర్చలలో సంశయాలు ఏర్పడినప్పుడు తద్విచ్ఛిత్తికి ప్రయోగాలు చేసే పద్ధతులను సూచించినాడు. గ్రహణాలను గురించి ఆమూలాగ్రంగా చర్చించినాడు. భూమినుండి ఇతరగ్రహాలు ఎంతెంతదూరంలో ఉన్నాయో యోజనాలద్వారా గణించినాడు. గ్రహాల పరిభ్రమణ పథాలను గురించికూడా ప్రస్తావించినాడు. ఆనాటి వివాదాంశములను గూర్చి కూలంకషంగా చర్చించి సోపపత్తికంగా తన అభిప్రాయాలను వెలిబుచ్చినాడు. మనకున్న దృష్టాంతాలను ఆధారంగా భూమి గోళాకారంగా ఉందని ధ్రువీకరించవచ్చునన్నాడు — కానీ భూమికి చలనం ఉన్న సంగతి అతనికి స్ఫురించలేదు, ఇది అనార్యభటీయము.

వరాహమిహిరుని మరో రచన బృహజ్జాతకమనే పేర ప్రశస్తికెక్కింది. ఇందులో 25 అధ్యాయాలున్నాయి. జ్యోతిషంలో జాతక భాగానికి సంబంధించిన విషయాలు సమగ్రంగా చర్చింపబడినాయి ఈ గ్రంథంలో. మనకు లభ్యమైన వరాహమిహిరరచనలలో ఇంకొకటి బృహత్సంహిత. ఇందులో వృక్షాయుర్వేద భాగము ప్రధానము—

## బ్రహ్మగుప్తుడు (క్రీ.శ 598-674?)

ఆర్యభట్టు, వరాహమిహిరుల తరువాత విశ్వవిఖ్యాతి అందుకొన్న భారత విజ్ఞానవేత్త బ్రహ్మగుప్తుడు. పంజాబుగా నేడు వ్యవహృతమయ్యే సీమలో భిన్‌మల ప్రాంతంలో బ్రహ్మగుప్తుడు జన్మించినాడు. ఆ నాటి గూర్జర రాజ్య ముఖ్యపట్టణాలలో భిన్‌మల ఒకటి. ముప్ఫదియేండ్ల ప్రాయమునాడు, గణిత జ్యోతిషములను ఆపోశనం పట్టి వ్యాఘ్రముఖుడనే రాజు పోషణక్రింద, బ్రహ్మస్ఫుట సిద్ధాంతమనే బృహద్గ్రంథాన్ని బ్రహ్మగుప్తుడు రచించినాడు. బ్రహ్మ సిద్ధాంతమనే పేరిట బహుళ ప్రచారంలో ఉండి, తరువాత పండితుల విమర్శలకు గురియై లోపభూయిష్ఠమై ఉండిన విజ్ఞాన కోశాన్ని సంస్కరించి బ్రహ్మగుప్తుడు, ఆధికారిక గ్రంథంగా రూపొందించి నందువల్ల ఆ గ్రంథానికి బ్రహ్మస్ఫుట సిద్ధాంతమనే పేరుఏర్పడింది. కరణఖండ ఖాద్యాయకమనే మరో గ్రంథాన్ని కూడా వ్రాసినాడు బ్రహ్మగుప్తుడు.

బ్రహ్మస్ఫుట సిద్ధాంతంలో బీజగణితము, అంకగణితము, జ్యామితి, ఖగోళ శాస్త్రాలు ఉన్నాయి. తన సిద్ధాంతాలను ప్రతిపాదించి కాలక్రమేణ తనకంటే మునుపు, తద్విషయాలకు సంబంధించిన ఫలితాలను ఎవరెవ్వరు ప్రతిపాదించినారో చెబుతూ, తన ఫలితాలు ఎలా శ్రేష్ఠమైనవో సహేతుకంగా వివరించే పద్ధతిని బ్రహ్మగుప్తుడు తన రచనలలో పాటించినాడు—మత విషయకమైన పౌరాణిక విశ్వాసములను కూడా కొన్నిచోట్ల శాస్త్రోక్తంగా కనబడే వ్యాఖ్యానంతో సమర్థించినాడు.

"భారతీయులు గణితశాస్త్ర వికాసానికి సమర్పించిన సామగ్రి సున్న" అని హేళనాత్మకంగా పాశ్చాత్యులు మనల్ని విమర్శిస్తారన్న విషయం అందరికీ తెలిసిందే. నిజంగా గణితంలో, గణిత విశ్లేషణంలో ప్రత్యేకించి, బ్రహ్మాండమైన పరిశోధనలకు వీలుకల్పించిన "సున్న"

(Zero)ను ఒక అంకెగా మొట్టమొదట సంకల్పించినవారు భారతీయులే. అందుకే పైన పేర్కొన్న పాశ్చాత్య విమర్శను వ్యాజస్తుతిగా మనం తీసుకుంటాము. ఈ సున్నాను ప్రప్రథమంగా భావించినవాడు బ్రహ్మగుప్తుడు– సున్నను అంకముగా పరిగణించి, ఇతర అంకెలతో దీని గణిత ప్రక్రియలను సూత్రీకరించినాడు. అన్ని ప్రక్రియలను శాస్త్రబద్ధంగా నిర్వచించి, నిర్వహించినాడు. కాని సున్నను, సున్నతో భాగిస్తే భాగఫలం సున్న. ($\frac{0}{0}$=౦) అని నిర్ణయించినాడు. కాని ఇది తప్పని ఈనాటి పాఠశాల విద్యార్థి కూడా చెబుతాడు. ($\frac{0}{0}$ ఒక అనిర్ధారిత (indeterneinate) సంఖ్య అని మనకందరికీ తెలుసు.)

ద్విపరిమాణ అనిర్ధారిత సమీకరణాలను ఎట్లా సాధించవలెనో బ్రహ్మగుప్తుడు వివరించినాడు. సరళసమీకరణాలను, వర్గ సమీకరణాలను కూడా చర్చించినాడు. ఖగోళశాస్త్ర విషయాల చర్చలకు బీజగణితాన్ని (కుట్టకాధ్యాయము) మొట్టమొదట విజయవంతంగా ఉపయోగించుకొన్నాడు. గణితాధ్యాయములో అంకగణితరహస్యాలను ప్రతిపాదించినాడు–సంకలన, వ్యవకలన,గుణకార, వర్గ, వర్గమూలక్రియ, ఘన, ఘనమూలక్రియ, భిన్న, భాగప్రక్రియలను చక్కగా చర్చించినాడు. జ్యామితో బ్రహ్మగుప్తుడు అంత విశిష్టంగా కృషి చేయలేదు. లంబకోణత్రిభుజాలను వృత్తధర్మాలను, చక్రీయ చతుర్భుజాలను కొంత ప్రస్తావించినాడు. వృత్తకైవారము, వ్యాసముల నిష్పత్తి V10 అని పేర్కొన్నాడు. ఈ విలువ ఆర్యభట్టు ప్రకటించిన π విలువ కన్న శ్రేష్ఠమైనదికాదు.

ఖగోళశాస్త్రంలో బ్రహ్మగుప్తుని కృషి ప్రశస్తంగా నిలిచి ఉంటుంది. భూగోళాకారసిద్ధాంతాన్నిదృఢంచేసినాడు బ్రహ్మగుప్తుడు. గ్రహణాలను గురించి హేతువాదానికి నిలిచే విషయాలను ప్రతిపాదించినాడు. భూమికి సహజంగా ఆకర్షణశక్తి ఉన్నదని ఊహించ కలిగినాడు — జలమునకు ప్రవాహగుణము ఎట్లాగా సహజస్వభావమో భూమికి అన్నివస్తువులను ఆకర్షించడం సహజసిద్ధంగా అలవడిన లక్షణమని ప్రతిపాధించినాడు. కాని భూమి పరిభ్రమణాన్నిమాత్రం అంగీకరించక వరాహమిహిరుడు చేసిన తప్పిదాన్నే బ్రహ్మగుప్తుడు కూడా చేసినాడు.

## మహావీరాచార్యుడు :

బ్రహ్మగుప్తుని తరువాత పేర్కొన తగిన గణితాచార్యులలో మహావీరాచార్యుడు ముఖ్యుడు. ఇతడు జైనమతస్థుడైనందువల్లనేమో లేక మరే ఇతర కారణంవల్లనో — ఇతని తరువాత సుప్రసిద్ధుడైన భాస్కరాచార్యుడు తన రచనలలో ఎక్కడా మహావీరాచార్యుని ప్రస్తావనే తేలేదు. దక్షిణదేశంలో బహుళ ప్రచారాన్ని పొందిన మహావీరాచార్యుని రచనలు ద్రావిడ భాషలలోనికి అనువదింపబడినాయి — ఉదాహరణకు రాజరాజ నరేంద్రునికాలంలో పావులూరి మల్లన మహావీరాచార్యుని గణిత సారసంగ్రహమనే రచనను తెలుగులోనికి అనువదించినాడు–గణితసార సంగ్రహంలో 1, 10, $10^2$, $10^3$, $10^4$, మొదలు $10^{23}$ వరకు గల సంఖ్యలను ప్రత్యేక నామములతో పేర్కొన్నాడు మహావీరాచార్యుడు. $10^{23}$ను మహాక్షోభమని, $10^{22}$ను క్షోభమని $10^{14}$ను పద్మమని, $10^{15}$ను మహాపద్మమనిపేర్లు పెట్టుకొన్నాడు.

## శ్రీపతి (క్రీ శ. 960-1028)

ఇతడు అనేక గణిత, జ్యోతిష సిద్ధాంతీకరణ భాగాలు వ్రాసినాడని ప్రతీతి కలదు. కానీ ఇతని అన్ని రచనలలోకల్లా సుప్రసిద్ధమైనది సిద్ధాంతశేఖరమనే గ్రంథము. భాస్కరాచార్యుడు కూడా శ్రీపతిగణిత మేధా విభవాన్ని మెచ్చుకొన్నాడు. బ్రహ్మగుప్త, వరాహమిహిర ప్రభృతులకు తెలియని ముఖ్యసిద్ధాంతాలను శ్రీపతి తన రచనలలో ఉల్లేఖించి ఉన్నాడు. ముఖ్యంగా ఇతడు చంద్రగమనంలోని కొన్ని మార్పులను కనుక్కొన్నాడు ఉదయాంతర సమీకరణము (EquationOf time due to the obliquity of Ectiptic), అగ్రాంతరసవరణ (Declinat:on of the Sun కు సంబంధించినది) లను చర్చించినాడు.

## భాస్కరాచార్యుడు (క్రీ. శ. 1114-1188)

ఆర్యభట్టు, వరాహమిహిరుడు, బ్రహ్మగుప్తుల కృషి ఫలితంగా భారత విజ్ఞానజ్యోతి విశ్వవ్యాప్తంగా ప్రసారించింది — తరువాత కొన్ని శతాబ్దాలవరకు సాంఘిక రాజకీయ కారణాలవల్ల దేశంలో ఒక నిర్లిప్తత, క్షీణత ప్రబలింది. ఈ అంధయుగంలో ఏ రంగంలోనూ అద్భుతమైన సృజనాత్మకమైన కృషి సాగలేదు. ఎక్కడో ఎడారులలో ఒయాసిస్సులులాగా ఒక్కరు, ఇద్దరూ మేధావులు ప్రభవించి భారత విజ్ఞానజీవితం పూర్తిగా హతమైపోలేదని ప్రకటిస్తూ వచ్చిారు. వారిలో భాస్కరాచార్యులొక్కరు. పాశ్చాత్యాదేశాలలో 17, 18వ శతాబ్దులనాటికి గాని గోచరించని గణితరహస్యాలు, భాస్కరాచార్యుని మేధస్సులో 12వ శతాబ్దిలోనే దోబూచులాడి రూపురేఖల్ని సంతరించుకొని ఆయన రచనలలో చిరస్థాయిగా నిలిచినవి. ప్రఖ్యాత బీజగణితవేత్తగా మనం ఈనాడు భాస్కరాచార్యునికి నివాళులర్పిస్తున్నాము.

నేటి మహారాష్ట్ర భూభాగంలో శహ్యాద్రి గుడిలో క్రీ. శ. 1114లో జన్మించినాడు భాస్కరాచార్యుడు. ఇతని తండ్రి మహేశ్వరుడు స్వయంగా గణితశాస్త్రవేత్త. తండ్రివద్దనే భాస్కరాచార్యుడు గణితశాస్త్రాన్ని అభ్యసించినాడు. వంశానుగతంగా వారు గణితశాస్త్ర పారంగతులని ఋజువుచేసుకొన్నారు. భాస్కరాచార్యుని కుమారుడు

లక్ష్మీధరుడు, మనుమడు గంగాదేవుడు కూడా సుప్రసిద్ధ జ్యోతిష్కులు. భాస్కరాచార్యుడు క్రీ. శ. 1150 లో తన సుప్రసిద్ధ గ్రంథము సిద్ధాంత శిరోమణిని పూర్తిచేసినాడు. తరువాత 1183–84లో కరణకేతూహలమనే మరో గ్రంథాన్ని రచించినాడు.

సిద్ధాంత శిరోమణి నాలుగు భాగములు గల బృహద్గ్రంథము. మొదటి భాగములో అంక గణితమును గూర్చిన చర్చ ఉన్నది. దీని పేరు లీలావతి. రెండవ భాగము బీజగణితము, మూడవది గ్రహ గణితాధ్యాయము, నాల్గవది గోళాధ్యాయము. లీలావతి భాస్కరాచార్యుని కుమార్తె అట — ఆమె జ్ఞాపకార్థము తన మొదట కృతి సంతానాన్ని లీలావతి అన్నాడు — అభాగ్య అయిన లీలావతి కథ ఇక్కడ అప్రస్తుతము —

తన కాలము వఱకు వెలసిన గణిత విజ్ఞానాన్ని బాగా శోధించి కొత్తవి కొన్నిటిని కనుక్కొని, గోళాల, శంకువుల, పిరమిడ్ల, ఘన పరిమాణములకు సూత్రాలను ప్రవేశపెట్టినాడు భాస్కరాచార్యుడు. ఒక సున్న కాని సంఖ్యను సున్నతో భాగించగా అనంతము ఏర్పడుతుంది కాని మరేసంఖ్య రాదని భాస్కరాచార్యుడు విశ్లేషించినాడు. అనంత రాశికి పరిమిత సంఖ్య చేర్చినప్పటికీ, తీసివేసినప్పటికీ ఫలితము అనంత రాశియే అని ప్రతిపాదించినాడు. అనిర్ధారిత సమీకరణాల సాధనకు బీజగణిత పద్ధతులతోబాటు జ్యామితీయ పద్ధతులను కూడా నిర్మించినాడు.

భాస్కరాచార్యుని కృషిలో ఒక విలక్షణమైన అంశము మనం ప్రస్తావించుకో వలె. అతనికి మునుపు గణితజ్ఞు లందరు గణిత సూత్రాలను ప్రతిపాదించటంలో విస్తృతంగా శ్లోకాలు, దీర్ఘ వాక్యాలు వాడుతూ వచ్చినారు. నేడు మనం గణితంలో ఎన్నో సంజ్ఞలను ప్రవేశపెట్టి సూత్రాలను సంజ్ఞాత్మకంగా వ్రాయడం అలవరచుకొన్నాము. ఈ ఛాయలు కనబడేటట్లు, మొట్టమొదట మన దేశంలో గణితాన్ని వ్రాసినవాడు భాస్కరాచార్యుడు. పూర్తిగా గణిత సంజ్ఞా తత్వాన్ని వాడుకొనక పోయినప్పటికీ అతి ప్రాచీనుల కంటే ఉత్తమంగా గణిత రచనా తత్వాన్ని అవగతం చేసుకొని ఆచరించి చూపినాడు భాస్కరాచార్యుడు.

సిద్ధాంత శిరోమణిలోని లీలావతి భాగాన్ని అక్బరు పాదుషా క్రీ. శ. 1587లో అబుల్ ఫజల్ సాయంతో పర్షియన్ భాషలోకి అనువదింప చేసినాడు —

## వ్యాస రచనకు ఉపకరించిన గ్రంథాలు :


(i) వరాహమిహిరాచార్యుడు పంచసిద్ధాంతిక (**Lazarus & Co., Benaras, 1889**).

(ii) గణిత తిలకం — గైక్వాడ్ ఓరియంటల్ సిరీస్ — **Vol. LXXVIII, Baroda, 1937.**

(iii) వేదాంగ జ్యోతిషము—శ్యామాశాస్త్రి పరిష్కృతము—మైసూరు (1936)

(iv) ఆర్యభట్టు — మహా సిద్ధాంతము — బెనారసు సంస్కృత సీరీస్ **Nos. 148, 149, 150 [1910]**

(v) **Scientists of Ancient India by O. P. Jaggi AtmaRam & Co., 1966.**




*** ఉగాది పండుగ సందర్భమున మా ఖాతాదార్లకు, శ్రేయోభిలాషులకు మా శుభాకాంక్షలు ***

# గంగ, యమున, సరస్వతుల సంగమం
# త్రివేణి
# రుచి, సువాసన, పరిమళాల సమ్మేళనం
# "త్రివేణి"
## వక్కపొడి




**TRADE MARK**



Regd No. 169505

Phone: 270.

## త్రివేణి నట్ పౌడర్ మాన్యుఫ్యాక్చరింగు కంపెనీ.

సర్కిల్ పేట * మచిలీపట్నం (A.P.)

మేనేజింగ్ పార్టనర్:- దేసు వెంకట సుబ్బారావు

బ్రాంచీలు : హైదరాబాద్, సికింద్రాబాద్, కాకినాడ, గుడివాడ, ఏలూరు, విజయవాడ, నందిగామ, వరంగల్లు, భీమవరం.

# బూచి

## శ్రీ వాడపల్లి విజయభాస్కర రావమూరావు

నిరాఘాటంగా ప్రజాస్వామ్యం ప్రజ్వరిల్లిన దరిమిలా, వెలుగు పూలతో వికసి విందని అనుకోబడుతున్న బీద ఓటరు ప్రజానీకం తెలివిలా భగ్గున మండుతూ, నడినెత్తిన వెల్లివిరిసిన భారతమాత కిరీటంలా, రెపరెపలాడే బావుటాలా, ధగధగా మెరుస్తున్నాడు సూర్యుడు.

ముఖలింగానికి ఒకరి ఊసూ, జోలీ అక్కరలేదు. తన దోవన తాను పోతాడు. గొడవలంటే అతనికి భయం.

అసలు ఆ కుటుంబమే అంత. మతసామరస్యం తమ నమ్మిక అని సర్వత్రా చెప్పడానికేమో మొదటి బిడ్డకి ముఖలింగాచారి అని నామకరణం చేశారు. శైవవైష్ణవ భేదాలు మనం కల్పించుకున్నవే అని అందరూ అనుకోవాలనే విశాలపు హృదయం వార్నది.

అగ్రహారం గృహస్థులంతా పాడి మెతుకులుతిని కాస్తంత ఎండ తీవ్రత మరిచిపోడానికి కూటి కునుకు తీస్తున్నారు.

నల్లటిరోడ్డు నదిలా మిలమిలా మెరుస్తోంది.

కావిట్లో తాటికాయలువేసుకుని కత్తి జిగ్గుమని మెరుస్తుండగా చెమటతో తడిసిన నల్లటిశరీరం జిగి కత్తి జిగితో పోటీపడుతుండగా గోచిపాత కట్టుకున్న యువమనిషి 'ముంజులూ, ముంజులూ' అంటూ పరుగులాంటి నడక సాగిస్తున్నాడు. లయబద్ధంగా కావిడి కుయ్ కుయ్ మంటోంది.

తెల్లటి మాసిక వేసిన గొడుగుతో యాయవారం బ్రాహ్మడు తెరిచిన తలుపులుకోసం చూడకుండా వాడిక ఇళ్లు పూర్తి చేయడానికి తలుపుకొట్టి లోపలకెళ్లి భిక్ష పలికించుకుంటున్నాడు.

ముఖం ఎర్రగా జేవురించిన ముఖలింగాచారి అరుగెక్కి తలుపు గడియ టకటకా కొట్టాడు.

"తలుపు తియ్యండర్రా! చిన్నబట్టతో ఉన్నాను."

-కోమలవల్లి వంటింట్లోంచి ముందుగదిలోకి కేకేసింది.

"వస్తున్నా!" పరుగున వెళ్లి-తలుపు తీశాడు చిరంజీవి శఠగోపాచార్యులు.

"వెధవల్లారా! ఎండబడివస్తే వెంటనే తలుపు తీయాలన్న జ్ఞానంలేదూ? కాళ్లు మాడిపోయాయ్"

—పాపం ముఖలింగాచారికి జోళ్లు తొడుక్కునే అదృష్టం లాంటి సుఖంలేదు. పావుకోళ్లు వేసుకుంటే వింతగా చూస్తారు ప్రజ. తోలు జోళ్లైతే కాళ్లు దురదపుట్టడం, వాచిపోవడం, డాక్టర్లు ఎలర్జీ అనడం ఇత్యాది బాధలతోపాటు పదీ పాతికా మందులకి ఖర్చు.

గబగబా మరోసారి చెంబుడు నీళ్లతో ముఖమూ కాళ్లూ కడుక్కుని మడిపంచ కట్టుకుని పీటవాల్చుకు కూర్చున్నాడు ముఖలింగం.

దహో తులిద్దరూ వీధిసావిట్లో కిటికీలో కూచుని రైలు ఆట ఆడుకుంటున్నారు.

"అమ్మా: బిచ్చ వెయ్యండమ్మా!"

కిటికీలోంచి చూశాడు చిరంజీవి.

"అమ్మో! బూచి"

—తక్కున తలుపు జేరవేసేశాడు.

"నేనూ చూస్తా(నా బూచిని..."

—అలివేల్ మంగతాయారు అడిగింది అనునయంగా.

"అమ్మో! సంచిలో పడేసి పట్టుకుపోడూ!"

రోగిష్టిదాన్ని బాబూ! పిడికెడు గింజ లొడెయ్యండి, గంజి కాసుకుంటా!"

"వెళ్లెళ్లు, పనిలేకపోతేసరి" ఒక ఇల్లాలు కసిరి కొట్టింది.

బిచ్చగత్తెకి నాలిక పిడచకట్టుకుపోతోంది.

దాహం! దాహం!

కాసిని నీళ్లైవరైనా పోస్తే బాగుణ్ను.

మ్యునిసిపాలిటీ కుళాయివేపు జాలిగా చూసింది. మొండి చెయ్యిలా బుర్రలేని గొట్టం.

సాయంకాలం గంటతప్ప మరి పడదు. మళ్లీ సాయంకాలం వరకూ అంతే. ఎక్కడా నీటి తడైనాలేదు.

సిమెంటు దిమ్మా, చప్టామాత్రం నున్నగాఉన్నాయి. దిమ్మ

వెనకాల ఎత్తైన గోడమధ్య సున్నగా పాలరాయిమీద కొట్టవచ్చినట్టు కనపడుతున్నాయి అక్షరాలు.

బిచ్చగత్తె తెరిచిన వాకిళ్లకోసం చూస్తోంది.

తలుపులు అన్నీ వేసే ఉన్నయ్.

కిటికీలోంచి పిల్లలు కనిపించారు.

"పాపా! కాసిని నీళ్లు పొయ్యవూ! బాబూ, పేనం కడంటి పోతుంది. బుక్కెడు నీళ్లొయ్యవా! మాతల్లే, మాతండే!"

బూచి మెడలో ఇత్తడి బిళ్లవంకే చూస్తున్నాడు తలుపు సందులోంచి బాబు.

కిటికీదగ్గరగా వచ్చి మళ్లీ అడిగింది బిచ్చగత్తె.

లోపల భోజనానికి కూచున్న ముఖలింగానికి కోపం వచ్చింది,

"వెధవపోరు! వెధవపోరా అని. పిల్లల్నిటు పిలువ్. తలుపు తీసిఉంటే ఇదేగొడవ."

"ఒరేయ్, తాతగారు దెబ్బలాడుతున్నారు. తలుపులువేసి లోపలకు రండి."

కోమలవల్లి వెంటనే భర్త తాఖీదుని దహో్రతుల కందజేసింది.

"బాబూ, బుక్కెడు నీళ్లు...కళ్లు పేలిపోతున్నాయి."

నడుం కిందనుంచీ పిక్కలమీదివరకూ వింత్తైనా గుండారు. మీదనొక జాకెట్టులాంటి చాలీ చాలని రవిక.

క్లాస్ ఎగొట్టి ఎండవేళ నిద్రపోడానికి ఇంటికివస్తున్న కాలేజీ కుర్రాడు బిచ్చగత్తెవైపు చూశాడు. హిందీసినిమాలో క్లబ్‌డాన్సర్ కాస్ట్యూమ్స్, టూషిన్‌డెన్ ఇది చూసే డిజైన్ చేయబడిందేమో ననుకున్నాడు. డిజైనర్ నిజజీవితంలో ఏదీ చూడకుండా, ఏ నమూనా లేకుండా ఎలా డిజైన్ చెయ్యగలడు మరి!

విమెన్స్‌కాలేజీ అమ్మాయి అటే వస్తోంది.

వింతైన పృగారావంచేసే బిచ్చగత్తె కింద పడిపోయింది.

"అమ్మమ్మ, బూచి కిందపడిపోయింది."

–పాప లోపలికి దౌడుతీసింది.

కాలేజీ విద్యార్థిని అలా నుంచుండిపోయింది.

మూడు గజాలదూరంలో కిందపడి వింతగా అరుస్తోంది బిచ్చగత్తె –

ఆమె బిగువునే చూస్తోంది విద్యార్థిని.

వీళ్లేం తింటారసీ, ఇంత బిగువుగా ఉంటారు? మూడేళ్లు ప్రయత్నం చేస్తోంది, ఏవరేం చెబితే ఆ చిట్కా...ఏం ప్రయోజనం? కిందకు చూసుకుంది అందుకే తన వంక ఎవరూ చూడరు. పక్కా వాళ్ల మేనల్లుడు, అదే అటూపోర్షన్లో...ఒక్కడే ఉన్నాడు ఇంట్లో. తన ఇంట్లోనివాళ్లూ ఎక్కడికో వెళ్లారు. రాత్రివేళ పిండారబోసి నట్టు వెన్నెల. పట్టెమంచంమీద తెల్లటి తలగడమీద తలపెట్టుకుని పడుకుంది. అసలు తనవంకైనా చూడకుండా అటువైపు మరో మంచంవేసుకుని పక్కన టెబిల్ల్యాంప్ పెట్టుకుని పుస్తకంలో మునిగి పోయాడు.

ఛీ! తన బతుకు వ్యర్థం.

అటుపక్కనుంచి డాక్టరుగారి దగ్గర ప్రత్యేక సలహాకోసం రిక్షాలో వస్తున్న నగలవ్యాపారి అటుబోతున్న రిక్షావాడిని ఆపేశాడు. "డా టుగారు మళ్లీ ఇంటికి వచ్చేస్తారు. తొందరగావద.

రిక్షావాడు రిక్షాదిగి పక్కనుంచి బండి లాగుకుపోయాడు. బిచ్చగత్తె వింతకేకలు గుండెల్లో దడపుట్టిస్తున్నాయ్.

చుట్టూ ఒక గుంపు చేరింది.

"నీళ్లు! నీళ్లు!"

ఆదరా బాదరా అటువచ్చిన ఒక యువకుడు.

"నీళ్లు!" ఎన్నో గొంతులు.

ముఖలింగంగారు తలుపు తెరిచారు.

"నీళ్లు కావాలి మాష్టారూ!"

"నీళ్లెక్కడివి? సాయంకాలంవరకూ పంపురాదు. నూతిలో నీళ్లు అమ్మాయి బట్టలు ఉతకడానికి తోడేసింది!"

"పోనీ తోడుకోమందురూ!" కోమలవల్లి మెత్తబడింది.

"ఎవరు తోడుతారు?"

"నేవెళ్లి తోడుకువస్తా" లోపలకెళ్లి బాల్చీనిండా నీళ్లు తోడుకు వచ్చి బిచ్చగత్తెమీద దిమ్మరించాడు.

బిచ్చగత్తె మెల్లగా కదిలింది.

"ఇంకొక్క బకెట్టు!" గుంపులోంచి ఉచిత సలహా.

సిల్కుచొక్కా ఆసామీ గుడ్లప్పగించి చూస్తున్నాడు.

తను బొంబాయినించి తెప్పించుకున్న పుస్తకం కళ్లముందు మెదిలింది.

అబ్బ! ఎంతపొంకం! తన పుస్తకంలోని నూటఒక్క బొమ్మల్లోనూ ఇంత పట్టైన దెక్కడాలేదు.

మరో బాల్చీ, మరో బాల్చీ...

గుంపులో మనుషులు డబ్బులు పడేస్తున్నారు.

పావలా, పదిపైసల్లూ, ఐదుపైసల్లూ, అర్ధరూపాయిలూ...

గుంపును దూరంనుంచి చూసిన ఐస్‌క్రీం అబ్బాయి గబగబా అటు వచ్చాడు.

బిచ్చగత్తె చుట్టూ చేరిన చిల్లర చూసి కళ్లు మిటకరించాడు.

"అబ్బ! రోజంతా ఎండలో సచ్చి అయిస్‌క్రీం అమ్మితే సాయంకాలానికి ముప్పావలా ఇవ్వడానికి షావుకారు పావుగంట గుసు స్తాడు".

మరోపావలా, మరో అర్ధరూపాయి...

మీద మీద లెక్కపెడితేనే ఆరున్నర...తను వారంరోజులు తిరి గినా రానంత...

ముఖం చిట్లించే ముఖలింగం బిచ్చగత్తెవైపు చూస్తున్నాడు.

"రండి లోపలకి...కోటివిద్యలూ కూటికోసమే. వెధవవేషాలు పిక్కలా ఉంది చూడడానికి, దీనికేం జబ్బు!"

తలుపు ధడేలున వేసింది కోమలవల్లి.

ఎదురుంటి మీనాక్షమ్మ భర్తను జా గత్తపెట్టుకుంది.

"మీకింకా చిన్నతనం పోలా! ఏమిటా చూపు"—చిన్న సణుగు సణిగింది మరో ఆవిడ. తనకంటే ఎత్తరి, ఆజాను బాహువూ అయిన భర్తని చేతితోలాగే ధైర్యమూలేక, శక్తీచాలక తనుమాత్రం లోపలికి వెళ్ళిపోయింది.

"వెధవ ముండలకి తెలివితేటలకి లోపంలేదు"—పూర్వసువా సినీ వెళ్ళిపోయింది.

చోద్యం చూడడం పూర్తయ్యింది.

గుంపు పలచబడిపోతూంది.

స్పృహలేని బిచ్చగత్తె, మొండి చెయ్యి, కుళాయిదిమ్మ, తంబేలు డొక్కూ ఇవే మిగిలాయి.

వైద్యవిద్యార్థి అటు వచ్చాడు.

ఇది ఏ రోగలక్షణం? ఎకడమిక్ ఇంటరెస్ట్ ముంచు కొచ్చింది. మెడిసిన్ ప్రొఫెసర్ వల్లించుతుండగా మింగేసిన నాలుగు ముక్కలూ నెమరు వేసుకున్నాడు...పెటిట్ మాల్. గ్రాండ్ మాల్, ఎపిలెప్సీ, వాసోవేగల్ ఎటాక్. ఇడియో పథిక్ కాజెస్.. ఓ సిగరెట్టు కాల్చుకోవాలనిపించి జేబులు తడుముకుని పెద్ద పెద్ద అంగలేస్తూ ముందుకు సాగాడు.

బాల్చీతో నీళ్లు తీసుకొచ్చిన యువకుడుమాత్రం మిగిలాడు. అంతా వెళ్లిపోతుంటే తెల్లబోయి చూస్తూ.

ఎదురుగా కారు! ప్లస్ గుర్తు.

ప్లస్ అంటే చేర్చు! చేర్చడమే డాక్టర్లకి గుర్తు.

కారు ఆగిపోయింది. తోలేవాడు మనిషైతే చూస్తూ మనిషి మీదనుంచి ఎలా తోలేస్తాడూ?

"డాక్టరుగారూ! డాక్టరుగారూ! దయచేసి ఈమెనోసారి చూడండి," ఆవేశంగా అన్నాడు.

—ప్రొఫెషనల్ ఎథిక్స్-అవే వృత్తిపరమైన నడవడిక సూత్రాలు—ప్రొఫెసర్ ఇచ్చిన లెక్చర్ ఎందుకో గుర్తొచ్చింది డాక్టరు గారికి.

ఒకటీ అరా మనుషులింకా అక్కడ ఉన్నారు. ఆ వీధిలో తన పరువేం కావాలి? డాక్టరు మంచిమనిషి అనిపించుకోకపోతే తన దగ్గ రకు అంతమంది ఎలావస్తారు?

తలుపు తెరిచి దిగారు డాక్టరుగారు.

రోడ్డుమీదే స్టెతస్కోపుతో ఆమె గుండెనొకసారి పరీక్షచేసి నాడి చూసి, కనురెప్పకిందచూసి నోరువిప్పబోయి ఆగిపోయారు.

"ఈమెకు ఆక్సిజన్ ఇవ్వాలి. తొందరగా ఆస్పత్రికి చేర్చండి. నిముషాలు చాలా ముఖ్యం. పెద్దాసుపత్రికి తీసుకుపోండి."

"డ్రైవర్ కారు బ్యాక్ చెయ్యి!"

కారులోకెళ్లి కూచున్నారు.

తలుపు ధడేలున మూసుకుంది.

ముఖలింగంగారు మడిపంచె ఇప్పేసి లుంగీ చుట్టుకున్నారు. "అబ్బ! ఈ వెధవ పూతిక లొకటి. గొప్ప చికాకు" లుంగీ దులుపు కుంటున్నారు.

వీధి నిద్రపోయింది.

# నేనెరిగిన మల్లంపల్లి శర్మగారు

### శ్రీ తిరుమల రామచంద్ర

**1923లో** శారద మాసపత్రిక రంగు రంగు బొమ్మలతో, వ్యాసాలతో, కవితలతో వచ్చేది. దాని మొదటి సంచికలో హిందూదేవాలయములు అనే వ్యాసం చూచాను. నా పదో ఏట. నాది హంపీ సివారులోని కమలాపురం. విజయనగరరాజులు తమ రాణివాసంకోసం కమలాలు పెంచేవారట మావూరి చెరువులో. అందువల్ల దానికి కమలాపురం అని పేరువచ్చిందట. మా వూరి చుట్టూ పాడుపడిన దేవాలయాలే. పాడుపడిన రాచనగరులే. కనుక దేవాలయాలపై ఆసక్తికొద్దీ ఆ వ్యాసం చదివాను. మన సంస్కృతికి, విజ్ఞాన ప్రగతికీ కళలకూ, ధర్మప్రబోధానికీ దేవాలయాలే ఆధార మని, ఇంకా ఏవేవో విషయాలు దానిలో ఉన్నాయి. నాకు సరిగా అర్థంకాకపోయినా, సారాంశం తెలిసింది. దానిని వ్రాసినవారు ఎవరా అని చూచాను; శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ అని వుంది. మరొక సంచికలో "కృష్ణదేవరాయలు" అనే వ్యాసం చూచాను. నాకు మరింత అభిమానం కలిగింది.

ఆ ఆసక్తితోనే మరొక సంచిక చూచాను. దానిలో "భ్రమర ప్రబోధము" అనే గీత మాలిక పడింది. పేరు మల్లంపల్లి సోమ శేఖరశర్మ. నాకు చాలా కోపం వచ్చింది. కోపంతో చదివాను. ఎక్కడ చూచినా కవితాచర్చేనా! ప్రబంధాల బంధాల పర్యవేక్షణలేనా? చదివాను:

> మల్లికామ తల్లులు కెంజివుళ్ళు దొడిగె
> చిగురు చివురున చిరుమొగ్గ చెన్నుమీరె
> మొలక నవ్వుల మొగ్గలు తొలకరించు
> కొసం యొయిరి క్రొంగ్రొత్త కూర్పుతేనె
> పదవె తుమ్మెద నీ పంట పండెనేడు."

ఈ విధంగా సాగింది గీత మాలిక. కవిత ఎంతోబాగుంది. అట్లే ఆయన కవితనే చేసివుంటే గొప్పకవి అయ్యేవాడు. అవార్డులు వార్డులూ పొందేవారేమో! కాని మన అదృష్టం. ఆయన చరిత్ర రంగంలో పడ్డారు. తెలుగుదేశానికి అపూర్వమైన కానుక లిచ్చారు.

తర్వాత పదేళ్లకు 1933లో ఆంధ్రపత్రిక కార్యాలయంలో విజ్ఞాన సర్వస్వం సంపాదకులుగా ఆయన వున్నప్పుడు అయనను దర్శించాను. కొంచెం చనువు ఏర్పడిన తర్వాత, ఆయన భ్రమర ప్రబోధంపై నాకు కలిగిన కోపం సంగతి చెప్పాను. ఆయన చాల అందమైనవాడు. మందహాసంచేసి, "మీరు చాల పొరపాటుపడ్డారు. కవికున్న గౌరవం సంఘంలో ఎవరికున్నదండీ? చరిత్రకారుడు పీనుగులుమోసేవాడు, స్మశానాలు త్రవ్వేవాడూను. ఏరాజు ఎక్కడ, ఎందుకు, ఎప్పుడు, ఎలా, దేనితో చస్తే నేమిటట? ఏ రాజుకు ఎందరు రాణులు వుంటేనేమిటట? — అని అంటారు జనం. కవి తమను తాము కోరిన ఊహాలోకాలకు తీసుకు వెళ్లతాడు కదా అని జనం అనుకుంటుంది" అన్నారు.

"మరి మీరు కవితను ఎందుకు వదిలారూ" అని ప్రశ్నించాను. "ఎవరి పిచ్చి వారికి ఆనందం!" అన్నారు ముక్తసరిగా. కాని, నేను మాత్రం గట్టిగా చెప్పాను, "కాదు, మీరు ఉద్దేశ పూర్వకంగానే చరిత్రలో అడుగుపెట్టారు" అని.

'శారద' సంవత్సరంపాటు వచ్చి ఆగిపోయింది. భారతి అదే పద్ధతిలో వచ్చింది 1924 లో. ప్రారంభ సంచికలలోనే ఆహ్లాదకర శాసనం చర్చలు ప్రారంభమయ్యాయి. ఈ శాసనం గుంటూరు జిల్లాలో దొరికినట్లు ఫ్లీట్ తెలిపారు. ఇండియన్ యాంటిక్వేరీలో ప్రచురించారు. ఫ్లీట్ దీనిని తమిళభాష అనుకుని తమిళ శాసనాలలో చేర్చారు.ఈ శాసనం ఎనిమిదవ శతాబ్దంది అయివుంటుందని (715–751) బర్గెస్ భావించారు; కాని, సరైన కాల నిర్ణయాధారాలు లేనందున శాసనం సరైందది కాదని అనుకున్నారు. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు దానిని పరిశోధించి అది తెలుగు శాసనమని నిర్ణ యించినారు. నేటికీ దీని పూర్తి అర్థం తేలలేదు.

శ్రీ శర్మగారు 1922 లో వెలువడిన రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచికలో "ప్రాచీనాంధ్ర భాషా స్వరూపము" అనే వ్యాసంలో దీని పదాల అర్థ చర్చ చేశారు. దానిపైన 1924 లో భారతిలో గురువర్యులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కొన్ని అభిప్రాయ భేదాలతో అర్థ నిర్ణయం చేశారు. అర్థాలసంగతి ఎట్లా వున్నా, అప్పుడు ప్రధానంగా ఒక అక్షరంపై వారిద్దరి చర్చా కేంద్రీ కృతమైంది — ఆ అక్షరం ఱ అనేది. ఒకప్పుడు తెలుగులోవుంది, మధ్యకాలంవరకు కన్నడంలోనూవుంది. ప్రస్తుతం తమిళంలో మిగిలి పోయిన అక్షరమిది. ఇది మన భాషలో ర, ద, ల, ళ లుగా మారింది.

కోటి=కోళి=కోడి; వటి=వడి=వళి లాగ ఈ అక్షరంను డగా చదవాలని శ్రీ శాస్త్రిగారన్నారు. కాని, శర్మగారు, అది ఱ గానే చదవాలని పది కారణాలు చెప్పారు. ఇది, శకటరేఫ రెండు పూర్ణానుస్వారాల పక్కన పక్కన పెట్టినట్లో, రెండుకోడిగుడ్లు నిలువుగా పెట్టినట్లో. రెండు బండిచక్రాలు పక్కన పక్కన ఇరికించి పెట్టినట్లో వున్నా, వీటికి ప్రధాన భేదం అడ్డగీతగాని, నిలువుగీతగాని వుందని బండిరకు గీత నిలువుగానీ, అడ్డుగానీ తప్పక కనిపిస్తుందని, ఱ కు వుండదని చెప్తూ ఎన్నో ఉదాహరణలు ప్రాచీనతమ శాసనాలనుంచి ఇస్తూ వాదించారు. చిఱుంబూరు, ఆచాఱు, అనేవాటిలోని శకటరేఫకు ఱ–చ్చినవారు, తాఱు మున్ని, చోఱ మహారాజు వంటి పదాలలోని ఱకుగల భేదం–చూపారు. ఈ ఱను డగా చదువరాదనడానికి ఱ వున్న శాసనాలలోని పెరువాడ్లు, దేవడ్లు వంటి పదాలలోని డ స్పష్టంగా, ఱకు భిన్నంగావుండడం చూపారు. కఱుత అనేది కఱు శబ్దం సప్తమీ విభక్తి రూపమని, ఇలా ఎన్నో అనుబంధ విషయాలు తెలిపారు; విమర్శ, ప్రతి విమర్శ, ప్రతివిమర్శాదర్శం మొదలయిన వ్యాసాలలో ఇంత వ్రాసిన, పొరపాట్లు సవరించుకొనడానికి ఎప్పుడూ సిద్ధమేనని వినయంగా వాదవ్యాసాలు ఉపసంహరించారు. ఈ వాదంలో ఆయన శాసన పఠన పారీణత వ్యక్తమయింది.

నాకు తెలిసిన వయోవృద్ధులైన శాసన పఠితలలో ఉత్తరాన అగ్రగణ్యులు కె. వి. జయస్వాల్, రాహుల్ సాంకృత్యాయన్, దక్షిణాన ప్రభాకరులు, శర్మగారు. నా తరం వారిలో ప్రస్తుతం వున్నవారు గిడియారం రామకృష్ణశర్మ. ఆయన వినయాదిత్యుని పల్లెపాడు శాసనాన్ని పరిష్కరించి, ప్రచురించినందుకు పద్మభూషణవంటి బిరుదే ఇవ్వవచ్చు. ఆయన లిపి భాషా చరిత్రాది పాండిత్యానికి ఆశాసన పరిష్కారం నికషోపలం. తర్వాత ఈ రంగంలో ఏకాంగి వీరుడుగా పరిశ్రమిస్తున్నవారు మిత్రులు శ్రీ బి. ఎన్. శాస్త్రిగారు. పురాతత్త్వశాఖలోని డాక్టర్ రాయప్రోలు సుబ్రహ్మణ్యం, శ్రీ ఇంగువ కార్తికేయశర్మ. శ్రీ పరబ్రహ్మశాస్త్రి మున్నగువారున్నారు. శాఖా చంక్రమణం చేశాను.

శర్మగారు భారతీయచరిత్ర, వాస్తువులను గురించి, ఆంధ్ర దేశ చరిత్రనుగురించి, బౌద్ధాన్నికూడాకొన్నివందల వ్యాసాలు వ్రాశారు. అమరావతినిగురించి అదృశ్యంగాయున్నవి నా లెక్కలో అవన్నీ దాదాపు 30 వేలపుటలు.కొన్నివందల శాసనాలు ప్రచురించారు. ఒక్క భారతిలో ప్రచురించినవే రెండువందలుంటాయి. తెలుగుభాషా సమితి విజ్ఞాన సర్వస్వం సంస్కృతి సంపుటాలు రెండు ఆయన అశదృశమైన ఈవి. కాని వారు చరిత్ర తథాగతులుగ ఇచ్చినవి మూడురత్నాలు. తథాగతుడంటే సత్యమార్గంలో వెళ్లిన వారని అర్థం. ఆయన చరిత్రలో సత్యమార్గంలో వెళ్లారు **గనుక** చరిత్ర తథాగతుడన్నాను.

ఈ రత్నాలలో మొదటిది "హిస్టరీఆఫ్ ది రెడ్డి కింగ్డం." ఇది రెడ్డిరాజుల పరిపాలన సర్వస్వ మనవచ్చు. దీనిలో రెడ్డిరాజుల వంశాదికమేకాక, అప్పటి జన జీవితాన్ని శాసనాలు, కవితలు, సాహిత్యం ఆధారంగా వివరించారు.

(2) రెండవది "ది ఫర్గాటన్ ఛాప్టర్ ఇన్ ది ఆంధ్ర హిస్టరీ" ఆంధ్ర చరిత్రలో విస్మృతాధ్యాయం అనేది.

మల్లిక్‌కాఫూర్ దండయాత్ర తర్వాత కాకతీయ సామ్రాజ్యం విచ్ఛిన్నమైంది. సామంతులు ఎక్కడివారక్కడ తమకు దక్కింది పాలికివచ్చింది వరమాన్నంగా పాలించసాగినారు. ఈ దుస్థితినుండి దేశాన్ని ఉద్ధరించినవారు ప్రోలయ నాయకుడు, అతని తమ్ముడు కాపయనాయకుడూను. శర్మగారు దీనిని పరిశోధించి 1929 లో రెడ్డిరాణి సంచికలో ఒక వ్యాసం చూచాయగా వ్రాశారు. కాని తగిన ఆధారాలు దొరకలేదు. వారిద్దరికీగల సంబంధం తెలియలేదు. శ్రీ ప్రభాకరులు శృంగారశ్రీనాథంలో ప్రచురించినట్లని తల్లి కలువచేరు శాసనం ఆధారంగా ఆయన ఈ సిద్ధాంతంచేశారు. ఈలోగా అదృష్టవశాత్తు విలస తామ్రశాసనం దొరికింది. ఇది 14 రేకుల శాసనం. ప్రోలయనాయకుడు వెన్నయ అనే బ్రాహ్మణునికి కోనసీమలోని విలస అనే గ్రామాన్ని దానమిచ్చిన శాసనమిది. 1325–1336 మధ్య ఇది ఇవ్వబడివుంటుందని నిర్ణయం. ఇది సంస్కృతంలో చక్కని కావ్యంగా వున్నది.

ఈ శాసనం దొరికిన గాథకూడ అపూర్వం. ఇది ఒక నివేశన స్థలం తవ్వుతుండగా దొరికింది. దీనిని ఒక వైశ్య పుంగవుడు, కరణంగారు పంచుకున్నారు. కరణంగారి భాగం మొదటిది గనుక చరిత్రభాగం వున్నట్టిది. ఇది శర్మగారికి ఎవరిద్వారానో చేరింది. తక్కిన ఏడు రేకులూ దొరికివుంటే బాగుండేది. కాని, వాటిని ఆ వైశ్యుడు చెంబులు పళ్లేలు చేయించేసుకున్నానన్నాడు.

ఈ మొదటి ఏడు రేకుల విషయాన్ని ఆరు భాగాలుగా విభజించవచ్చు. 1) మొదటదేవత స్తుతి, 2) త్రిలింగదేశవర్ణనం, 3) కాకతి ప్రతాపరుద్రుని వృత్తాంతం, అతని పరాజయం, దేశం యవనా క్రాంతంకావడం, 4) త్రిలింగదేశంలో తురుష్కుల దురాచారాలు; ప్రజల బాధలు, 5) ప్రోలయనాయకుని విజయం, త్రిలింగ విముక్తి. 6) దానం.

ముస్లిం చరిత్రకారులు ప్రోలయను, కాపయనాయకుణ్ని సైతానులుగా చిత్రించారు. కాపయను కానబా, కాబా, కాలీ, కాలీ రావ్ ఇత్యాదిగా పేర్లు పెట్టారు ఇంతవరకు చరిత్రకారులకు ఈ నాయకరాజుల రాజధాని సంగతి తెలియలేదు. ఈ శాసనంతో రేకపల్లి రాజధాని అని స్పష్టమయింది.ఈ రేకపల్లి, భద్రాచలం

తాలూకాలో వుంది. ఈ శాసనాన్ని శర్మగారు భారతిలోను, ఎపిగ్రాఫికా ఇండికా 32వ సంపుటంలోను ప్రచురించారు. దీనితో నిజంగానే ఆంధ్ర చరిత్రలో–దక్షిణ భారత చరిత్రలోనే ఒక విస్మృతాధ్యాయం మనకు మరల లభించి చరిత్ర సంపూర్ణమయింది. వారిద్దరూ అన్న దమ్ములని, 72 మంది నాయకులు వారిని కొలిచేవారని స్పష్టమయింది.

(3) మూడవది అర్ధనారీశ్వర శిల్పచరిత్ర. అర్ధనారీశ్వరభావన మనకు కొన్నివేల ఏళ్ళుగా వుంది. గాథా సప్తశతిలో అర్ధనారీశ్వర స్తోత్రాలు రెండు మూడున్నాయి.

అర్ధనారీశ్వర భావనను గురించి కొంచెం వివరణ అవసరం. మన పూర్వులు ఏమి కనిపెట్టినా దానిని దైవదత్తమనో దైవమనో భావించడం అలవాటు. దేహంలో అన్నం జీర్ణమయ్యే పద్ధతిని తెలుసుకొన్న తర్వాత దానిని ఛందోబద్ధంచేసి, నిత్యజీవితంలో మననం చేసుకొన్నారు. అదే విష్ణుసూక్తం.

''నీలతోయద మధ్యస్థాత్ విద్యుల్లేఖేవ భాస్వర,
నీవార శూకవత్తన్వీ పీతాభాస్వత్య్యణూపమా
తస్యాః శిఖాయమధ్యే పరమాత్మా వ్యవస్థితః...''

అని. దానినే భగవంతుడుగా భావించారు. అట్లే, ఈ అర్ధనారీశ్వర భావనకూడ, జీవకణంలో స్త్రీ పురుషతత్త్వాల సమానంగా ఉంటుందని, అది స్త్రీల గర్భాశయాండాల ప్రభావాన్నిబట్టి స్త్రీ పుం శిశు జననానికి కారణంగా వృద్ధి చెందుతుందని ఆయుర్వేదశాస్త్ర వివరణం; ఈ రహస్యాన్ని కూడా జీవితంలో మిళితం చేసుకొనడానికి ఏర్పడినదే అర్ధనారీ, అర్ధేశ్వర భావన. దీనినే మరొక విధంగా బ్రహ్మ తన భార్యను నోటో పెట్టుకొన్నాడని, విష్ణువు రొమ్మున పెట్టుకున్నాడని కథలుకట్టారు. అపూర్వ విషయాలను దైవ కథలుగాను జ్యోతిర్లోక సంబంధంతోను చెప్పడం ప్రతి ప్రాచీన సంస్కృతిలోను ఉంది. ఈ అర్ధనారీశ్వర భావన మన వాస్తుశిల్పాలలో మొదటిసారిగా కనిపిస్తున్నది. బాదామి గుహలలోనని గోపీనాథరావుగారు వ్రాశారు. (ఇండియన్ ఇకనాగ్రఫీ) శ్రీ శర్మగారు దానిని కాదంటూ మొగల్రాజపురం గుహలు ఐదింటిలో మూడవదానిలో వున్నది అర్ధనారీశ్వర విగ్రహమని నిర్ణయించారు మొగల్రాజపురం గుహలలో అస్పష్టంగావున్న ఈ భావన బాదామీ గుహలలో స్పష్టరూపం దాల్చిందని, కనుక అర్ధనారీశ్వర శిల్పం మూలం విష్ణుకుండినుల కాలంలో ఐదవ శతాబ్దికే ఒకవిధంగా రూపుకట్టిందని, తర్వాత పల్లవులు, చాళుక్యులూ అనుసరించారనీ జర్నల్ ఆఫ్ ఆంధ్ర హిస్టరి అండ్ కల్చర్ రెండవ సంచికలో ''అర్ధనారీశ్వర ఇమేజ్ ఫ్రం మొగల్‌రాజపురం కేవ్స్'' అని వ్యాసం వ్రాశారు. దీనివల్ల వాస్తుశిల్పాల చరిత్రలో కొత్త వెలుగు కలిగింది.

ఆయన ప్రజా సామాన్యంకోసం తెలుగు స్వతంత్రలో ''ఒక రాయికథ'' అని పురాతత్వంగురించి వ్రాయడం ప్రారంభించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1973లో ఆయన సేకరించిన తెలంగాణా శాసనాలను ''కార్పస్ ఆఫ్ ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ తెలంగాణా డిస్ట్రిక్ట్స్'' అనే పేర 4వ సంపుటంగా ప్రచురించింది.

ఆయన ఔదార్యం పావనోదార గోదావరివలె అపారం. ఆయన సారస్వతంలో దక్షిణ నాయకుడు తన ఔదార్యంతోనే నా పుస్తకం ''మన లిపి పుట్టు పూర్వోత్తరాలు'' అంకితం పుచ్చుకొన్నారు... ముద్రించుముందు దానిని వినిపించాను. దానిలో వివాదాలుతీసి సిద్ధాంతాలు మాత్రమే వ్రాయమన్నారు. ఆయన 1891-12-24లో జన్మించారు. 1963-1-7లో అస్తమించారు. ఆయన ఈ 71.5 సంవత్సరాలూ సార్థకమని నా నమ్మకం. సుప్రసిద్ధ చరిత్రకారులు డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్యగారి మాటలతో ఆయనను చెప్పడం సముచితంగాను, ప్రామాణికంగాను ఉంటుంది. ఆయన మాటలలో కొన్ని ఇవి :

''ఉద్యోగధర్మమువలన పరిశోధనకు గడగు విద్యాధికులవలెగాక శర్మగారికి చరిత్ర పరిశోధనము సహజక్రీడ. శాసన పరిష్కార మభిమాన విద్య. లిపి శాస్త్రమున వీరితో సమానమైన జ్ఞానము గలవారి సంఖ్య అత్యల్పము. లిపి మర్మవిశారదులగుటచే నెట్టి ప్రాచీన శాసనముయొక్క గుప్తార్థమును ఈయనకు బట్టబయలు. శర్మగారు సంపాదించి పరిష్కరించి ప్రచురించినన్ని శాసనములను మరి యెవ్వరును ప్రకటించలేదు'' (భారతి రజతోత్సవ సంచిక)

శర్మగారు మరొక గొప్పపని కూడా చేశారు. అది, తన విజ్ఞానానికి తన కుమారుని వారసుడుగా చేయడం. పలువురు పరిశోధకులు తమ కుమారులు డాక్టర్లు కావాలనో, ఇంజనీర్లు కావాలనో ఆరాటపడి తమ పరిశ్రమ తమతోనే పోయేట్లు చేసుకొంటారు. ఆయన అట్లాకాక తన కుమారుడు శ్రీ ఆదిత్యశర్మను తమ దారిలో నడిపించారు. శ్రీ ఆదిత్యశర్మ రాష్ట్ర ప్రభుత్వం అర్కశాఖలో అసిస్టెంటు డైరెక్టరుగా వున్నారు. శర్మగారు ప్రకటించని శాసనాలను ప్రకటించి, ఆయన అసమగ్రంగా వదిలిన చరిత్ర, వ్యాసాలను పూరించి ధన్యులు కావాలని కోరుతున్నాను.

# ఆంధ్ర శారదా!

శ్రీ బులుసు వేంకటేశ్వరులు

శ్రీల కెల్ల నిత్య మాలవాలమ్మగు
ఆంధ్ర భూమి యందు నవతరించి
విపుల లోక దివ్య విఖ్యాతిఁ గంటివి
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

అద్భుతంబు తావ కాష్టాదశ పురాణ
దివ్య కావ్య రూప తేజము కడు
శతక నాటక చయ సౌభాగ్యరూపము
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

దేశ భాషలన్ విదేశ భాషల నెల్ల
నిరుపమంబు తల్లి! నీదు సొగసు
నిన్ను సన్నుతించు నిఖిల ప్రపంచము
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

నియమవంతుఁడగుచు భయభక్తులం గల్గి
భారతంబు నీ కుపాయనముగ
నీయఁ గొంత కొంత వ్రాయఁడే నన్నయ్య
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

కొంత మాత్ర మేల కూర్చెనో నన్నయ్య
కడ వయస్సు నందుఁ గడఁగి నాఁడ?
రాచపనుల మునుఁగ వ్రాఁతయే సాఁగదో?
ఆంధ్ర శారదా! మదంబ నతులు.

పట్టు లేదతనికి భారతంబును బూర్తి
గా రచించి నట్టి ఘనత చూడ
నెంతవారికిని అదృష్టంబు ముఖ్యంబు
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

రాజ రాజు కొలువు రమ్యసత్కవి కేల?
ఎవరి నెవ్వరాశ్రయించినారొ
ఏమి జరిగినదియొ కింత వచింపుమా
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

ఎంత మంది భాగ్యవంతులు నీసుతుల్
సుకవి వరులు సకల శుభకరులును
నిరుపమాన భావనిధులు నిత్యులు న్నైరొ
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

పారమార్థికములు వారి భావములెల్ల
వారి వర్తనంబు పరమ భవ్య
మతుల నియమ ధనులు మతిమంతు లందఱు
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

నీదు దివ్యకవిత నిత్యోజ్జ్వలంబగు
నియముసమితి దాని నేర్పుఁ బ్రోవ
నియమ రహిత మగుచు నిలిచిన దెయ్యది!
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

సత్యవీశ్వరుండు సార్వభౌముని కన్న
మిన్న మణికిరీట మున్న లేక
యున్న నెన్నఁటికిని సన్నుతుం డతఁడౌను
అంధ్ర శారదా! మదంబ! నతులు.

చావు తెలిసి లవము నేవేళ దుష్కీర్తి
కనక యుండవలయు జనులటంచు
అల్లసాని పెద్దనార్య నమృతవాక్కు
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

పుడమి పుట్టి పుట్టి పొరలుచుఁ జచ్చుచుఁ
బుట్టనేల మఱియు గిట్టనేల
పుట్టి గిట్ట నట్టి పుంత పోతన చూపె
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

ఆపదలను ధైర్యమభ్యుదయంబున
నోర్పు మన కొసంగె నేర్పుమీఱ
అమరజీవి యైన ఆ భర్తృహరి కవి
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

తపము కలిగి నీతి ధర్మంబులం గని
దైవ కరుణ నంది తాఁ దరించి
పరులు దాఁటఁజూచు భగవంతుఁడే కవి
ఆంధ్ర శారదా! మదంబ! నతులు

కుందపుష్పవితతి సౌందర్యమున్ స్వచ్ఛ
తయును సౌరభంబు తనరు కవిత
కవిత కాని అన్యకవితలు కవితలా?
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

చదువఁ జదువఁ జదువఁ జవులూరఁ జేయుచు
చదువువారికి వినఁగదియు వారి
కమృతపదము నొసఁగు నట్టిదే సుకవిత
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

జీవితంబు పరమ పావన మౌ నీదు
పాదపద్మ సేవఁ బఱపుచుండి
కడపు ధన్య జీవి కవి సార్వభౌముండు
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

పరమ పావనాత్మ భారతీ దేవిరో!
జ్ఞాన సారసూన సర్వగుచ్ఛ
దివ్య దీప్తిరో! నుతింతు! నిన్ను సతంబు
ఆంధ్ర శారదా! మదంబ! నతులు.

# తలనొప్పా? చప్పున పోగొడుతుంది!



# అమృతాంజన్

తలనొప్పి,
జలుబు
ఇతర బాధలను
నిరపాయంగా చప్పున
పోగొడుతుంది.




తలనొప్పి, పళ్లనొప్పి, కండరాల నొప్పి, బెణుకులు, జలుబులు—చప్పున తగ్గాలంటే అమృతాంజనం వాడండి. బాధగా వున్నచో అమృతాంజనం రాయండి. తక్షణం బాధ మాయమవుతుంది. అమృతాంజనం చిన్న సీసాలలోనూ, అదా చేసే పెద్ద సీసాలలోనూ, తక్కువ ధరకి లభించే చిన్న డబ్బాలలోనూ కూడా దొరుకుతోంది.

అమృతాంజన్ 10 ఔషధాలు కలిగివున్నది

అమృతాంజన్ లిమిటెడ్.

AM-1138

# తెలుగు సాహిత్యంలో అస్తిత్వవాదం

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

వ్యక్తిప్రవృత్తికీ వ్యవస్థకూమధ్యగల అంతరము అనాదినుంచీ ఉన్నదే. సమాజంలో ఒకడై ఉంటున్నవ్యక్తి తన ప్రవృత్తిని వ్యవస్థాబద్ధం చేసుకొని ప్రవర్తనను రూపొందించుకోవాలని సమాజం నిర్దేశిస్తుంది. అందుకై రూపొందినవి విద్యాబోధ, ధర్మప్రబోధము, మతప్రచారము, సంప్రదాయసిద్ధమైన ఆచారాలూ, కట్టుబాట్లు, వంశగౌరవం, కుటుంబగౌరవం వంటివి. ఆచరణలో వ్యక్తి, వ్యవస్థ నిర్దేశించిన ఆదర్శాన్ని అందుకోలేకపోతాడు. అప్పుడు తీర్పు ఎలా వుంటుంది? ఎలా వుండాలి?

గీతాకారుడంటాడు —

"శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వభావ నియతమ్ కర్మ కుర్వన్నాప్నోతి కిర్బిషమ్"

ఇక్కడ స్వధర్మమంటే వ్యక్తి ధర్మము, పరధర్మమంటే వ్యవస్థ నిర్దేశించే ధర్మము. స్వభావనియతమైన విధంగా వ్యక్తి తన ధర్మాన్ని నిర్వర్తిస్తే దానిలో దోషం లేదనే అంటాడు. ఇది మానవవ్యక్తి యొక్క నైజాన్నీ, వ్యక్తిలో పెరుగుదల, వికాసం ఎలా అయితే సాధ్యమో ఆ జీవరహస్యాన్ని తెలుసుకొనీ అన్నమాట.

అస్తిత్వవాదం (Existentialism) యిక్కడే ప్రారంభమౌతుంది. వ్యవస్థకంటె వ్యక్తిధర్మానికి—అంటే వ్యక్తి వైశిష్ట్యానికీ, స్వేచ్ఛకూ, సహజవికాసానికీ ప్రాధాన్యాన్నిస్తుంది అస్తిత్వవాదం.

కర్క్గార్డ్ (1813–55) యీవాదానికి మూలపురుషుడు. రాజ్యవ్యవస్థతో, సాంఘిక వ్యవస్థతో, మతవ్యవస్థతో సృష్టిలో మానవుని ప్రతిపత్తిని గురించి మేధావంతులూ శాస్త్రజ్ఞులూ నిర్మిస్తున్న ఊహావ్యవస్థలతో, వ్యక్తి తాదాత్మ్యానికి ప్రయత్నించి, భంగపడి, వ్యక్తిగా ఆత్మవంచనకూ, ఆత్మనైచ్యానికి పాల్పడ్డం ఆయన గుర్తించాడు. వ్యక్తిమాటలకూ చేతలకూ సంబంధంలేకపోవడం ఆయన గమనించాడు. "The philosepher of system is, as a man, like someone who builds a castle, but lives nex door in a shanty ... ... the thought of a man must be the house in which he lives or it will be come perverted" ఆలోచనకంటె అనుభూతి ప్రధానం. ఆ అనుభూతి స్వరూపాన్ని చిత్తశుద్ధితో గ్రహించే ఆత్మపరీక్ష ముఖ్యం. మనోవాక్కాయ కర్మల్లో ఏకత్వాన్ని సాధించడమే చిత్తశుద్ధితో జీవించడం (to live authentically) అదే వ్యక్తిగా రూపొందడం (to become a person). వ్యక్తి తన చేతలకు, నిర్ణయాలకు బాధ్యత వహించడం ఇక్కడ కీలకం. వ్యక్తికి ధర్మనిర్ణయం కర్మణ్యా తన అస్తిత్వ వైశిష్ట్యంమీద ఆధారపడాలికాని సిద్ధాంతంమీద, వ్యవస్థమీదకాదు. హేతుబద్ధమైన ఆలోచనమీదకాదు; తాత్కాలికమైన ప్రేరణమీదకాదు. ఇవన్నీ అస్తిత్వానికి ఉపాంగాలేతప్ప ప్రాథమికంకావు. వ్యక్తి అంతరాంతరాల్లోంచీ ఉద్భూతమై, వ్యక్తిని ముందుకు నడిపించే అతని వైశిష్ట్యాన్ని 'అస్తిత్వం' (existence) అన్నాడు కర్క్గార్డ్. ఈ అస్తిత్వ నిర్వచనం ఆయన చేసిందే. ఇటువంటి ఆత్మజ్ఞాన పరమైన అస్తిత్వం మనిషికే ఉన్నది. జంతువులకు లేదు.

కర్క్గార్డ్ ఆస్తికుడు, క్రైస్తవ సాధకుడు. భగవంతుడూ, క్రీస్తుమూర్తీ బయటలేరు. అంతర్యంలో అనుభూతిలోనే ఉన్నారు. భగవదన్వేషణా, వ్యక్తిజీవితమూ ఒక్కటేనని ఆయన అభిమతం. కర్క్గార్డ్ అంతర్ముఖత్వానికి ప్రాధాన్యం యిచ్చాడు.

నీట్షే (1844–1900) వ్యక్తి సంకల్పానికి (will) ఎక్కువ ప్రాధాన్యం యిచ్చాడు. సంకల్పాన్ని అస్తిత్వపు లోతుల్లోంచీ దృఢపరచుకోవడంద్వారా వ్యక్తిధర్మానికి భిన్నమైన ధర్మాలను ఎదుర్కొని వాటికి లోబడక స్వధర్మ సాధన చెయ్యడానికి వీలవుతుందన్నాడు. కర్క్గార్డ్‌వలె నిజాయితీకి ( antheuticit ), స్వయంనిర్ణయత్వానికి ప్రాధాన్యంయిచ్చినా, అంతర్ముఖత్వానికి బదులు కార్యోన్ముఖతను నట్షే బోధించాడు. సృజనాత్మకశక్తిద్వారా విలువల్నీ తనదైన ప్రపంచాన్నీ వ్యక్తి నిర్మించుకోవాలని అయన అభిమతం. నీతి, ధర్మం వ్యక్తి అస్తిత్వానికి సంబంధించిన అభివ్యక్తిమాత్రమే. వాటికి ప్రాథమికమైన విలువలేదు!

ఇరవయ్యో శతాబ్దపు అస్తిత్వవాదుల్లో మార్టిన్ హైడెగర్, యాస్పర్స్, సాత్రె, కేమూ, పాల్‌టిల్లిచ్, గేబ్రియల్ మార్సెల్, బార్త్, మార్టిన్ బూబర్ ప్రముఖ దార్శనికులు. వీరిలో ఆస్తికులూ వున్నారు. నాస్తికులూ వున్నారు, సాత్రే నాస్తికుడు, పాల్‌టిల్లిచ్ ఆస్తికుడు. వీరందరూ దార్శనిక గ్రంథాలు వ్రాసినవారు. కాని సాహిత్యపరంగా అస్తిత్వవాదానికి ప్రాభవాన్నీ ప్రాచుర్యాన్నీ తెచ్చిన రచయితలు సాత్రే, కేమూ. ఇద్దరికీ నోబెల్ బహుమతి లభించింది. సాత్రే బహుమతిని స్వీకరించలేదు.

సార్త్రే అస్తిత్వవాద దృక్పథంలో ప్రధానమైన అంశం వ్యక్తి స్వేచ్ఛ. సార్త్రే వ్యక్తి హృదయంలోని పారమార్థికాన్వేషణను గుర్తిస్తాడు, కాని యీ అన్వేషణకు గమ్యం లేదంటాడు. గమ్యమని ఊహించుకునే భగవంతుడు ఒక వ్యవస్థ, ఒక భావం, ఒక కల్పన. అందువల్ల అది మానవుని అస్తిత్వాన్నీ, దాని లక్షణమైన స్వేచ్ఛనీ భంగపరిచే ఆత్మవంచన తప్ప మరేమీ కాదంటాడు. అతనిదృష్టిలో అన్వేషణకు సార్థకత కేవలం అన్వేషణే తప్ప మరొకటికాదు. **'Man is a useless passion'** వ్యక్తిలో స్వేచ్ఛ ప్రధానం కాబట్టి, బాధ్యత, నిజాయితీ కూడా ప్రధానం అవుతాయి. నైతిక సూత్రాలు కాని, మానవత్వపు విలువలుకాని వ్యక్తి తన అస్తిత్వంనుంచీ కర్మణ్యా సృష్టించుకునేవే! **(Existence precedes essence)**

అస్తిత్వాన్ని మూడు పొరలుగా విశ్లేషిస్తాడు సార్త్రే. **'Being in itself'** తనలో తను; **'Being for itself'** తనకై తను; **'Being for others'** ఇతరులకోసం తను. 'తనలో తను' అస్తిత్వంలో ఏకత్వం, అద్వైతం వున్నది. 'తనకై తను'లో ద్వైతం వున్నది. అంటే తన్ను వేరుగా ఒక వస్తువుగా చూడటం. ఇక్కడ తన్ను గూర్చిన ఆలోచనకు, ఊహకు, కల్పనకు అవకాశం ఉన్నది. ఇక్కడ ఆత్మజ్ఞానానికీ, ఆత్మవంచనకీ కూడా అవకాశం ఉన్నది. 'ఇతరులకోసం తను'లో ఇతరుల దృష్టిలో తన్ను గూర్చిన అభిప్రాయం ఏమి ఉన్నదో దాన్ని ఊహించడంవల్ల, దాని ప్రభావంవల్ల ప్రవర్తనను అలా రూపొందించుకోవటం. ఇక్కడ స్వేచ్ఛపోయి వ్యక్తికి జడత్వం **(becomes a thing)** బానిసత్వం, పరప్రత్యయనేయ బుద్ధివల్ల వినాశం, శైథిల్యం సంభవిస్తాయి. వ్యక్తి **(Being in itself)** తనలో తను స్థాయినుంచీ జీవించినప్పుడే నిజాయితీ, బాధ్యత, స్వేచ్ఛ అనే విలువలు సిద్ధిస్తాయి. సామాజికుడైన మానవునిలో ఈ మూడు పొరల అస్తిత్వమూ ఉంటూనే ఉన్నది. ఎవరూ దాన్ని తప్పించుకోలేరు. ఏది ప్రాధాన్యం వహిస్తున్నదన్న విషయమే కీలకం.

పాల్ టిల్లిచ్ అస్తిత్వవాదంలో మూడు రకాలైన అస్తిత్వ వేదనలను **(Existential Anxieties)** పేర్కొని, వాటికి ప్రాముఖ్యం యిస్తాడు. (1) విధి–మృత్యువు: ఎప్పుడు ఏమౌతుందో అన్న భయం, మృత్యువు తప్పదన్న స్పృహ (2) శూన్యము–నిరర్థకత: ఎప్పుడూ ఏదో చెయ్యాలనే ఆదుర్దా, చేస్తున్న దానికి అర్థమేమిటన్న ప్రశ్న (3) పాపము–శిక్ష: చేస్తున్నది తప్పు, పాపం అనే ఆదుర్దా, దానికి శిక్ష ప్రత్యాఖ్యానము అనే భయం. ఈ మూడురకాల వేదనలూ వ్యక్తి అస్తిత్వానికి బంధనాలు. విముక్తిమార్గం, నమ్మకమూ ధైర్యమూ ఒకటై వేదనల్ని ఎదుర్కోవటంద్వారా, మనస్సుని భగవత్తత్వంవైపు మళ్లించడముద్వారా సిద్ధించే అస్తిత్వమే! అస్తిత్వ వేదనలే ద్వారం తెరిచి భగవత్సాక్షాత్కారం చేయిస్తాయి. వేదనా జన్యమైన నిరతిశయ దైన్యాన్ని **(despair)** ఆకళించుకొని దానితో తాదాత్మ్యం పొందటం ద్వారా దాన్ని అధిగమించిన మానవ అస్తిత్వం భగవత్తత్వాన్ని చేరుకుంటుంది. భగవన్మూర్తిని ధ్యానించే స్థితి కేవలం మానసికమైనది. భగవదైక్యం పొందే అస్తిత్వం మనస్సును అధిగమించి మనస్సు కావలే ఉంటుంది. అది అనిర్వాచ్యము. దాన్నిలా వర్ణిస్తాడు టిల్లిచ్:

**"It is both the courage of despair and the courage in and above every courage. It is not a place where one can live, it is without the safety of words and concepts, it is without a name, a church, a cult, a theology. But it is moving in the depth of all of them. It is a power of being in which they participate and of which they are fragmentary expression."**

పాల్ టిల్లిచ్ దృక్పథంలో వ్యక్తికి ముఖ్యమైనవి ధైర్యమూ, విశ్వాసమూ. వాటిద్వారానే అస్తిత్వ సిద్ధి.

## II

ప్రముఖ అస్తిత్వవాదుల వివరణలద్వారా యీ వాదంలో భిన్న దృక్పథాలకు ఎలా అవకాశం వున్నదో గమనించాము. వ్యక్తి వైశిష్ట్యాన్ని గుర్తించి, మానవుల్లో ఒక్కొక్క వ్యక్తికీ అనిర్వచనీయమైన వ్యక్తిత్వం ఉన్నదనీ, దాని అభివ్యక్తి భిన్నంగా ఉండక తప్పదనీ, తద్వారా వ్యక్తి జీవితమూ ప్రవర్తనా వ్యవస్థను వ్యతిరేకించినప్పుడు, వ్యక్తి ధర్మాన్నే ఉత్కృష్టమైన విలువగా అంగీకరించి, వ్యక్తినే సమర్థించడం అస్తిత్వవాద దృక్పథంయొక్క సారాంశం.

ఈ దృక్పథం క్రమంగా విస్తరించి ప్రస్ఫుటమై ఆధునిక సాహిత్యంలో ప్రాచుర్యాన్ని పొందటానికిగల కొన్ని కారణాల్ని పరామర్శ చేస్తాను. వైజ్ఞానిక విప్లవం **(Scientific revolution)**, పారిశ్రామిక విప్లవం **(Industrial revolution)** వ్యాప్తి చెందడంతో సంప్రదాయబద్ధమైన మతవిశ్వాసాలూ, సామాజిక నియమాలూ సడలిపోయి శైథిల్యం చెందుతూవచ్చాయి. పూర్వయుగంలో మతంలో కాని సమాజంలోకాని వ్యవస్థా దృక్పథానికీ వ్యక్తిదృక్పథానికీ సమైక్యం **(integration)** విధాయకం. ఆ సమైక్యం విశ్వాసంమీదా, భక్తిప్రపత్తులమీదా, భయంమీదా ఆధారపడినది. దానికి హేతువాదంతో, వ్యక్తియొక్క స్వయం వివేచనతో పనిలేదు. ఒకవేళ ఉన్నా, అటువంటి హేతువివేచన, తర్కం సంప్రదాయానికి విధేయంగా జరగవలసిందే! అట్లా జరగని సందర్భాల్లో ఆ వ్యక్తి సమాజంనుంచి బహిష్కృతుడయ్యేవాడు, లేదా ఆ వ్యక్తి తన ప్రతిభతో సమాజాన్ని ఆక్రమించి, వ్యవస్థను సంస్కరించి, కొత్తబాటలువేసి పూజ్యుడయ్యేవాడు. ఏమైనా వ్యవస్థకూ వ్యక్తికీ భిన్నమైన దృక్పథాలు ఉండ

టానికి వీల్లేదు. వైజ్ఞానికయుగంలో హేతువాదం, స్వయం వివేచన ప్రాముఖ్యం వహించడంవల్ల ఒక వ్యక్తి మనస్సుకూ మరియొక వ్యక్తి మనస్సుకుసంబంధంవున్నా సమైక్యంలేదు. ఆధునిక సమాజంలో మనుష్యుల సంబంధాలు పారిశ్రామిక విప్లవంవల్లా, వాణిజ్య విస్తృతివల్లా మరీ క్లిష్టమై సంకీర్ణం కావడంతో, జీవన విధానంలో వైవిధ్యంతో బాటు దృక్పథ భిన్నత్వమూ నిరవధికంగా పెరిగింది. ఈ పరిస్థితిలో జీవితాన్ని గూర్చి ఎవరి విశ్వాసాలూ విలువలూ వారివి అవుతున్నాయి. వాటికి తగినట్లే హేతువులు, వివేచనా, కర్తవ్యమూ ఉంటున్నాయి. ఇప్పుడు జీవితాన్నిగూర్చి సామాజిక దృక్పథానికి ఏకస్వరూపం అంటూ లేకుండా పోతున్నది. ఉన్నంతమాత్రంలో దానికీ వ్యక్తి దృక్పథానికీ సమైక్యం ఏర్పడ్డం అసాధ్యం అవుతున్నది. పైకి ఏర్పడినట్లు కనిపించినా ఆచరణా అనుభవమూ వేరుగానే ఉంటాయి.

నేటి సామాజిక దృక్పథంలో, ఉదాహరణగా ముఖ్య విలువలైన 'ప్రజాస్వామ్యాన్నీ' 'మానవ సమానత్వాన్నీ' తీసుకుంటే, ఇవి అందరూ అంగీకరించినవే. అయితేనేం! ఈ అంగీకారం కేవలం నినాదాలకు మాత్రమే పరిమితమనీ, ఆచరణలో ఒక్కొక్కవర్గం, ఒక్కొక్క వ్యక్తీ వీటికి ప్రత్యేకమైన అర్థాన్ని ఆపాదిస్తున్నారనీ అందరికి తెలిసిన విషయమే! అలాగే సమాజంలో వివాహంవంటి వ్యవస్థగాని, ప్రేమవంటి ఆదర్శంగాని కొలబద్దగా తీసుకుని ఒక్కొక్క వ్యక్తి జీవితాన్నీ ఆచరణనూ పరామర్శించేందుకు పూనుకుంటే ఒకవ్యక్తి వికాసానికి సుఖసంతోషాలకు ఆవ్యవస్థ లేక ఆదర్శం అవకాశంకావచ్చు. మరోవ్యక్తికి అదే అవరోధమో శాపమో కావచ్చు. బయటినుండి స్థూలంగా అందరి వ్యక్తుల విషయంలోనూ ఒకే కొలబద్దతో నైతికమైన తీర్పుచెయ్యడం చాలసులువు. కాని వ్యక్తి వైశిష్ట్యాన్నీ ప్రత్యేకమైన పరిస్థితులనూ గూర్చిన అవగాహన లేనిదే మన నైతిక దృష్టికీ తీర్పుకూ ఏమి విలువ ఉన్నట్లు ?

సాహిత్యపరంగా ఒక వ్యక్తి అస్తిత్వానికి ఏ నవలలోనో కథలోనో ఆవిష్కరణ జరిగినప్పుడు మాత్రమే ఆ అవగాహన సాధ్యమౌతున్నది. అటువంటి అవగాహన, దాని ఫలితమైన విశాలదృష్టి, సహనమూ, సానుభూతీ, నేటి సమాజంలో వ్యక్తికీ వ్యక్తికీ మధ్య అవసరమౌతున్నది. ఏమంటే ఈ సమాజంలో పూర్వయుగపు సామూహిక సమైక్యమనఃఫలకము ముక్కలు ముక్కలై, నేడు వ్యక్తులకు ఎవరిముఖం వారి ముక్కలో కనిపించడమే తప్ప యితరుల ముఖాలు సర్వంగా కనిపించే మార్గంలేదు. ఒక వ్యక్తి అస్తిత్వానికి సంబంధించిన విలువలంటూ ఏవో ఉండవచ్చు అనే దృష్టి ముఖ్యమౌతోంది. ఒకవేళ సానుభూతిద్వారా ఆ వైయక్తికపు విలువల్ని గ్రహించే ఓపిక, ఆకాంక్షా లేకపోతే, కనీసం అవతలి వ్యక్తిని వ్యక్తిగా గౌరవించే దృక్పథమైనా నేడు అవసరం. సమాజం మారింది. జీవితంలో వైవిధ్యం ఎంతోఉన్నది. వ్యవస్థ గుర్తించిన జీవితమార్గాలేతప్ప తక్కినవి ఉండటానికి వీల్లేదనే మొండిపట్టుపట్టడంవల్ల సాధించేది ఏమీలేదు. ఇతరులను బాధపెట్టడమూ, తన్నుతాను బాధపెట్టుకోవడమూ అవుతుందేతప్ప అది శాంతి మార్గమూకాదు. బాధావిముక్తి మార్గమూ కాదు అస్తిత్వవాదదృక్పథంతో నేటి సమాజానికి ఉన్న అవసరం యిదే!

## III

తెలుగు సాహిత్యంలో అస్తిత్వవాద దృక్పథం అభివ్యక్తమైన రచనల్ని పరామర్శించేముందు సార్త్రే రచించిన ఒక కథను ఉదాహరిస్తాను. ఈకథపేరు 'సాన్నిహిత్యం' (Intimacy) కథలో భార్యాభర్తలు. ఇద్దరికీ చాలా అన్యోన్యం. భర్త నపుంసకుడు. కాని వారి అన్యోన్యానికి యిదేమీ అడ్డురాదు. భార్యకు భర మీద ఎంతో ఆప్యాయత, ప్రేమ, జాలి. ఒకరినివిడిచి ఒకరు ఉండలేరు. ఈ సన్నివేశంలో భార్య స్నేహితురాలు ఆమెని విమర్శిస్తుంది. భర్తను వదలి తనకు తగిన మగవానితో లేచిపొమ్మని ప్రోత్సహిస్తుంది. జీవితాన్ని వ్యర్థంచేసుకోవద్దంటుంది. భార్యాభర్తలమధ్య ఒక చిన్న కలహం మూలంగా భార్యవెళ్లిపోతుంది. వివాహానికి మూలమైన శారీరక సంబంధం భార్యాభర్తలమధ్య లేకపోవడంవల్ల భార్య మరో పురుషుణ్ణి వరించడం సమర్థనీయమే! అది చట్టమూ, సమాజమూ అంగీకరించే ధర్మమే. కాని కథలో తన కేది కావాలో ఆలోచించుకున్న ఆ భార్య చివరకు తన భర్తదగ్గరకే వచ్చివేస్తుంది. ఇక్కడ ఆమె భార్యకంటె, స్త్రీకంటె, విశిష్టమైన వ్యక్తిగా, చేసుకున్న నిర్ణయం మనకు గోచరిస్తుంది. వ్యక్తి ధర్మం జయించింది. తెలుగులో చలంవంటి రచయిత, వివాహవ్యవస్థమీద దండెత్తిన రచయిత యిలాంటి కథ వ్రాయగలడా ? ఊహించండి. మన సంఘంలో వ్యవస్థా ధర్మమే ప్రాతివత్యం కావడంవల్ల. పాతివత్యానికంటే 'సెక్స్' మానవతా సహజ ధర్మం కాబట్టి, ఆ భార్య లేచిపోయిందనడమే చలం కథ ధ్యేయం అవుతుంది; ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే 'సెక్స్' సంబంధాల్లో 'స్వేచ్ఛ' అనే నినాదాన్ని తన రచనల్లో మొదటినుంచీ చివరిదాకా ఉద్యమంగా ప్రచారంచేసిన చలం, కాల్పనికవాదీ, సంస్కర్తా తప్ప అస్తిత్వవాది కాదు. ఆయన సెక్స్ అనే సిద్ధాంతాన్ని చూచాడు. దాన్ని అందరికీ అన్వయించాడు కాని వ్యక్తి వైశిష్ట్యంలోగల భిన్నత్వాన్ని చూడలేదు. సమాజంలో మతం, నీతి, సంప్రదాయం, నిర్దేశించిన వ్యవస్థా ధర్మంకంటె మానవత్వం ప్రధానమనేది ఒకమెట్టు. కాని యీ మానవత్వం 'సెక్స్', 'సేదరికం'వంటి ఒక సామాన్య లక్షణాన్నో, ఒక సిద్ధాంతాన్నో ఆధారం చేసుకున్నది మాత్రమే. దానికంటె వ్యక్తి అస్తిత్వ వైశిష్ట్యం ముఖ్యం అంటుంది అస్తిత్వవాదం

ఆ వైశిష్ట్యం ఏ రూపంలోనైనా ఉండవచ్చు. అది వ్యవస్థను సమర్థించేది కావచ్చు, వ్యతిరేకించేది కావచ్చు!

1947 ప్రాంతాల వెలువడిన 'అల్పజీవి' (రా. వి. శాస్త్రి) నవలలో ఆడ్లర్ మనస్తత్వ సిద్ధాంతందృష్ట్యా సుబ్బయ్య పాత్రను రచయిత సృష్టించినా, ఆ పాత్రలోని వ్యక్తి వైశిష్ట్యం, అనుభవాల చిత్రణ, అస్తిత్వవాదాన్ని స్ఫురింపజేస్తాయి. హైడెగ్గర్ వ్యక్తి జీవితంలో అస్తిత్వపు లోతుల్ని స్పృశించే క్లిష్ట సన్నివేశాల్ని గూర్చి చెబుతూ వ్యక్తి మృత్యువువంటి తీవ్రమైన అనుభవంద్వారా పునర్జన్మ పొంది తనదైన జీవితాన్ని నిర్మించుకుంటాడు అంటాడు. భయంతో జీవించే ఎన్జీవో సుబ్బయ్యని గవరయ్య అనే కంట్రాక్టరు తన మనుష్యులచేత బలవంతంగా రప్పించి బెదిరించి ప్రామిసరీనోటుమీద సంతకం చేయిస్తాడు. బెదిరించే సన్నివేశంలో సుబ్బయ్య భయం తారస్థాయినందుకుని కొన్ని క్షణాలు తను చచ్చిపోతున్నానని మృత్యువే వచ్చినంత అనుభూతికి లోనవుతాడు. ఇంటికి వచ్చిన తర్వాత భార్యతో నిజం చెప్పలేక, అబద్ధం చెబుతూ, ఒక గాఢమైన జాగృతిని పొందుతాడు సుబ్బయ్య. తన అస్తిత్వపు సత్యాన్ని ఎదుర్కొని గుర్తించినట్లు సూచిస్తాడు రచయిత—

"ఛస్తున్నాను బాధపడుతున్నాను
చస్తూ బాధపడుతూ అబద్ధాలాడుతున్నాను
చావబోతూ అబద్ధం చెప్పేను
చెప్పేను అబద్ధం చెప్తూ చెప్తూ చస్తాను
చెప్పేది అబద్ధం. చావబోయేది నిజం
చావేకాదు ఈ బాధకూడా నిజం
నిజంకన్న నిజం చావుకన్న నిజం అబద్ధంకన్ననిజం యీబాధ
మనిషి మాట అబద్ధం మనిషి బాధ నిజం
మనిషి చావు నిజం
అబద్ధపు బ్రతుకు బతుకుతూ నిజం బాధలుపడుతూ
అతి నిజంగా చస్తాను"

ఈ చివరి వాక్యంలో వ్యక్తి సమాజంలో పొందే అస్తిత్వపు భంగపాటును గూర్చి అస్తిత్వవాదులు వివరించిన దర్శనాల సారాంశం అంతా యిమిడి వుంది.

1947 ప్రాంతాల్లోనే వెలువడిన మరోనవల బుచ్చిబాబు వ్రాసిన 'చివరకు మిగిలేది'. దీన్ని చాలా ఆసక్తిగా పాఠకలోకం చది

వారు. నవలలోని సందేశం ఏమిటో నీతి ఏమిటో బోధపడక ఈ నవలలో మిగిలేదేమీలేదు, చివరకు అట్టలుకూడా మిగలవు అంటూ విమర్శించారు. దయానిధి పాత్ర ఫ్రాయిడ్ ఈడిపస్ కాంప్లెక్స్ సిద్ధాంతంమీద నిర్మింపబడిందనీ ఒక దృష్టితో వ్యాఖ్యానించవచ్చు. కాని ఆ సిద్ధాంతాన్ని, దాని తాలూకు న్యూరాసిస్‌ని అధిగమించిన అస్తిత్వ సత్యం దయానిధిపాత్రలో అభివ్యక్తమైంది. దయానిధి వ్యవస్థతోపడ్డ సంఘర్షణ స్వరూపం యిలావుంది—పుట్టుకతో అంగ వైకల్యం కలిగినవ్యక్తి, తనకు అంగవైకల్యంలేదనీ, తను అందరిలానే వున్నాననీ నమ్మటానికి ఎంతగా ప్రయత్నించినా అడుగడుగునా ఆ కఠినసత్యం గుర్తువస్తూనే వుంటుంది. చివరికి ఆ విషయాన్ని మనఃస్ఫూర్తిగా అంగీకరించి "అంగవైకల్యం వుంటేనేం? నేనూ మనిషినే" అన్న ఆత్మవిశ్వాసానికి రాగలిగినప్పుడు తనతో తను సమాధానపడటం జరుగుతుంది. దయానిధి సమస్య యిలాంటిదే. అతని తల్లి పతివ్రతకాదు. ఇది పోగొట్టుకోవడానికి వీల్లేని మచ్చ. భార్య ప్రవర్తన సరిగా లేకపోతే విడాకులిచ్చి సంబంధం లేదనవచ్చు. కాని తల్లి అటువంటి వ్యక్తి అయినప్పుడు, అది పుట్టుకతోవచ్చే అంగవైకల్యం వంటిది. దయానిధి చివరకు పతిత అయిన కోమలిని స్వీకరించడంతో తనతో తాను సమాధానపడి శాంతిని సాధిస్తాడు. ఈ స్వీకరించడం భార్యగాకాదు, ప్రేయసిగాకాదు, ఉంపుడుగత్తెగా కాదు. మనిషిని మనిషిగా. దయానిధి అన్వేషణలో, చేరిన గమ్యంలో వ్యవస్థలో యిమిడే సంగతులు లేనేలేవు. వ్యవస్థతోడి సంఘర్షణే అతణ్ణి గమ్యం చేర్చింది. సౌందర్యమూ సౌశీల్యమూ ఆభిజాత్యమూ ఏమీలేని కోమలి ఎందుకు తనని అందరికంటె ఎక్కువగా ఆకర్షిస్తున్నదో దయానిధికి అర్థంకాదు. అది శారీరకమైన వాంఛ అని తోచినా నిజానికి అదీ కాదు. నవల మొదట్లో దయానిధికి కోమలి అందుబాటులో ఉన్న క్షణాల్లో కూడా శరీరం తనతో యిలా అంటున్నట్లు తోస్తుంది: "ఇది అన్యాయం, నేనీ పని చెయ్యలేను, నేనే సౌందర్యం, నన్ను నేను ధ్వంసం చేసుకోలేను. ఇతరులనీ ధ్వంసం చెయ్యలేను, నన్నొదిలెయ్యి" నవల చివర ఆత్మపరీక్ష చేసుకున్న దయానిధి యిలా అంటాడు: "చూడు కోమలీ, నాకు ప్రేమంటే ఏమిటో యింతవరకు తెలిసింది కాదు. అందరిలాగా, శరీర వాంఛనే ప్రేమనుకొని నన్ను నేను దగా చేసుకోలేను. ఇతరులు ఎవరితోనూ, ఏ ఒక్కరితోనూ పంచుకోలేనిది నా ప్రేమ. అదొక దృష్టి—జీవితం అంతటినీ, తుదీ మొదలూ ముందూ వెనకా అన్నింటినీ దూరంగా చూచి అర్థం చేసుకునే ప్రపంచంపై ఒకచూపు...నీతో స్నేహంవల్ల ఆ దృష్టి పోతుంది" అంటాడు. దయానిధి తన ఏకాంతానికి తన అస్తిత్వానికి ప్రాథమిక విలువ యిస్తున్నాడు. శరీరవాంఛకూ ప్రేమకూ తన దైన నిర్వచనాన్ని యిస్తున్నాడు. ఈ నవలలో 'అస్తిత్వం' ప్రధానంగాను సహజంగా జీవించే పాత్ర అమృతం. నవల చివర రచయిత గుర్తించిన సత్యం "ఏ ఒక్కరి పరిస్థితులూ బుద్ధివికాసాలూ మరొకరికిరావు. ఐనా వాళ్ళందరినీ ఒక ఫక్కీలో నడచుకోమనడమే మన దౌర్భాగ్యం... మనం ముక్కలై 'నువ్వూ' 'నేనూ', అయి ఉత్తర దక్షిణాలకు ప్రయాణం చేసింది. 'అందరూ' మాత్రంలేరు. ఇది వ్యక్తి విశిష్టత తను గుర్తించడం. "చివరికి మిగిలిందేమిటి?" అన్నప్రశ్నకు "తనతో తను సమాధానపడటం—అదే మిగిలింది" అని జవాబు. "ఆర్థిక, సాంఘిక, చారిత్రక వ్యత్యాసాల కతీతమై మనిషినీ మనిషినీ స్నేహపాశంలో బంధించివేసే మానవత్వంయొక్క శక్తుల్ని తరచి చూచినప్పుడు ఆ దృశ్యాన్ని తన్మయతతో అనుభవించగలం. కాని ఆ అనుభవాన్ని మాటల్లో చెప్పలేం. ఈ జీవిత రహస్యం—దాన్ని తెలుసుకోవడానికి మానవుడుచేసే యత్నం—ఏ గొప్ప గ్రంథానికైనా యివి పునాది. ఈ నవలకీ అదే పునాది" అంటూ రచయిత చెప్పుకున్న ముందు మాటలో అస్తిత్వవాద దృక్పథమే అభివ్యక్తమైంది.

1961లో గోపీచంద్ 'మెరుపుల మరకలు' అనే నవల వచ్చింది. అస్తిత్వ వాదదృక్పథం ఆధారంగా జీవితాన్ని పరిశీలిస్తూ న్నట్లు నవలలో ఒకచోట చెప్పుకున్నారు కూడా. ఉషారాణి విశిష్ట వ్యక్తిత్వ చిత్రణమే ఈ నవల వస్తువు; నైతిక వ్యవస్థదృష్ట్యా చూస్తే, ఉషారాణి వ్యభిచారిణి. ఆమెను మనోవైజ్ఞానిక శాస్త్ర దృష్ట్యా చూస్తే ఆమె 'nymphomanica' అనాలి. కాని నిజానికి ఆమెలో mania—పిచ్చి న్యూరాసిస్‌వంటి లక్షణాలేవీలేవు. ఆమె నిజాయితీ, సాహసం, ఆమె ప్రియుల్నేకాదు, పాఠకుల్ని కూడా ఆశ్చర్య చకితుల్ని చేస్తాయి. ఆమె పోయిన పోకడలో ఆత్మవిశ్వాసం. స్వచ్ఛంద ప్రవృత్తి, స్నేహం, ఆప్యాయత ద్యోతకమౌతాయి. ఆమె అన్వేషణ వైరాగ్యంలో పర్యవసించిన క్షణంలో కూడా బాధ్యతతో భర్తదగ్గరకు వచ్చి, తన గత జీవితాన్ని దాపరికం లేకుండా చెప్పి క్షమాపణకోరి సెలవుతీసుకుని ఆధ్యాత్మిక జీవితం గడపటానికి వెళ్లిపోతుంది ఉషారాణి. స్వధర్మం సెక్స్ ప్రవృత్తితో ప్రారంభమై తన అస్తిత్వానికి అర్థం ఏమిటి ? తనెందుకు భిన్నంగా ప్రవర్తిస్తున్నది ? అనే ప్రశ్నలతో ఒక కొలిక్కివచ్చి, అస్తిత్వపు ఏకాంతంనుంచీ భగవత్తత్వమువైపు పయనిస్తుంది.

ఈ నవలలో ఒక ఆకర్షణీయమైన సన్నివేశం ఉషారాణికి చక్రవర్తి తర్వాత శ్రీకాంత్‌తో ఏర్పడిన స్నేహాన్నిగూర్చి చక్రవర్తి ఈర్ష్యతో ప్రవర్తించి ప్రశ్నించినప్పుడు ఆమె అతనికిచ్చిన సమాధానాలూ, అతణ్ణి పసిపిల్లవానిలా సాంత్వన పరచడమూ, ఇక్కడ చక్రవర్తి తనకు ఉషారాణిపట్ల అనన్య సామాన్యమైన ప్రేమ ఉన్న దన్నప్పుడు, "అభిప్రాయాలు వెలిబుచ్చడానికేం ? శ్రీకాంత్‌కూడా అలానే అంటాడు" అంటుంది ఉషారాణి. "మా యిద్దరికీ వున్న తారతమ్యం నీ మనస్సుకు తెలీదా ?" అని ప్రశ్నిస్తాడు చక్రవర్తి. "తెలీదు" అంటుంది ఉషారాణి. మాటల్లో బహిరుపాధుల్లో నిరూపిత మయ్యే సత్యం స్థూలంగానే వుంటుంది. వాటి కందని వైవిధ్యం,

వైశిష్ట్యం వ్యక్తి అంతర్యానికి సంబంధించినది. అది మరొకరికి సానుభూతిద్వారా తప్ప అందుబాటులోవుండదు. వ్యక్తి అంటే కేవలం ఏకాంతం. వాచ్యంగాకాక సాహిత్యంలో పాత్రచిత్రణద్వారా ధ్వని రూపేణా సూచించగలిగిన ఒకానొక వ్యక్తి అస్తిత్వంకూడా సానుభూతిద్వారానే గ్రాహ్యం. దాన్నే 'సహృదయత' అంటారు.

1960 లో భాస్కరభట్ల కృష్ణారావు అస్తిత్వవాద దృక్పథంతో నవలవ్రాసే ప్రయత్నంలో 'వెల్లువలో పూచికపుల్లలు' వ్రాశారు. శీర్షికలోనే భాస్కరరావు ఈ దృక్పథాన్ని గూర్చి పడిన అపోహ ఏమిటో తెలుస్తుంది. వ్యక్తి వెల్లువలో పూచికపుల్ల కాదు, కాకూడదనే అస్తిత్వవాదం నొక్కిచెబుతోంది. వ్యక్తిలో బాధ్యత, నిజాయితీ, ఆత్మపరీక్ష అనేవి అతని జీవితంలో అస్తిత్వదర్శనానికీ, విశిష్టమైన విలువల సృష్టికీ కీలకమైన గుణాలు. అవి లోపించిన వ్యక్తి వెల్లువలో పూచికపుల్లా, చరిత్రహీనుడూ అవుతాడు. ఈ నవలలో మధు సమస్యకూడా 'చివరకు మిగిలేది' లోని దయానిధి సమస్యే. తల్లి పతివ్రత కాకపోవడం. కాని మధు ఈ సత్యాన్ని ఎదుర్కొని అస్తిత్వాన్ని దర్శించేబదులు నిరీహుడై తన చేతలకు తాను బాధ్యత వహించడానికి నిరాకరిస్తాడు. ఫలితం ఏ విధంగానూ సమర్థనీయంకాని అతని నైతిక ప్రవర్తన. పాఠకుల సానుభూతిని పొందలేకపోతుంది. 1963లో పి. వి. సుబ్బారావు వ్రాసిన 'ఆమె చెప్పింది' అనే నవల కూడా అస్తిత్వ దృక్పథాన్ని ఉద్దేశించిన రచనే. "యదార్థాన్ని మించిన నీతిగాని మానవత్వాన్నిమించిన పవిత్రతగాని ఏ యుగంలోనూ లేదనుకుంటాను. ఉంటే అది నీతికాదు. అది పవిత్రతకాదు. ఆ నీతి మేడిపండు. ఆ పవిత్రత దానిలోని పురుగులు మాత్రమే" అన్న ముగింపు వాక్యాలతో తను నవలలో చిత్రించిన మృణాళిని అనే సినిమా తారయొక్క సంప్రదాయ విముక్తమైన జీవితాన్ని సమర్థించే ప్రయత్నం చేశారు. ఈ నవలలో మృణాళినీ రజనీకాంతుల సంబంధం. సామాజిక వ్యవస్థ సూత్రాలకు అతీతమైన ఒక అనుబంధం. అసంభావ్యమేమీకాదు. కాని రచయిత మృణాళిని వ్యక్తిత్వం ఎలా అస్తిత్వపు ప్రాథమిక విలువలను స్పృశించిందో చిత్రించలేకపోయారు. ఇది శిల్పంలో లోపం.

అస్తిత్వవాద దృక్పథం అభివ్యక్తం కావటానికి పాత్ర చిత్రణలోగాని, సన్నివేశాల్లోగాని, ముగింపులోగాని ఎక్కడో ఒకచోట అస్తిత్వపు గాఢస్పర్శ అనుభూతి పాఠకునికి అందాలి. ఇది ముఖ్యం. 'అల్పజీవి', 'చివరకు మిగిలేది', 'మెరుపుల మరకలు' నవలల్లో ఈ లక్షణం ఉన్నది. 'వెల్లువలో పూచికపుల్లలు' 'ఆమె చెప్పింది' నవలల్లో లేదు వ్యవస్థతో వ్యక్తిధర్మానికి జరిగే సంఘర్షణ ఒక్కటే కాదు ముఖ్యం. ఆ సంఘర్షణలో, ఆ వ్యక్తివేసే ప్రతి అడుగులో, పోయే పోకడలో, గాఢమైన అనుభూతి, చిత్తశుద్ధి, ఆత్మపరీక్ష ద్యోతకమౌతూ అస్తిత్వ దర్శనం జరిగినస్ఫూర్తి వుండాలి. ఒక నవలలో అభివ్యక్తమయ్యే జీవితానికి వ్యవస్థాపరంగా, సిద్ధాంతపరంగా, సామాజికంగా, హేతుబద్ధంగా అర్థం లేకపోవచ్చు; అంతమాత్రాన అది అస్తిత్వవాద దృక్పథానికి అభివ్యక్తి కానేరదు. అస్తిత్వపు అనుభూతి రసధ్వనిగా అందడం ప్రధానం. అప్పుడే ఆ నవలకు ఆ పాత్రకు ప్రాణం వస్తుంది.

ఇంతవరకు వ్యవస్థతో సంఘర్షణపడి తద్వారా అస్తిత్వ దర్శనం పొందిన ప్రధాన పాత్రలుగల నవలల్ని పరామర్శించాను. ఇక్కడ వ్యక్తి తనతో తాను సమాధానపడటం ప్రధానమైన పర్యవసానం. అస్తిత్వవాద దృక్పథానికి యిదే ఘూసకాదు. వ్యక్తి వైశిష్ట్యం కారణంగా వ్యవస్థతో ఘర్షణపడటమే జీవితం కానక్కర లేదు. ఇంతవరకు పేర్కొన్న నవలల్లో జీవితమూ వ్యక్తిత్వమూ విడి విడిగా వుంటూ ఒకదానితో ఒకటి అవి ఎలా సంధిస్తున్నాయో చిత్రించడం కనిపిస్తుంది. ఇది ఒక పద్ధతి. ఇదికాక మరో పద్ధతి వుంది. జీవితం, విలువలు, వ్యక్తి—మూడు వేరు వేరు విషయాలుకావు. జీవించడంనుంచీ విలువలూ, వ్యక్తిత్వమూ సిద్ధిస్తాయి అనే అస్తిత్వవాద దృక్పథం నవల ఎత్తుగడలో, నడకలో, శిల్పంలోనే, ఆవిష్కృతం కావడం. ఈ రకంనవల ఒక విస్పష్టమైన వ్యక్తిత్వంతో పారంభం కాదు. జీవితంతో ప్రారంభమౌతుంది. అంటే వ్యవస్థను అంగీకరించడంతోనే ప్రారంభమౌతుంది. అక్కడినుంచీ వ్యక్తిత్వమూ కొత్త విలువలూ జీవితంలోని వివిధ సంఘటనలు కారణంగా ప్రస్ఫుటమౌతూ వచ్చి, చివరకు జీవితంలో 'అస్తిత్వ'మే ప్రధానమైన విలువగా ధ్వనింపబడుతుంది. ఈ పద్ధతి నవలలు 'మళ్లీ వసంతం' (ఆర్. యస్. సుదర్శనం) 1960, 'తాగుబోతు' (వి. నాగిరాజు) 1963, 'మైనా' (శీలా వీర్రాజు) 1964.

'మళ్లీ వసంతం' నవల ఊర్మిళ అనే పాత్ర తన జీవితాన్ని గూర్చి తాను చేసుకున్న పరామర్శ. నిశితమైన విశ్లేషణం. ఊర్మిళ తన జీవితంలో జరిగిన విశేషాలకూ తనతో సంబంధమున్న మనుష్యులకూ ఏ విలువనూ అర్థాన్నీ పాదిస్తున్నదో ఆమె కథనం ద్వారానే మనం గుర్తించాలి. ఆమెకు వ్యవస్థతో సంఘర్షణలేదు. కాని వ్యవస్థ ఆమెను వంచిస్తూ వచ్చింది. గడచిన జీవితాన్ని ఆమె పరామర్శించడంలో, ఆమె కథనంలో, ఆలోచనా వైఖరిలో, ఆలోచించే గుణంలోనే ఆమె వ్యక్తిత్వంయొక్క ప్రత్యేకత మనకు గోచరమౌతుంది. ఎప్పటికప్పుడు ఆలోచిస్తూ గతాన్నీ వర్తమానాన్నీ సమన్వయం చేసుకుంటూ వెళ్లడం ఆమె ప్రవృత్తి. అందువల్ల నవలలో ఆమె జీవితానికీ వ్యక్తిత్వానికీ తాదాత్మ్యం ఉన్నది. ఊర్మిళ కథనంలో ఇతర పాత్రలు కన్పించినా వాళ్ళు ఆమె మనస్థితాలై తప్ప వాళ్లకు ప్రత్యేకమైన అస్తిత్వం లేదు నవలద్వారా మనకు గోచరమయ్యేవి ఊర్మిళ అస్తిత్వమూ, ఆ అస్తిత్వపు విలువలూ. ఊర్మిళ తను సాధించినానని

అనుకునే విలువల్ని మనం అంగీకరించవచ్చు, తిరస్కరించవచ్చు. కాని ఆమె జీవితంతో రాజీకుదుర్చుకుంటుంది నవలచివర. ఆమెను గూర్చిన తీర్పు పాఠకులకే మిగిలివుంటుంది !

'తాగుబోతు' నవల చైతన్య స్రవంతి మార్గంలో వ్రాయబడింది. ఇందులో ముసలివాడైన తాగుబోతు గత జీవిత స్మృతులే అతని జీవితాన్నీ వ్యక్తిత్వాన్నీ అభివ్యక్తం చేస్తాయి; వాటి ధ్యాసతోనే వాడు ప్రాణాలు విడుస్తాడు. ఈ ముసలివాడి జీవితం వ్యక్తిత్వం అర్థశూన్యమనీ, మనకు తెలిసిన విశేషమైన విలువలు అందులో కనిపించవనీ అనుకోవచ్చు. కాని తాగుబోతు పాత్ర చిత్రణ మనలో కలిగించే కళానుభూతిలోనే వాని అస్తిత్వపు ప్రాథమిక విలువ గోచరమౌతున్నది. అది అనుభూతికే తప్ప వ్యాఖ్యానానికి అందేదికాదు !

'మైనా' లో నాయకుడు సాయిబాబా, పోలీస్ కాన్‌స్టేబిల్ ఈ నవలలో కథవున్నా, కథా సంవిధానంలేదు. అందుకు కారణం సాయిబాబా జీవితానికీ వ్యక్తిత్వానికీ రచయిత సాధించిన తాదాత్మ్యం. ఆ వ్యక్తిత్వ ఒక దృక్పధాన్నీ లేక కొన్ని విశ్వాసాలనూ ముందు పెట్టుకొని తన్మూలంగా నడిచి, లేక నడవలేక బాధపడిన వ్యక్తిత్వంకాదు. కాని సాయిబాబా జీవించిన జీవితాన్నిబట్టి చూస్తే అందులో ఒక సౌష్ఠవం, కొన్ని ముఖ్యమైన మలుపులూ గోచరమౌతాయి. అందునుంచీ ఉత్పన్నమయ్యే విలువల్నిగూర్చి ఎవరికివారు వ్యాఖ్యానమూ చేసుకోవచ్చు.

ఈ నవలల్లో వ్యక్తి జీవితంతో రాజీపడటం, జీవితాన్ని అంగీకరించడం అనే పర్యవసానంద్వారా అస్తిత్వపు స్పృహ అనుభూతమౌతున్నది.

ఇంతవరకూ పేర్కొన్న రెండు పద్ధతులూకాక మూడో పద్ధతి వుంది. నవలలో ఒక పాత్రద్వారాకాకుండా, యిద్దరు ముగ్గురు పాత్రలద్వారా వారి మనస్తత్వాలకూ అనుభూతికీ, సాదృశ్యంలో భిన్నత్వం సూచించడంద్వారా, అస్తిత్వవాద దృక్పథాన్ని స్పష్టీకరించడం ఈమూడో పద్ధతి. 'అసురసంధ్య' (ఆర్. యస్. సుదర్శనం) 1965, 'హిమజ్వాల' (వడ్డెర చండీదాస్) 1974 ఈరకం నవలలు. 'అసుర సంధ్య' లో యిద్దరు పాత్రలున్నారు. నాగరాజ మొదటినుంచీ ఏరకమైన వ్యవస్థను అంగీకరించడు. జీవితంలో తాదాత్మ్యంచెంది తద్ద్వారా విలువల్ని సృష్టించే దృక్పథం అతనిలో మొదటినుంచీవున్నది. శ్రీధర్‌పాత్ర అందుకు భిన్నం, అతను ఏవో విలువల్ని, ధర్మాల్నీ, ఆదర్శాల్నీ ముందుపెట్టుకొని అడుగులువేయబోయి మాటిమాటికీ తూలుతాడు. క్రమంగా జీవించడంనుంచే వ్యక్తిత్వమూ విలువలూ సిద్ధిస్తాయని గ్రహిస్తాడు. అలాగే చంద్రావతి పద్మమణి పాత్రలూ భిన్నత్వంకలిగి ఈ దృక్పథ నిరూపణకే తోడ్పడుతవి. స్త్రీ పురుష పాత్రల సాదృశ్యంలో భిన్నత్వంద్వారా ఈ నిరూపణజరిగింది. 'హిమజ్వాల' నవలలో కృష్ణచైతన్య, గీత అస్తిత్వవాద దృక్పథాన్ని అభివ్యక్తంచేసే ముఖ్యపాత్రలు. వారికి విజయసారథి, మాధురి పాత్రలకు పరస్పరంలో సాదృశ్యం కనిపించినా ఈ పాత్రల్లో అస్తిత్వపు ఆర్తి, అన్వేషణా, కనీసం స్పృహ లేకపోవడం అనే భిన్నత్వాన్ని నిరూపించడంద్వారా ముఖ్యపాత్రల వైశిష్ట్యాన్ని స్పష్టం చేశారు రచయిత. కాని ఈ నవల ముగింపులో విశేషం, అస్తిత్వ జిజ్ఞాసతో అన్వేషించిన గీత మరణిస్తుంది. కృష్ణచైతన్య జీవితం మళ్ళీ ఒక మలుపు తిరుగుతుంది. అతని అన్వేషణలో వరో అధ్యాయం ప్రారంభమయ్యే సూచనతో నవల ముగుస్తుంది. జీవితానికి ముగింపు లేదని ధ్వని.

# IV

అస్తిత్వవాద లక్షణాల్ని కొన్నింటిని ప్రతిఫలించిన మొదటి కథలు నాకు తెలిసినంతవరకు పాలగుమ్మి పద్మరాజు వ్రాసిన 'గాలివాన' 'పడవప్రయాణం'; విశ్వనాథశాస్త్రి 'కార్నర్ సీట్' 'నీడలు'. జీవిత గాంభీర్యాన్ని అంటే ఎందుకు ? అనే ప్రశ్నకి లొంగని, వివరణకూ విశ్లేషణకూ అతీతమైన అస్తిత్వపు తాలూకు రహస్యాన్ని హృదయ స్పందిగా ఆవిష్కరించే రసధ్వని యీ కథల్లో ఉన్నది.

1965 లో వేను వ్రాసిన 'ఏకాంతం' అనే చిన్న కథను ఉదాహరిస్తాను. ఆనందరావు ఆరోగ్యం దృష్ట్యా సిగరెట్ మానెయ్యాలని డాక్టరు సలహా. మానెయ్యాలని ప్రయత్నించి విఫలుడై, ఎందుకు విఫలుడౌతున్నాడో జిజ్ఞాసచేస్తూ జీవితాన్ని తిరగవేస్తాడు. కథ ముగింపు; "సిగరెట్ కాలుస్తుండగా ఆనందరావుకు అర్థం స్ఫురించింది. హేతువాదం దృష్ట్యా, ఆరోగ్య సూత్రాల దృష్ట్యా, కుటుంబ బాధ్యత దృష్ట్యా వదలిపెట్టవలసిన సిగరెట్‌ని తను ఎందుకు వదలిపెట్టలేకుండావున్నాడో అర్థం తెలిసివచ్చింది. చీకటిలో మెరుస్తూ తన ఊపిరితోపాటు స్పందించే ఈ సిగరెట్‌కొన, ఈ నిప్పుకళిక, వికసించి ముకుళించే యీ ఎర్ర గులాబీమొగ్గ, ఇది తన ఏకాంతం, తనలోని తన స్వరూపం. జీవితానుభవాలు అనే పూసలకి అర్థాన్నీ ఆకారాన్నీ కల్పిస్తున్న అంతస్సూత్రం ఏకాంతం. సిగరెట్ కాలుతూనేవుంది" అస్తిత్వపు అనుభూతి ఎప్పుడు దేనిలో ఎలా వస్తుందో చెప్పడం అసాధ్యం. అది కలిగినప్పుడు లభించే విముక్తి, స్వేచ్ఛ, జీవితంమీద కొత్తదృష్టీ దాన్ని నిరూపిస్తాయేతప్ప, దాన్ని యిదమిద్ధమని ఉపాధులద్వారా వివరణద్వారా నిర్వచించడానికి వీల్లేదు.

'త్రిపుర' వ్రాసిన 'వంతెనలు' అనే కథలో అస్తిత్వపు తాలూకు తీవ్రమైన పరివేదన (Existential despair) చిత్రించబడింది. జీవితం అర్థంలేని కొన్ని సంఘటనల కూర్పు. ఆత్మాన్వేష

ణంలో మనిషి బయలుదేరినచోటికే తిరిగి వస్తాడు. తన్ను తాను వెదుక్కోవడంలో అనుభూతులమధ్య, ఆలోచనలమధ్య వంతెనలు కేవలం బుద్ధికల్పన. అవి చాలవు. చివరకు మిగిలేది ఏదో స్ఫురణ. కథానాయకుని మనఃస్థితిని మొదటా చివరా అతని టేబిల్ డ్రాయర్‌వున్న రివాల్వర్, గార్డినాల్ మాత్రలు సూచిస్తాయి.

నేను వ్రాసిన 'మధుర మీనాక్షి' అనే కథ వేదాంతపరమైన అస్తిత్వవాదానికి ఉదాహరణ. 'క్రైస్తవ పరమైన అస్తిత్వవాదం' (కర్కెగార్డ్, పాల్ టిల్లిచ్) ఒక దృక్పథం ఉన్నట్లే, ఈ కథలోని దృక్పథాన్ని 'వేదాంతపరమైన అస్తిత్వవాదం' అనవచ్చును. సంప్రదాయంలో పరాశక్తి మాతృమూర్తి. ఇది ఒక ప్రతీక. ఒక దార్శనికమైన నిర్దేశం. భగవత్తత్వానికి లింగభేదంలేదు, వావివరుసాలేదు. ఈ కథలో మీనాక్షి ప్రియురాలిగా కథానాయకునికి అద్వైతానుభూతి ప్రసాదిస్తుంది. ఈ అనుభవం శారీరకంగా కనిపించినా పారలౌకికమైనది. కథలో దానికి తగిన ఉపపత్తి చేకూర్చబడింది. సంప్రదాయవాదులకు మీనాక్షీదేవి ప్రియురాలు కావడం 'షాకింగ్'గా వుండవచ్చు. ఇక్కడే అస్తిత్వవాద దృక్పథం వేదాంతపరంగా అభివ్యక్తమౌతుంది. ఈ సందర్భంలో ఒక ఐతిహ్యాన్ని ప్రస్తావిస్తాను. నా కథను ప్రభావితం చేసిన ఐతిహ్యం అదే. ధూర్జటి శృంగారప్రియుడు. అంతకంటె శివభక్తుడు. ఇందులో అసంగతమేమీలేదు అస్తిత్వవాది అసంగతం ఉండదని గ్రహించగలడు. ధూర్జటి శివరాత్రినాడు వేశ్యపర్యంకంమీద ఉండి, వేశ్య స్తనాన్ని శివలింగంగా అర్చిస్తాడు. శ్రీ నోరి నరసింహశాస్త్రి వ్రాసిన 'ధూర్జటి' నవలలో, ధూర్జటియొక్క ఈ చర్యను శివభక్తిస్ఫోరకమైనాఅపచారంగానేచిత్రించి దానికి శిక్షగా ధూర్జటి,రాజదగ్గర అవమానం పొందినట్లు చిత్రణ జరిగింది. అస్తిత్వవాది అవగాహనలో ధూర్జటి పాత్రపోషణ మరోవిధంగా వుంటుందని వేరుగా చెప్పనక్కర లేదు. వేదాంతంలో భగవల్లీల, భగవన్మాయ అనేదానికి సంప్రదాయం సరిహద్దుకాదు. దానికి సరిహద్దులులేవు. వ్యక్తివైశిష్ట్యాన్నిబట్టి ఆ లీల అనుభూతం అవుతూ ఉంటుంది. ఇదే 'మధురమీనాక్షి' కథ ధ్వనిస్తుంది.

1973లో 'ఎరుపు' అనేకథ ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రచురితమైంది. ఈ కథలోని సారథి బుద్ధిజీవి. కథలో తాత్త్విక, నైతిక, సామాజిక, రాజకీయ సిద్ధాంతాలతో జీవితంలోని అనుభూతికీ, ఘటనకీ (**chance**) భాష్యం చెప్పుకోడానికి వీలుకాని స్థితి ఎదురౌతుంది సారథికి. సారథి క్షయరోగి. వ్యాధి ఉధృతంగాఉన్న కాలంలో అతని ప్రవృత్తికీ, అది తగ్గినట్లు తెలియగానే అతని ప్రవృత్తికీ ఎంతో తేడా కనిపిస్తుంది. అతణ్ణి ఆకర్షించిన రాజ్యలక్ష్మి అతని జీవితాన్ని అనుభూతి వైశిష్ట్యంతో మార్చివేస్తుంది. వ్యాధి తిరగబెడు

తుంది. అతనికే తెలీని అస్తిత్వపు లోతుల్నుంచీ వచ్చిన ఉద్వేగంతో ఆమెను హత్యచేస్తాడు. 'మృత్యోర్మా-అమృతంగమయ' అనే వాక్యం లోని వ్యంగ్యంతో కథ ముగుస్తుంది. బుద్ధిజీవికి జీవితంతో వ్యవహరించడం తెలీదు. అతను జీవితాన్ని హత్యచేస్తాడు.

ఇక్కడ ఉదాహరణ ప్రాయంగానే కొన్ని కథల్ని ప్రస్తావించాను. అన్నింటినీ అందరు రచయితల్నీ పేర్కొనడం సాధ్యంకాదు.

# V

తెలుగు కవిత్వంలో అస్తిత్వవాదం ఎక్కడైనా కనిపిస్తుందా? 1965లో కనిపించి అనతి కాలంలోనే మాయమైంది, దిగంబరకవుల మొదటి సంపుటి. అస్తిత్వవాద దృక్పథాన్ని ధ్యేయంగా పెట్టుకునే అవతరించింది. రెండవ సంపుటినాటికి ఆ ధ్యేయం మారిపోయింది. "ఈ దేశంలో ఈ గోళంలో ఊపిరిపీల్చే ప్రతి మనిషికోసం తపనపడి, అతని భావికోసం వెక్కి వెక్కి ఏడ్చి, పిచ్చెత్తి ప్రవచించిన కవిత... నువ్వు లేవు. నీ అధికారంలేదు. నీ హోదాలేదు. నీ పంచజరీ అంచు లేదు...దేన్నీ నమ్మకు. నీ లోపల, ఈ ముసుగు లోపల, యీ వంచన అంచుల క్రిందవున్న నీఅసలు స్వరూపాన్ని,నీ'తనాన్ని' నమ్ముకో...ఒక్కటే గుర్తుంచుకో...ఇన్నివేల ముసుగు ముఖాలమధ్య ఊపిరి సలపనీని బతుకు పోరాటంమధ్య నువ్వెప్పుడూ ఏకాకివి. జనన మరణయాతనల మధ్య పోరుసల్పే సైనికుడివి...ప్రతిమనిషిలోనూ అతని అసలు స్వరూపం దీపంలా వెలుగుతూ వుంటుంది...నీ నిజస్వరూపంతో యీ ప్రపంచాన్ని పాలించుకో." ఇలా అస్తిత్వవాద దృక్పథాన్ని ప్రబోధించారు మొదటి సంపుటిలో. రెండవ సంపుటినాటికి 'వ్యక్తి'కాదు, 'వ్యవస్థ'ధ్యేయం అన్నారు. "నేటి చెత్త వ్యవస్థని సమూలంగా తొలగించి నిత్యనూతన మహత్తర వ్యవస్థకోసం తపనపడుతున్న దిగంబర కవులం" అన్నారు. అస్తిత్వవాదం సమాజ పరిణామం విషయంలో తాటస్థ్యం వహిస్తుందన్న సామాజికవాదుల విమర్శకు లొంగి, వీళ్లు దిగంబర వాదాన్ని అంటే అస్తిత్వవాదాన్ని వదులుకొని, మార్క్సిస్టు లయ్యారు. "ఈ జీవితం తాటస్థ్యాన్ని వరించకూడదు. మనిషి జీవితం ద్వీపంలా కాకుండా తోటివారి ప్రేరణా స్రోతస్సుగావుండటం కావాలి" అన్నారు. కాని సామాజిక నియంతృత్వంలో వ్యక్తికి ప్రాధాన్యం ఉండదనీ వ్యక్తి నలిగిపోతాడనే గ్రహింపులో "మనిషిని కీలుబొమ్మగా, యంత్రపు విడిభాగంగా తయారుచేసే నియంతృత్వానికి అది (మార్క్సిజమ్) మార్గంకారాదు" అని కూడా అన్నారు. అస్తిత్వవాదానికీ మార్క్సిజానికీ లంకె ఎక్కడో, అసలు సాధ్యమో కాదో, ఆలోచించే ఓపిక, జిజ్ఞాస, వీళ్లకు లేకపోయింది. తర్వాత వీళ్లు విప్లవ కవిత్వపు కాల్పనికతలోకి, నినాదాలలోకి జారిపోయారు. రాజకీయాలు వీళ్లని కబళించివేశాయి. మొదటి సంపుటిలోని ఖండిక లన్నీ ఒకస్థాయి కవిత్వంకాదు. వాటిలో అస్తిత్వ దృక్పథం స్వరూపం దిద్దుకున్న ఖండికలు తక్కువే ఉన్నాయి.

'గ్లానిర్భవతి భారత' అనే ఖండికలో మహాస్వప్న —

"మానవత మసిపాతలా మారిపోయినప్పుడు
మాసిపోయినప్పుడు
నేను వస్తున్నాను దిగంబర కవిని
స్తంభించిన కవితాస్తంభం బద్దలై పుట్టుకొస్తున్న
ఉగ్రనగ్న నరకేసరిని
నా చేసిన చెట్లని నడిపించేందుకు
పాతేసిన రాళ్లని పరికించేందుకు
వికృతాకారపు శిలల్ని మానవులుగా మలిచేందుకు
మరణించిన భగవంతుడికి ప్రాణంపోసేందుకు
నేను వస్తున్నాను దిగంబర కవిని—వాచవిని
రాత్రి ఉదయిస్తున్న ప్రతిభారవిని"

ఇది అస్తిత్వవాద దృక్పథాన్ని గురించిన మేనిఫెస్టో కవిత. మన కవుల్లో చాలమందికి ఏదృక్పథమైనాసరే ఆ దృక్పథాన్ని కవిత పేర వాచ్యంగా యథాతథంగా నినాదాలుగా వ్రాయడమే తెలుసుకాని, ఆ దృక్పథాన్ని అనుభూతిపరంగా, ధ్వనిపూర్వకంగా సృష్టించడం, రూపొందించడం తెలీదు. దిగంబరకవుల మొదటి సంపుటిలోనూ ఇటువంటి మేనిఫెస్టో కవిత ఎక్కువ. కాని ఒకటిరెండు ఖండికల్లో మంచి ప్రయత్నం కనిపిస్తుంది. భైరవయ్య 'హుగే—హురే', నగ్నముని 'జైల్లో సముద్రం' అటువంటివి. జైల్లో సముద్రం యిలా ప్రారంభమౌతుంది-

"సూర్యుని కడ్డంగా నుంచున్న
ఆ మబ్బుతునక పేరేమిటి ?"

ఇది అస్తిత్వపు అనుభూతిని ఆచ్ఛాదించే హేతువును గూర్చిన జిజ్ఞాస

"అర్థంకాని అనంత శూన్యం అంచుమీదకి
ఆకారంలేని కుర్చీనొకటి లాక్కుని
అర్థవంతమైన బతుకు వెన్నెల ముక్కల్ని కప్పులో వొంపి
ఒక్కొక్కక్షణం పెదవులకానించి
విషాదాన్ని ఆరాధిస్తూ వుంటానా
హొయలు హొయలుగా పొగలు పొగలుగా
కెరట కెరటాలుగా కాలం
నా కాళ్లని ముంచెత్తుతూ వుంటుందా
ఎందుకో ఒక్కసారి ఏకాంతంలోకి
నిర్జనారణ్యాలు నడిచివస్తాయి.
నిబిడాంధకార గహ్వరాలు తెరుచుకుంటాయి..."

ఇలా నడుస్తుంది పద్యం అహంత ఒక కుర్చీ—చేతనలో ఊహలూ ఆలోచనలూ కాలగమనం—ఏకాంతంలో అవ్యక్తచేతనలోనుంచీ వచ్చే అర్థంకాని భయాలు — ఏకాంతంలో భయవిహ్వలతరూపం 'సిగరెట్టు చివర' విడివిడి జ్ఞాపకాలు ముసురుకుంటాయి కాని అనుభూతినిగూర్చిన జిజ్ఞాస అలానే మిగిలిపోతుంది. 'అర్థంకోసం' అంటే ఆత్మదర్శనం కోసం అన్వేషణ. 'మనసు మసీదు' 'మహిషం వేదం వల్లెవేయడం' మతవ్యవస్థల్నీ చావుపుట్టుకల్నీ ధ్వనిస్తాయి. మహాబోధి 'నీరో' బౌద్ధ నాగరికతనూ, రోమన్ నాగరికతనూ సూచిస్తాయి. 'నగరం అస్థిపంజరం' వర్తమానకాలపు నాగరిక జీవనపు శూన్యాన్ని తెలుపుతుంది. 'జైల్లో బంధింపబడిన సముద్రం' అరికట్టబడిన స్వేచ్ఛ 'కూలుతున్న పిరమిడ్లు' ప్రాచీన వ్యవస్థా శైథిల్యం 'రోదసీ ప్రయాణాలు' వైజ్ఞానిక విప్లవం చూపే ప్రగతి. 'శిశుగర్భంలో అణుకోరం దిగింది' ఆ ప్రగతికి పరాకాష్ఠ. ఇంత పరామర్శ తర్వాత ప్రశ్న ప్రశ్నగానే మిగిలింది. "ఏది అర్థం పరమార్థం ?" "నీకూ నాకూ నడుమ, నాకూ యీ నటనకీ నడుమ, ప్రపంచ దేశాల ప్రళయ పరాచికాల నడుమ, సత్యానికీ సత్యానికీ నడుమ నిలుచున్న ఆ మబ్బుతునక పేరేమిటి ?" అనే ప్రశ్నతోనే పద్యం ముగుస్తుంది. 'హి హి హీ నీపేరు ఈగ' అన్నట్టే ఆ మబ్బుతునకపేరు 'మేధ' అని సమాధానం మనం చెప్పుకోవచ్చును.

## V

అస్తిత్వవాదం మేధావిన్యాసంచే కప్పబడిన అస్తిత్వపు అనుభూతినీ, దానినుంచీ రూపం దిద్దుకునే వైయక్తిక వైవిధ్యాన్నీ వైశిష్ట్యాన్నీ ప్రాథమికమైన విలువలుగా ఎత్తిచూపుతుంది. మనిషిని జడవస్తువుగానో, యంత్రంగానో, ప్రకృతిలో, సమాజంలో ఒక ప్రయోజనానికి సాధనంగానో, ఉపలక్షించే దృక్పథాన్ని వ్యతిరేకిస్తుందీ దృక్పథం. సామూహికమైన నినాదాలతో ఒత్తిడులతో మనిషిలోని సృజనాత్మక శక్తిని, నవ నవోన్మేషిత్వాన్ని అంతమొందింప జూచే ధోరణులను ప్రతిఘటిస్తుంది. పెట్టుబడిదారీవ్యవస్థగానీ, శ్రామిక వ్యవస్థగానీ, మరేవ్యవస్థగానీ—వ్యవస్థతో వ్యక్తికి సంభవించే ప్రతి సంఘర్షణలోనూ వ్యక్తినే సమర్థిస్తుంది. అందుకే యిది సామాజికమైన అభ్యుదయానికి తోడ్పడదని, తాటస్థ్యం వహిస్తుందని విమర్శ. సామాజికమైన అభ్యుదయాన్ని ఒక చట్రంలా ఊహించినప్పుడు, మానవుని సృజనాత్మకత దానిలో యిమిడేందుకు నిరాకరించకపోవడంలో ఆశ్చర్యం ఏమీలేదు! సమాజానికీ వ్యక్తికీమధ్య యిచ్చి పుచ్చుకోవడమనే సంబంధాన్ని గుర్తించినప్పుడు రెండింటికీ ప్రాధాన్యంవుందనీ, వ్యక్తివినాశం సమాజ స్తబ్ధతకూ వినాశానికీ దారితీస్తుందనీ అంగీకరించక తప్పదు. మరొక్క విషయం గమనించాలి. సమాజ ప్రగతిని నిరోధించని, దాని జోలికిపోని అనుభూతిలోకం వ్యక్తిలో ఎంతో మేర వున్నది. రాజకీయ, సామాజిక వ్యవస్థ అనవసరంగా దానితో కల్పించుకొని, దాన్ని నియంత్రించి, శాసించేపనికి పూనుకోకపోతే చాలు! మనిషిలో సృజనాత్మకత నశిస్తే, మనిషి వ్యక్తిగానూ సామూహికంగానూకూడా మరణిస్తాడు! మనిషి చావకూడదు!

# వాడుక మాటల్లో "మాట" వాడుక

శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న

మాటల సందర్భాన్నిబట్టీ మాటకి అర్థం మారుతుంది. మాటకీ- అంటే ఉదాహరణకి అన్నమాట. నా మాట యేంచేసేరు పంతులుగారూ అని అడిగినప్పుడు ఆ మాటకి విన్నపం అని అర్థం. ఆ మూగదాని మాటేవిటి అంటే ఆమె సంగతి (విషయం) అని స్ఫురిస్తుంది. "మాటమీద మాటొచ్చి" అలా అన్నానండీ అన్నప్పుడు ప్రసంగవశాత్తూ అని భావం. "వాడి మాటలకేవిటి" ఏదో అన్నాఁవో విలువలేని ప్రసంగం అని ద్యోతకం. "మాటా మాటా" వచ్చి ఆ అన్నదమ్ములమధ్య మరి మాటల్లేకుండా పోయినాయి అన్నప్పుడు, వాగ్వాదన పెరిగి శత్రుత్వం యేర్పడింది అని తెలియబరుస్తున్నాం అన్నమాట. మీ చెల్లెలికి పెళ్ళి నిశ్చయం అయిందన్నావు; "కట్నం కానుకలమాట" యేవైనా రాసేరా అని అడిగితే ఆ బాపతు వివరాలు అడుగుతున్నాం అన్నమాట.

రాత్రే వాడికి "మాట" పడిపోయిందిట—సన్నిపాతం కమ్ముకుపోయిందని చెప్పరావడం. "ఏ మాట కామాటే చెప్పాలి" నిష్పాక్షికం ద్యోతకం. మంచి మనిషికో "మాటా", మంచి పశువుకో దెబ్బాను అన్నప్పుడు "సలహా" అన్న అర్థంలో వాడుతున్నాం.

నీకో "మంచిమాట" చెప్పనా అంటే సంతోష ప్రదమైన వార్త అన్నమాట. వాళ్ళు "భోజనానికి ఉండేమాటా, లేనిమాటా?" అని యిల్లాలు అడిగితే, అనిశ్చితార్థం వ్యక్తం అవుతుంది.

నలుగురిలో ఉన్నప్పుడు, యే ఒక్కవ్యక్తివేపో ఒక్కక్షణం చూపులో చూపు కలిపి చూసి "మాట!" అన్నాం అంటే ఆ వ్యక్తి ముందుకి లేచివస్తాడు ఏదో రహస్యం చెబుతారు కాబోలునని.

"అద్దదీమాట!" అని యేదో వాదం కొంత సాగేక అన్నాం అనుకోండి—ఇప్పుడు నువ్వన్నది యుక్తంగా ఉంది అని ధ్రువపరుస్తున్నాం అన్నమాట.

"ఎంతమాట! తమరలా సెలవియ్యవచ్చునా" అన్నప్పుడు గౌరవ ప్రపత్తివ్యక్తం; "ఎంతలేసి మాటలన్నాడనుకున్నావ్, వేలంత లేడుగాని?" అన్నప్పుడు అగౌరవం స్ఫురింపజేస్తున్నాం.

"మాటలు కోటలు దాటతాయి. కాలు గడపదాటదు"— ప్రగల్భాలు పలకడం తేలిక, కార్యరూపంలో పని సాధించడం కష్టం అన్నది తెలియవస్తుంది "మాటకి మాట పెరుగూ, నీటికి నాచు తెగులూ" అన్న సామెతలో వాగ్వాదానికి మూలం తెలియవస్తుంది.

"మనలో మనమాట"—నలుగురితోనూ అనవలసిన విషయం కాదు అని అర్థం— "నీ మనస్సులోమాట యేదో చెప్పుబాబూ" అన్నప్పుడు, గోప్యంగా ఉండిపోయిన విషయంఁవేదో బహిర్గతం చెయ్యి అని అడుగుతున్నాం.

"నాతో మాటంటే మాటే" అన్నప్పుడు నిశ్చిత ప్రవర్తన నిరూపణం అవుతుంది—"ఆ మాటమీద నిలబడు" అంటే నీ వాదం నిలబెట్టుకో అని అర్థం. "ఆ మాట మరి లాభంలేదురా" ఆ వాదం నెగ్గదు అని భావం. "అదేఁవన్నమాట?" అని సవాలుచేస్తే, ఎందుక్కాకుడదూ అని అర్థం. ఘంటయి వాగుతూఉంటే, "ఏమాటా" అనవేంరా! అని ఘోషిస్తే, జవాబు చెప్పఁవేం అని గద్దిస్తున్నాం అన్నమాట. "వాడిమాట" ఇహ మరిచిపో—వాడు యింక అక్కరకు రాడు అని నిస్పృహ! "ఆ మాటకొస్తే" (ఆ పరిస్థితులో) నీతో అసలు మాట్లాడగూడదు (ఏ సంబంధం పెట్టుకోకూడదు) ఇలా యెన్నో ఉన్నాయి.

అయితే, అన్ని మాటలూ పలికినట్టూ రాయలేం; రాసినట్టూ పలకలేంకూడాను. మచ్చుకి "తాటాకు" — దీని ధ్వని స్వరూపం "ఆ" "ఏ" లకీ మధ్యగా ఉంటుంది, వాడుకలో—దీన్ని యింగ్లీషులో **Æ diphthong** అంటారు. ఇంగ్లీషులో "**Man**" అన్నపదం ఉంది చూడండి! అది "మాన్" కాదు; "మేన్" కూడా కాదు, ఆ రెండింటికీ మధ్యది; అలాంటిదే మన "తాటాకు" కూడాను. "బేంకు" (బ్యాంక్), "మేనేజరు" (మ్యానేజర్), "కేష్" (క్యాష్) మొదలైన పదాలు యీ కోవకే చెందుతాయి.

ఇప్పుడు వ్యవహారంలోఉన్న కొన్ని ప్రయోగాలలో, అర్థసుబోధకంకోసం, కొన్ని కొత్త — పాత మాటల కలయిక కానవస్తూ ఉంటుంది — కాలక్రమేణ యీ రెండు మాటలకీ అర్థం ఒకటే అన్నది మరిచిపోయి, యీ కలగలుపు మాటలే, వాడుకలో మిగిల్చేసుకున్నాం. ఉదాహరణకి — "రహదారి"—రహా అంటేనేదారి. ఇప్పుడది

thorough fare అన్న అర్థంలో స్థిరపడిపోయింది — "No public thorough fare — ఇది రహదారికాదు". ఇలాంటిదే యింకో ప్రయోగం: "వాడి తదనంతరమందు—". తదనంతరం అంటే వాడి తరవాత అని అర్థంకదా, "వాడి తదనంతరం" యేమిటి? అయినా యీ ప్రయోగం యిప్పటికీ "వీలునామా"ల్లో కనిపిస్తూనే ఉంటుంది. ఓ నలభై యేళ్ల క్రితం సంస్కృతంతో అట్టే పరిచయం లేనివాళ్లు ఉత్తరాలు రాస్తూ శిష్ట వ్యావహారికం రాస్తున్నాం అనుకుని, "చిరంజీవి...కి ఆశీర్వచనములు. ఉభయకుశలోపరి, తరవాత-" అని వ్రాసేవారు, "ఉపరి" అంటేనే "తరవాత" అన్నది తెలియక.

సంస్కృతం మూలం తెలియక తప్పుగా వాడుకలోకి వచ్చి నిలిచిపోయినవి మరికొన్ని మాటలు-

(1) గమనించడం=గమ్ (గచ్ఛ్) to go అని సంస్కృతం. ఇప్పుడు, "ఈ విషయంమాత్రం గమనించుకోతగని (గమనించతగ్గది)" అంటే, మనస్సుకు పట్టించుకోతగ్గది అన్న అర్థం రూఢి అయిపోయింది.

(2) వృద్ధాప్యం=వృధ్ (వర్ధ్) అని సంస్కృతం — దీని నుంచి వృద్ధత్వం అనికాని, వార్ధక్యం అనికాని అనాలి; కాని వృద్ధాప్యం అనేస్తున్నాం.

(3) తద్దినం — ఆరోజు అని అర్థం-ఇందులో అశుభద్యోతకం అయినది ఏదీ లేనప్పటికీ "ఆబ్దీకం" "శ్రాద్ధం" అనే అర్థం నిలిచిపోయింది. అబ్దం అంటే ఏడాది అనీన్నీ, శ్రద్ధతోచేసేది శ్రాద్ధం అనీన్నీ కాబట్టి యీ మాటలూ అలాంటివే, స్వతః అసలు మాట చెప్పకుండా ఆ అర్థం స్ఫురింపజేసేవి.

(4) వక్క లేక చెక్క—కొన్ని ప్రాంతాల్లో "వక్క" వేసుకుంటారా అనీ మరికొన్ని ప్రాంతాల్లో "చెక్క" వేసుకుంటారా అని అడుగుతారు, ముఖ్యంగా భోజనానంతరం. "వక్క" అంటే ముక్క (a piece) — వాడి తల వేయి వ్రక్కలగుగాక అని శపించెను అని చదువుతాం—"చెక్క" అన్నా ముక్కే. భవతు. మరి "వక్క" అన్నా "చెక్క" అన్నా ముక్క అనే అర్థం అయినప్పుడు దేనితాలూకుది ఆ వక్కో చెక్కో? పోకవక్క (పోకచెక్క). అదీ అసలుమాట. అందులో పూర్వార్థంపోయి, ఉత్తరార్థమే వాడుకలో మిగిలిపోయింది.

(5) అస్తమానం — "మావాడు అస్తమానం ఆడతాడు; ఒక్కమాటైనా పుస్తకం ముట్టుకోడు" అని తల్లో తండ్రో చిరాకు పడగా వింటాం. వాళ్ల ఉద్దేశం 'పొద్దస్తమానం' అని. ఆ 'పొద్దు' తీసేస్తే యీ 'అస్తమానా'నికి అర్థం పూర్తికాదు. అయినా "అస్తమానం" అన్న మాట శిష్ట వ్యవహారంలోఉంది.

(6) వెధవ = విధవాయాః అపత్యంపుమాన్ వైధవేయః. ఇది కొన్నేళ్ల క్రితం "వెధవాయ" గామారి, తరవాత "వెధవ" గా స్థిరపడిపోయింది. యిది అసభ్యం అయిన తిట్టు. తండ్రి కొడుకుని "వెధవా" అంటే తన భార్యనే తిడుతున్నాడన్నమాట.

(7) వివరాలు : పైన ఉటంకించెను "కట్నకానుకలమాట" అంటే ఆ బాపతు వివరాలు అని. ఈ "వివరం" అన్నమాట తప్పుగానే వాడుకలోకి వచ్చింది. సంస్కృతంలో "వివరం" అంటే "రంధ్రం" అని అర్థం — ఉద్దిష్టం "వివరణ" అని — అయినా "వివరం" రూఢి అయిపోయింది. మర్యాద : ఈ పదానికి సంస్కృతంలో "పొలిమేర"(limit)అని అర్థం. గౌరవం అన్న అర్థంలో వ్యవహారంలో ఈ పదాన్ని వాడుతున్నాం. చలపతి= వేంకటాచలపతి అన్నది సంస్కృతం. అచలం అంటే కొండ-కాబట్టి "అచలపతి" అనాలి. కాని "చలపతి", "చలపతిరావు" అన్న మాటలు వ్యవహారంలో నిలిచిపోయేయి.

(8) ముష్టి : పిడికిలి అని అర్థం. ముష్టి పిడికెడు వేస్తాం కనక, ఆ వేసిన దానిని "ముష్టి" అంటున్నాం...(ఇంగ్లీషులో దీన్ని Metonymy అంటారు.) కాని ముష్టి వేసినవాడు మాత్రం "ముష్టివాడు" కాడు!

(9) మాండలీకాలు : జ్ఞాపకం—గురుతు—జ్ఞప్తికి తెచ్చేది జ్ఞాపకం. "నువ్వు కోరిన వస్తువ యివాళ తప్పకుండా తెస్తాను—జ్ఞాపకార్థం రుమాలు ముడివేసుకుంటున్నాను" అంటే రుమాలు ముడి ఆ వస్తువుని జ్ఞప్తికి తెచ్చేగురుతు. ఈ అర్థంలో "జ్ఞాపకం" అన్న మాట ఉత్తర సర్కారు జిల్లాలో వ్యాప్తిలో ఉంది. కాబట్టి "జ్ఞాపకం" రాలేదు అన్న ప్రయోగం తప్పే. జ్ఞప్తికి రాలేదు అనాలి. అయినా "జ్ఞాపకం" రాలేదు అన్నదీ సువ్యాప్తంగా ఉంది.

బోధపడడం—అర్థంకావడం- బుధ్ (బోధ్) to understand లోంచి "బోధపడడం" వచ్చింది. అర్థం అయితేనేగాని అవగాహనకాదు గనక "అర్థంకాలేదు" అంటారు కొన్ని జిల్లాలవాళ్లు ఇలాగే ఉత్తర సర్కారు జిల్లాల్లో ఉష్ణం అన్న పదానికి, మరికొన్ని జిల్లాలో "జొరం" అని వాడతారు. ఉష్ణం ఉష్టం అయిపోయినట్టే "జ్వరం" జొరం అయిపోయింది వాడుకలో.

అగ్నిహోత్రావధాన్లు చెప్పినట్టు "మాట భేదం కాని, ముక్కంతా వకటే"!

(కీ॥ శే॥ కళా ప్రపూర్ణ డా. గిడుగు సీతాపతి, D. Litt మా బావగారు. వారితో మాట్లాడుతున్నప్పుడు యిటువంటివి యెన్నో ప్రసంగవశాత్తూ దొర్లిపోయేవి! వారి సన్నిహిత సాహచర్యమే యీ వ్యాసానికి ఆధారం.)

# 20వ శతాబ్ది కవి హృదయం - ఒక సృజనాత్మక ప్రయోగశాల

శ్రీ సోమసుందర్

**యూ**రోపియన్ దేశాల లలిత కళల చరిత్రలో 20వ శతాబ్దపు పూర్వార్థంలో ప్రయోగాలు క్రిక్కిరిసినట్లు కనిపిస్తాయి. చిత్రలేఖనంలో, శిల్పంలో, గృహ నిర్మాణ కళలో, సంగీతంలో, కవిత్వంలో ఈ ప్రయోగశాలిత్వం స్థూల దృష్టికికూడా స్పష్టంగా దర్శన మిస్తుంది. 19వ శతాబ్ది చివరి వరకూ గతానుగతికంగా ఆనుపూర్వికంగా సర్వజనామోదకర సాంప్రదాయక సంవిధానాలు, తీరుతెన్నులూ ప్రచలితంగా ఉంటూవచ్చాయి.

ఇరవయ్యవ శతాబ్ది ప్రవేశించేసరికి — మానవ జీవిత రంగాలన్నింటినీ వైజ్ఞానిక శాస్త్రం శాసించ నారంభించినది. నిత్య నైమిత్తిక జీవితంలో వైజ్ఞానిక శాస్త్రసిద్ధి సంపూర్ణ ప్రభావం కలిగించ నారంభించింది. జీవపరిణామ సిద్ధాంతమూ, సామాజిక ఆర్థిక రంగాలలో గతి తార్కిక సిద్ధాంతమూ, మనస్తత్వ శాస్త్ర పరిశోధనలో స్వాప్నిక మనోధర్మ సిద్ధాంతమూ, భౌతిక శాస్త్ర రంగంలో సాపేక్ష సిద్ధాంతమూ వంటివి, పాత యోచనా మార్గాలను ఎగరగొట్టి వేశాయి. కొత్త తెన్నులను నిర్ధరించ నారంభించాయి.

నవీన యోచనా మార్గాల ఆవిష్కరణ — సర్వ మేధారంగాల నూతన ప్రభావ పరిధిని విస్తరించ నారంభించింది. ముఖ్యంగా మనోజన్యాలైన కల్పనా కళలపై ఈ ప్రభావం మరింత విస్పష్టమవుతూ వచ్చింది. హస్త నైపుణ్యంపై ఆధారపడే అభ్యాస కళలలో గతానుగతికత్వం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. మనోజన్యాలైన సృజనాత్మక కళలపై వారసత్వ ప్రభావమేకాని, సంప్రదాయానుకరణం ప్రాధాన్యత వహించ నక్కరలేదు.

లలిత కళలకు వ్యక్తినిష్ఠమైన ప్రతిభ ముఖ్యం. ప్రతిభ నవనవోన్మేషశాలి; కనక తరంనుంచి తరానికీ — వ్యక్తినుంచి వ్యక్తికీ నవ్యతా ముద్రకోసం అన్వేషించడమే ప్రాణ భూతం, నవ్యతకై అన్వేషించడం సహజమేకాని అన్యంకాదు.

లలిత కళలను అనుభవించేవారు సహృదయులూ రసికులూను. ప్రతిభ కేవలం వ్యక్తిపరమేఅయినా సామాజికుల అభిరుచి ప్రభావం కళాకారునిపై ప్రసరించదనుకోవడం సత్య సమ్మతం కాదు. ప్రతి మానవుడు సామాజికుడే కావడంవల్ల, ప్రతిభావంతుడు కూడా సమాజంలో అవినాభావ సంబంధంతోనే అభివృద్ధి చెందుతాడు. ఎంత గొప్ప ప్రతిభావంతుడైనా ఒంటి స్తంభపు దంతాల మేడలోకూర్చుని తపస్సు చేస్తే ప్రతిభను ఆవిష్కరించుకోలేడు. కళాకారుడు ద్రష్ట; ద్రష్ట అంటేనే ఋషి అని అర్థంతప్ప మౌని అనికాని, తాపసి అనికాని అర్థం చేసుకోరాదు.

పైన పేర్కొన్న వైజ్ఞానిక సిద్ధాంతాల ప్రభావం సామాన్య ప్రజానీకపు అభిరుచిపై 19వ శతాబ్ది అంతంవరకూ తగినంత మార్పు తీసుకురాలేకపోయింది. కనుకనే గతానుగతికత్వం స్థూలంగా ఆనాటి కళా స్వరూపాలను పాలిస్తూ వచ్చింది.

ఇరవయ్యో శతాబ్దారంభంలోనే జన జీవితంలో కొత్తరేకులు విచ్చుకున్నాయి. వైజ్ఞానికశాస్త్రం నిత్యజీవితంలో ప్రాధాన్యతవహించ నారంభించింది. మూఢవిశ్వాసాల స్థానే ప్రజానీకంలో హేత్వాధీన దృష్టి పెరగ నారంభించింది. శాస్త్రీయ సిద్ధాంతాలకూ మూఢ విశ్వాసాలకు మధ్య హెచ్చరిల్లిన ఘర్షణ మానవుని మనస్సులలో నూతనాభిరుచులకు భూమికను సిద్ధం చేసింది. ఈ సమాయత్త భూమిక వ్యక్తి ప్రతిభాప్రోక్తమైన సృజనాత్మక శక్తులకు ప్రేరణ కలిగించింది. కళాత్మక హృదయం ప్రయోగశాలగా మారిపోయింది. గతానుగతిక కళామార్గాలకు స్వస్తి చెప్పింది. నూత్న స్వరూపస్వభావాలను సంతరించుకుంది. అపూర్వ సంవిధానాలను స్వాధీనపరచుకుంది. ఈ ప్రయోగాల ఆవిష్కరణ తరుపుష్పన్యాయంగా చాలా సహజంగా జరిగింది.

సంవిధానంలోనూ, అభివ్యక్తిలోనూ నూత్నపథాలకోసం జరిగే అన్వేషణ అతి నిశితంగా జరిగింది. సాంప్రదాయకంగా స్థిరపడిఉన్న అభివ్యక్తి, పద్ధతులు నిష్కర్షగా సమాలోచించుకోబడ్డాయి. వినూత్న మార్గాలను ఆవిష్కరించుకుందుకు, ఆసక్తి పెంపొందింది. ఈ పిపాస కళాకారులందరికీ సాముదాయకంగా ఒకేకాలంలో జనించింది. అంటే ప్రతిభావంతులైన ఒకరిద్దరు కళాకారుల హృదయాలలోనే యిది బయల్దేరిందని చెప్పడం సబబుకాదు. ప్రతిభ వ్యక్తినిష్ఠమే కాని అన్వేషణ సామూహికమే. ఇలా ఎందు కనవలసివచ్చిందంటే — ప్రజా హృదయరంగస్థలిలో పాతపద్ధతులపట్ల విముఖత ఏర్పడింది. గతానుగతికత్వంపట్ల తూష్ణీభావం పెరిగింది. అభిరుచులలో మార్పుదండ డించనారంభించింది. రసికుడూ, కళాస్రష్ట అనే రెండుశక్తులు పరస్పర విరుద్ధాలు కావుకదా! పైగా పరస్పర ఆధారాధేయాలే! విశాల సామాజికహృదయం కళాకారుల నూత్నమార్గాన్వేషణకు ప్రేరణ కలిగించింది.

కళాకారులు కేవలం సంప్రదాయవాదులే అయితే నూత్న మార్గావిష్కరణకు విముఖులైపోయేవారు. తద్వారా నడవగా నడవగా పాతగిల్లి, తుప్పుదుళ్లి పనికిరాని పాతదారులు పట్టి గుడ్డిగాపోయి ఉండేవారు. అలాంటివారిని సామాజికహృదయం నిర్మోహమాటంగా తిరస్కరించి ఉండేది. లేదా కళలపట్లనే ఉదాశీన వైఖరి అవలంభించేది.

ఈ పరిస్థితి సరిగ్గా ఆంధ్రసాహిత్య చరిత్రకు పట్టింది. 20 వ శతాబ్దిలో రచింపబడిన ప్రబంధాలెన్నో కుక్కచావు చచ్చాయి. ఈ వాస్తవిక జ్ఞానంతోనే ప్రతిభావంతులైన కవులు - గతాభివ్యక్తి పథాలను నిష్కర్షగా తిరస్కరించక తప్పలేదు. నూత్న సంవిధాన పద్ధతులను నిశిత సంశీలనతో అన్వేషించకనూ తప్పలేదు. వైవిధ్యంతో కూడిన కొత్త నిర్దేశాలను (aims) స్వాధీనం చేసుకోవలసి వచ్చింది.

ఈ దశలోనే విశాలమానవజీవిత జన్యాలైన సమస్యల బాహుళ్యాన్ని అవగతం చేసుకొని, ప్రతిధ్వనించవలసిన పూచీకూడా కళాకారుడు స్వీకరించాడు. ఐతే సమస్యలసేవి రెండురకాలు. భౌతిక పరిస్థితిని కలవరపరచేవి కొన్ని, మనోపరిధిని సంకటపరచేవికొన్నీను. అంటే వీటినే వాస్తవసమస్యలు,*ఆంతరిక సమస్యలుగా విభాగించవచ్చు బాహ్య సమస్యల పరిష్కారమార్గాన్ని యితివృత్తంగా స్వీకరించే కళలు ఉపయోగాత్మక కళలు, పచ్చి ప్రబోధాత్మకకళలు బొత్తిగా వేలబారునైతే - ధ్వనింపచేసేవి ఉత్తమ ఉపదేశకళలు. మనోగత సమస్యల విచికిత్స ప్రధానేతి వృత్తమయ్యేవాటిని నిరంజన కళలు (pure art) అంటున్నారు.

ఈ శతాబ్ది ప్రథమపాదంనుంచే ముఖ్యంగా తెలుగు కవిత్వంలో పరిపూర్ణమైన మార్పులు సంభవించాయి. ఈ మార్పులు వస్తుగతమైనవీ, రీతిగతమైనవీకూడ ! ఈ మార్పులు అతివేలంగాకాకపోయినా అలవోకగానైనా సర్వత్రా గుర్తింపబడుతూనే ఉన్నాయి.

కాని కొందరు కవులు సంప్రదాయమార్గమే పరమ పదమనీ విశ్వసించారు. గతానుగతిక రీతులను ఆరాధించారు. విగతజీవుల పురాణ పాత్రలకు, మళ్ళీ మళ్ళీ ప్రాణప్రతిష్ఠ చేయడాన్కి ప్రయత్నించారు. వెరసి తిరోహిత బుద్ధులైనారు. సనాతన పథాలద్వారా సాధించవలసిన ఘనతర శోభలెన్నోకలవని గాఢంగా విశ్వసించారు. కాని పాపం కాలం కలిగించే మార్పును అంతతేలికగా విస్మరించడం సాధ్యంకాదని వారు గుర్తించలేకపోయారు.

ఈ శతాబ్దిలో వీచిన ప్రతివాయూల వీచిలోనూ భావ విప్లవం గుప్తరించ నారంభించింది. దాని ప్రభావం కవిత్వాదిహృదయ జన్యాలైన కళలను అస్పృశ్యంగా విడువదు. ఈ సత్యమే ఈయుగాన కవితాకంఠానికి అపూర్వ చైతన్యాన్ని ప్రసాదించింది. కనుకనే ఆనుపూర్వికఅభివ్యక్తి సాధనాలను విసర్జించడం తప్పనిసరే అయింది. ఈ విసర్జన ఒక్క మన తెలుగు సాహిత్యానికే ఒనగూడిన అరిష్టంకాదు. ఈయుగ ధర్మమే యిదని స్పష్టంగా చెప్పుకోవచ్చు.

ఇలా సాధించబడిన సంవిధానాలు సామాజిక హృదయంలో నూత్న ఓజస్సును ప్రోది చేశాయి. అభివ్యక్తి సాధనాలలో సంభవించిన నూత్నోత్తేజం జనబాహుళ్యాన్ని ఆకర్షించింది. ఈ విధంగా కొత్త నీరు శక్తివంతంగా ఎక్కి రానారంభించింది. దీనికి కారణం జన హృదయం - యుగ వైలక్షణ్యంతో సంసిద్ధమై ఉండడమే

ఈ శతాబ్ది ఆరంభంలో యించుమించు ఒకే కాలంలో, ఒకే ప్రదేశంలో భోగరాజు నారాయణమూర్తిగారూ, గురజాడ అప్పారావుగారూ కవితా కంఠాల నెత్తడం జరిగింది. ఈ యిరువురి కవులలోనూ ఈ వైరుధ్యం విస్పష్టంగా కనిపిస్తుంది

బాహ్య వాస్తవికత పట్ల వీరేశలింగంగారికి అపార చైతన్యం ఉంది. సామాజిక దౌష్ట్యాలపట్ల తీరని ద్వేషమూ ఉంది. ద్వంద్వ నీతుల్ని పరిమార్చి స్త్రీని బానిసత్వం నుండి సముద్ధరించాలనే తపన మిక్కుటంగానే ఉంది. కార్య నిర్వాహణ దీక్షా, ఎలాంటి కష..

నిష్ఠూరాలైనా ధైర్యంగా ఎదిరించాలనే సంకల్పమూ తీవ్రతరంగానే ఉన్నాయి. వాస్తవికతా చైతన్య మూర్తిగా అవతరించిన వాడాయన. కాని సాహితీ పరమైన విప్లవ దృష్టి నూత్న సంవిధాన విస్ఫూర్తి మాత్రం ఆయనకు లోపించాయి. గతంలో స్థిరపడిన కవితారీతులనే ఆయన ఆరాధించారు. కొత్త పానీయాలను పాత పాత్రలకెత్తి జాతి కందించ పూనుకున్నారు. సాధనలోని ఈ అసమన్వయతవల్ల ఆయన సాహిత్య పరంగా ఉత్తమ కళాహృదయాన్ని ఆవిష్కరింపలేకపోయారు. సంఘ సంస్కరణ పతాకమెత్తిన వీర సైనికునిగానే తప్ప ఉత్తమ సరస సాహితీస్రష్ట కాలేకపోయారు.

19వ శతాబ్దినుంచి 20వ శతాబ్దికి మారిన కాలం-ఆంధ్ర సాహిత్యంలో బహుముఖ పరిణామాన్ని క్రమంగా స్థాపించ నారంభించింది. ముఖ్యంగా తెలుగు కవిత్వంలో ఈ మార్పు మరీ విస్పష్టమైంది. 1902 లో ఖండకావ్యాల లఘుపరిమితిలో బాహ్య వాస్తవికతను ప్రథమంగా ఇతివృత్తంగా స్వీకరించిన శ్రీ వేంకట పార్వతీశ్వర కవుల కావ్య కుసుమావళి ప్రారంభమైంది. ఆంధ్ర సాహితీ రంగంలో అంతవరకూ మార్గ దేశి రీతుల మధ్య వైరుధ్యం అఖాతంలా నోరు తెరుచుకునే ఉంది. ఈ అఖాతాన్ని పూడ్చడానికి తొలి ప్రయత్నాలు 20వ శతాబ్దారంభంలోనే ప్రారంభమై. స్థిరీభూతంగా ఉన్న సనాతన మార్గాలను సడలించ నారంభించాయి. ఈ పనికోసమే పుట్టానన్న స్పృహ, – తనది ప్రజల ఉద్యమమని చెప్పుకున్న గురజాడ అప్పారావులో స్పష్టంగా కనిపిస్తుంది. మార్పు పొందుతున్న జీవితానికి కళలు దర్పణం పట్టాలనీ, మారిన యుగానికి పనికిరాకుండా పోయిన పాత ఆచారాలను తొలగించాలనీ, ఈ పనికే తాను అవతరించానని ఈ కారణ జన్మనికి సంపూర్ణ చైతన్యం ఉంది. కనుకనే ఆయన 19వ శతాబ్ది చివరి దశాబ్దంనుంచి ఆమరణాంతం (1915) నవీన ఉదాహరణ కావ్య రూపాలను సంతరిస్తూనే ఉన్నారు.

శ్రీనాథుని కాలంనుంచి శేషం వెంకటకవివరకూ గతానుగతికంగా ప్రబంధమే రాజ్యమేలింది. ఫ్యూడల్ సమాజ కళా ప్రతిబింబంగా ఉద్భవించిన ఈ కవితాస్వరూపమే చరమ స్వరూపంగా భావింపబడుతూ వచ్చింది. మరీ అనుకరణ ప్రాయాలైన ప్రబంధాలను కాలం గాలికి ఎగరగొట్టివేసినా, "నావిష్ణుః పృథ్వీపతిః" అని నమ్మించబడిన లోకం ప్రబంధాన్నిసైతం సమాదరించడంలో అబ్బురమేమీలేదు. సుమారు నాలుగువందలఏళ్లలో పొడసూపని మార్పును-పంతొమ్మిదవ శతాబ్ది చివరి దశాబ్దం ప్రసవించనారంభించింది. ఈ మార్పు ఇరవయ్యోశతాబ్ది మొదటి దశాబ్దంలో మరింత స్పష్టపడింది. ఈ మార్పును సాధించిన యుగపురుషుడు గురజాడ క్రాంతదర్శియే! ఆయనే కవితా నిర్మాణంలో త్రిగుణాత్మకమైన నవీనమార్గానుసంధాత! ఆధునిక భావనాధారకు ఆయనే నిస్సందేహంగా ఆద్యుడు!

ఈ శతాబ్దపు తొలిదశాబ్దంలోనే గురజాడ వేంకట పార్వతీశ్వరకవులూ ఆద్యులుగా కాల్పనిక వాదం పొడుకొన్నది. తరువాత కాలాన మనదేశంలో భావకవిత్వం పేరుతో మూడుపూవులారుకాయలై విస్తృతి పొందింది. ఫ్యూడల్ సామాజికనీతులపైనా, భావనావ్యవస్థపైనా తిరుగుబాటుగా రూపొందిన భావకవిత్వంపై ప్రతిచర్యగా ఛాందసులు తిరోగమనవాదులూ గేలిచేసీ, నిందించీ, అపవాదుల బండ రాళ్ళు దొర్లించీ తమ అల్పసంతుష్టిని వెల్లడించుకున్నారు. దీనికి ప్రథమ కారణాలు రెండు: కాల్పనికవాదులైన కవులు స్థిరపడిన కవితారీతులను (Established Style) తృణీకరించడమూ, వ్యక్తిస్వేచ్ఛకు మొదటిసారిగా శిష్టసాహిత్యంలో ప్రాతినిధ్యం కల్పించి — ప్రయోగవాదానికి ప్రాణప్రతిష్ఠచేయడమూనూ! ఆంధ్రసాహిత్యంలో కాల్పనిక వాదానికి-ఆత్మ పర, వస్తుపర కావ్యశ్రేణులకు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి శ్రీ రాయప్రోలు సుబ్బారావుగార్లు వరుసగా ఆద్యులు.

సనాతనుల ప్రతిఘటనవల్లనూ, ఛాందసుల కుహనా విమర్శల ప్రతిచర్యవల్లనూ, ఈ నూత్న ప్రయోగాలకు సామాజికుల ఆమోదం విస్తృతంగా లభించడంలో కాలయాపన జరిగింది. దానికి కారణం లేకపోలేదు. ఆంగ్లప్రభుత్వం తన సామ్రాజ్యాన్ని నిల్పుకుందుకు మన దేశంలో నిర్మించిన రైల్వేలవల్ల పారిశ్రామిక విప్లవం ప్రారంభమైందేతప్ప–సామ్రాజ్యవాదానికి కొమ్ముకాసే సంస్థానాధీశుల జమీందారుల ఫ్యూడల్ విధానం మాత్రం అలాగే కొనసాగింపబడుతూ వచ్చింది. పారిశ్రామిక విప్లవ చైతన్యంతో క్రాంతదర్శనం కలిగి ప్రయోగవాదులైన కవులకూ, ఫ్యూడల్ భావ చేతనలో స్థిరపడిన సనాతనులకూ సంఘర్షణ తీవ్రతరమైంది. ఈ సంఘర్షణచర్య — ప్రతిచర్యల మాధ్యమికంగా సాగిన సాహిత్య సమరమే! సనాతనుల పక్షాన అక్కిరాజు ఉమాకాంతపండితుడూ, కాశీభొట్ల బ్రహ్మయ్యశాస్త్రి సోదరులూ, అనంతపంతుల రామలింగకవీ ధ్రుఢవాణితో నిలిచారు. ఈ సంఘర్షణ ప్రజాహృదయాల్ని ఆకర్షించిందే కాని, నూత్న ప్రయోగాలపట్ల వ్యతిరేకవైఖరికి నిర్ద్వంద్వంగా సామాజికామోదాన్ని చూరగొనలేకపోయింది. ఈ ప్రతిచర్యవల్ల అభివృద్ధికి విలంబమే జరిగింది కాని, నిరోధం కలగలేదు. తొందరగా సాగవలసిన పరిణామం కొంత మందకొడిగా సాగవలసి వచ్చింది. అంతే!

తెలుగు కవిత్వంలో వచ్చిన ఈ నూత్న ప్రయోగం ముందుగా ఆంగ్ల విద్యాభూషణులను ఆకర్షించింది. తద్వారా ఈ దేశపు మట్టిలోనికి లోతుగా వేళ్లను పారించుకో నారంభించింది. బహుముఖమైన నూత్నాభిరుచికి ఆకృష్టులై ఉన్న పాశ్చాత్య సాహితీప్రియంభావుకులు

మెచ్చుకోవడంలోగాని, సనాతన నిష్ఠాగరిష్ఠులైన గీర్వాణ పండితులీ నూత్న ప్రయోగాలను నిరసించడంలోగాని అసహజత్వం లేదు. అయినా భావకవులు మొక్కవోని ధైర్యంతో పురోగమిస్తూనే ఉన్నారు. తాము నెలకొల్పవలసిన నవ్యపథాల పట్ల సంపూర్ణ చైతన్యం ప్రదర్శించారు. కల్పించవలసిన నూతనాభిరుచుల పట్ల సిద్ధాంతావగాహనలో పురోగమించారు.

ఈ పురోగతి- 1930 ప్రాంతంలో శ్రీరంగం సోదరులు తెలుగు కవిత్వంలో నూత్న ప్రమాణాలను (new dimunuons) పాదుకొల్ప నారంభించేవరకూ అప్రతిహతంగా కొనసాగుతూనే వచ్చింది.

ఐతే- కాల్పనిక కవులు ప్రదర్శించినంతటి సచేతన సాహితీ బాధ్యతను ఈ రెండవ తరం ప్రయోగవాద కవులు ప్రదర్శించగలిగారా అన్నది సందేహమే! వారి సాధనా మార్గాలపట్ల వారికే పరిపూర్ణ శాస్త్రీయ చైతన్యంకాని, బాహ్య వాస్తవికతా పరిశీలనం గాని పటిష్ఠంగా లేకపోయాయి. తాము ఆవిష్కరిస్తున్న నూత్న ప్రయోగాల విషయంలో గాని, తాము అభివ్యక్తం చేస్తున్న నవీన మానవీయ సామాజికవాద సిద్ధాంతాల విషయంలోగాని పరిపూర్ణ అవగాహన లేకపోయింది. వారికి ప్రయోగానికి ఉన్నంత ప్రబలంగా యుగధర్మ చైతన్యం ఉండిఉన్నట్లు తార్కాణాలు కనిపించవు. హేత్వాధీన చిత్తస్థైర్యంకూడా అడపా తడపా లుప్తమవుతూ వచ్చింది. కనుకనే వారి ప్రయోగాలు ఏదో ఆటవిడుపుగా సాగాయేతప్ప సిద్ధాంత నోదక శక్తితో పురోగమించా యనడానికి ఎన్నో అభ్యంతరాలు వారి రచనలే కలిగిస్తాయి. వీరికి నవ్యతపట్ల ఉన్నంత మమకారం సవ్యత పట్లగాని, భవ్యతపట్లగాని లేకపోయింది. అందువల్లనే ఆత్మవైరుధ్యంగా మన దేశీయ బాహ్య వాస్తవికతతో నిమిత్తంలేని అధివాస్తవికతా ప్రయోగాల అంటుల్లు కట్టుకోవడం కనిపిస్తుంది.

# సృష్టిలో తియ్యనిది

## శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం

జీవితం అంటేనే అంతకాబోలు. లేకపోతే-యీ క్షణాన అందినట్లు భ్రమపెట్టి ఓహో అనుకునేంతలోనే అందకుండాపోయి-పైగా ఊరిస్తున్నట్లు వెక్కిరిస్తుందా?

పోనీ...నీ సంగతి నా కెందుకని వదిలేద్దామంటే అదిమాత్రం సాధ్యమా? జిజ్ఞాస మెదడుని దొల్చివేయకుండా ఊరుకోదే! కుతూహలం నిలవనీయదే! ఏదో ఒక ఆకర్షణ లేకపోతే అడుగులీసి అడుగు వెయ్యడం పడదే. రేపటికోసం ఎదురుచూసే ఆశలేకపోతే నేడు నడిచేదీ గడిచేదీ ఎలాగ?

మనిషి ఎదిగాడు. ఎదుగుతూనే ఉంటాడు.

పచ్చిమాంసంతో ఆకలి తీర్చుకునే దశనుంచి-వచనంలో రుచులను బేరీజు వేసేవరకూ వచ్చాడు. ఆకలి తీర్చుకోడంలో కూడా రకరకాల రుచులు కావాలి. విసుగుని వోడించడానికి జీవితంలో వైవిధ్యం ఏర్పరచుకుంటున్నాడు. భౌతికంగానే కాదు, మానసికంగానూ క్రొత్తదనంకోసం కొట్టుకుంటూనే ఉన్నాడు.

జిజ్ఞాసకల మనిషికి-జీవితం తరగని ఖని.

తవ్వుతున్నకొద్దీ లోతులు చూపుతూనే ఉంటుంది. ఇంకా ఉన్నాననే అంటుంది. అంతు దొరికినట్టే అనిపించి అంతలోనే నవ్వుతుంది. నీ సంగతి నా కెందుకులే అని వదిలేద్దామన్నా వదలనివ్వక రెచ్చగొడుతుంది. ఈ తృష్ణ అవసరమూ ఆరోగ్యదాయకమూ కూడా!

* * *

సాయంత్రం ఉషారుగా వీధిలోకి బయలుదేరాను. నా ఉత్సాహానికి కారణం-నా జేబులో ఒక బ్లాంక్ చెక్ ఉండడమే. నిన్నటికి నిన్న-నేను పనిచేసి రిటైరయిన కంపెనీ మానేజరు మార్కెట్ దగ్గర కనిపించి-కారాపారు. నాకు కించిత్ గర్వం కలిగింది. ఆఫీసరు గారికంటె వయసులో మాత్రమే పెద్దవాడినయిన నాకోసం వారు కారాపడమే కాక నన్ను పిలిచి కారెక్కమన్నారు.

కారు పరుగెడుతూంటే కుశలప్రశ్నలయ్యాయి.

"విశ్వనాథం!...ఓ మాంచికుర్రాడు కావాలయ్యా. చాకులాటివాడుండాలి. నీ అంత సిన్సియర్‌గా తెలివి తేటలుగా పనిచెయ్యగలిగేవాడు..."

"నా సీటులో ఎవరినో వేశారుకదా సార్?"

"లాభం లేదనిపించేశాడు." పెదవివిరచి-"ప్చ్!" ఏమిటో... కుర్రవాళ్ళు...నువ్వెళ్లిపోయాక చెయ్యి విరుచుకున్నట్లుందనుకో. అరవయ్యేళ్లు పైన పడుతున్నా ఆఫీసుపని ఎంత చురుకుగా చేసుకుపోయేవాడివి. అలాగ-చలాకీగా...పన్చెయ్యగలిగే క్యాండిడేట్‌ని నువ్వే ఎంచి నా దగ్గరకు తీసుకురా. మారు మాటాడకుండా ఉద్యోగం వేయిస్తాను" అన్నారు.

నాకు తృప్తిగా...గర్వంగా ఉంది.

పని చెయ్యడం ఒకెత్తు. ప్రశంస పొందడం ఒకెత్తు.

నేను రిటైరయి ఆరు నెలలు దాటుతోంది. అయినా నా సర్వీసుని గుర్తుపెట్టుకుని నన్నభినందించడమే కాకుండా నామీద ఒక గురుతరమయిన బాధ్యతను కూడా వేశారు ఆఫీసరు. ఈ గుర్తింపు నన్ను గుర్రమెక్కించి వదిలింది.

"తప్పకుండా సర్. త్వరలోనే మీరు కోరినట్లు చురుకయిన కుర్రాడిని తెస్తాను. మీ దయకు నా ధన్యవాదాలు" అని సెలవు తీసుకున్నాను.

కారు దిగి యింటివైపు నడుస్తూంటే ఏవో నినాదాలు... ఊరేగింపు.

మహిళా సంవత్సర సందర్భంగా-వరకట్నాన్ని నిషేధిస్తూ స్లోగన్‌లు చెబుతున్నారు. నవ్వొచ్చింది. ఉద్యమాలతోటే ఊరేగింపులతోటి బతుకులు ఉద్ధరించబడగలిగితే అంతకంటె ఏం కావాలి?

ఆడపిల్లకి పెళ్లి-
మగవాడికి ఉద్యోగం-
రెండూ అసాధ్యాలే అనిపించేస్తున్నాయి. కాలమహిమ!

అంతకీ-అక్కడెక్కడో ఓ రాజకీయ నాయకుడు యువలతో- "కట్నం తీసుకోకుండా పెళ్లి చేసుకోం"డని ఉపన్యాస మివ్వబోతే- "అలాగే. మాకు లంచాలూ రికమెండేషన్లూ అవసరంలేకుండా ఉద్యోగం వచ్చే ఏర్పాటు చెయ్యండి" అన్నారుట వాళ్లు. వాళ్లదీ తప్పకాదు. ఉన్నమాటే. ఉద్యోగం అంటే అదో యజ్ఞమైపోతూంది.

ప్రకాశానికి యీ బాధలేదు. అది వాడి అదృష్టం.

రేపు వాణ్ని తీసుకెళ్లి మానేజర్‌కి చూపిస్తాను. ప్రకాశం చురుకయినవాడు. సమయస్ఫూర్తి ఉన్నవాడు. మానేజర్‌ని మెప్పించగలడు.

దేముడు వరమిచ్చినట్లే వచ్చింది అవకాశం. నిజానికి ప్రకాశానికి యీ ఉద్యోగం రాకపోయినా ఫరవాలేదు. ఎలాగయినా నెగ్గుకు రాగలడు. కాని-వచ్చిన అవకాశాన్ని ఎందుకు వదులుకోవాలి? నెలకి నాలుగువందల జీతం. చేదా?

* * *

మూడుగంటలకి ప్రకాశాన్ని వెంటపెట్టుకుని మానేజరు దగ్గరకి బయలుదేరాను. వాడితో ఏమీ అనలేదు. ఊరికే నాతో రమ్మన్నానంతే.

రోడ్డుమీద పదిగజాలు నడిచానో లేదో — ఎదురయ్యాడు రామనాథం.

రామనాథం నా ఆరోప్రాణమే.

చిన్నప్పుడు గోళీలాటలో—తరవాత పేకాటలో—ఇప్పుడు చదరంగంలో—మేట్. రిటైరయిపోయాక (రామనాథమూ నాకంటె నెల ముందు రిటైరయ్యాడు) ఏ ఆధ్యాత్మిక కార్యక్రమానికయినా నేనూ అతనూ కలిసేవెళ్తాం. ఒకే అనుకునే స్నేహం. మా స్నేహానిదీ యించుమించు మా వయస్సే. నేను గుమాస్తానయితే-వాడు బడిపంతులు. రిటైరయిపోయాం కనుక యిప్పుడిద్దరమూ ఒకటే.

ఎటొచ్చీ నా కొక్కడే కొడుకు. వాడికీ ఒక్కడే కొడుకు కాని అదనంగా ఐదుగురమ్మాయిలు.

రామనాథం ముఖం దీనంగా ఉంది.

"అలా ఉన్నావేం?" ఆత్రంగా అడిగాను.

చెబుతానన్నట్టు సైగచేసి-ప్రకాశంవంక తిరిగి- "మసిలాళ్లతో నీకెందుక్కానీ ఇలా వెళ్లి తిరిగిరా..." అన్నాడు.

ప్రకాశం వెళ్లిపోయాడు.

నా చూపులో యింకా ప్రశ్నార్థకం మిగిలే ఉంది.

"బడిపంతులు రిటైరయ్యేసరికి మిగిలేది బిలబిలమంటూ సంతానమే. అసలే అయ్యవారి నట్టిల్లు; ఆపైన గడ్డురోజులు. నేడో రేపో అబ్బాయికి కనీసం కోమటి కొట్లో పద్దుల గుమాస్తా పదవయినా దొరక్కపోతే సంసారం నడివీధిన పడేటట్టుంది. అంటే-యిప్పుడు యింట్లో ఉంటున్నామని కాదు కానీ..." ఆకాశంవేపు చేతులు జోడించాడు.

జాలితోపాటు ఉద్రేకమూ కట్టలు తెంచుకుంది నాలో.

సృష్టిలో తీయనిది స్నేహమేనోయ్-అంటూ మెదడులో హెచ్చరిక.

రామనాథంకష్టం నా కష్టమే అనిపించింది.

ముందూ వెనుకా ఆలోచించకుండా అనేశాను— "ముష్టి ముప్ఫయ్ రూపాయల కోమటి గుమాస్తా దేనికి కానీ — పద మీ అబ్బాయిని తీసుకెళ్లి నేను పనిచేసిన కంపెనీలో క్లర్కుని చేద్దాం—"

నిజమా అన్నట్లు చూశాడు.

మా స్నేహంలో సరసాలూ ఉంటాయి. కనుక వాడు నన్ను శంకించినా ఆశ్చర్యంలేదు. జరిగినది యావత్తూ చెప్పాను. నా మాటలు నమ్మాడు. అరగంట తిరక్కుండా వాళ్లబ్బాయిని ఆఫీసరు దగ్గరికి తీసుకెళ్లడమేమిటి, అపాయింట్మెంట్ ఆర్డరు యిప్పించెయ్యడమేమిటి, అంతా శరవేగంతో జరిగిపోయింది.

ఇద్దరమూ పార్కు చేరుకున్నాం.

"నిజంగా...యిది...నిజమే అని నమ్మకం..." వాడికి మాటలు పెగలడంలేదు. అనుకోనంత వెలుగు హటాత్తుగా ఎదురయినా మనిషిచూపు మందగించి తీరుతుందికద. నేను నవ్వుతూ చూశాను. "నీ కొడుకు మొదటినెల జీతంతెచ్చి నీచేతిలో పోసేవరకూ నిజమో కాదో తేల్చుకోలేవులే!"

రామనాథం నా చేతులు పట్టుకుని—"నీ మేలు జన్మలో మరచిపోలేనురా. దేముడుకూడా యింత సాయం చేస్తాడంటే నమ్మలేను. నువ్వు చాలా మంచి దేముడివి..." అన్నాడు గద్గదికస్వరంతో.

ఒరేయ్!...పిచ్చి మాటలు కట్టిపెట్టు...నేను దేముణ్నేమిటి? స్నేహితుణ్నంతే. సృష్టిలో తీయనిది స్నేహమే అని అనగా వినలేదూ? స్నేహితులమధ్య కృతజ్ఞతలూ అవీ ఏమిటి?" మందలించాను.

"జాను" అన్నాడు రామనాథం.

చీకటి పడేవరకూ కబుర్లు చెప్పుకుని ఇళ్లకు బయలుదేరాము.

రాత్రి నాకు చక్కని నిద్రపట్టింది.

*  *  *

దేముడో దయ్యమో తెలియడంలేదు.

నేను చూసిన ఒక బొమ్మలో యముడిలా ఉన్నాడు.

ఆ భయంకర రూపాన్ని చూస్తూనే వణికిపోయాను.

కొంచం దూరంలో పడుకున్న భార్యనీ కొడుకునీ పిలవాలనుకున్నాను. కాని-నోరు విడదే! మనిషిని కదలలేకపోతున్నాను.

వికటాట్టహాసం, వెనువెంటనే గర్జన.

"నేను మృత్యుదేవతని. నాకు ఆ [illegible] ఉంది."

చిత్రంగా—అతనితో మాట్లాడ్డానిక నా నోరు ఎలాగోవిడింది. "వంటింట్లో చద్ది అన్నం ఆవకాయా ఉన్నాయి. తెచ్చేదా?"

"ప్రాణాలతోకాని నా ఆకలి తీరదు. అనవసరపు తాత్సారం చెయ్యక, ముందు ఎవరి ప్రాణం తీసుకునేదో చెప్పు. నీదా, నీ భార్యదా, నీ కొడుకుదా? ఊ..."

అయ్యో!...ప్రాణంలో ప్రాణమయిన భార్య! పున్నామ నరకం నుంచి తప్పించే కొడుకు...పోనీ...నేనే బలిఐపోతే?... అమ్మో! ...

"ఊఁ..." గర్జన.

"నా భార్య" అనేశాను. క్షణం విరామం. నా కన్నుల్లో నీరు.

"మరో ప్రాణం...అర్జంటుగా చెప్పు..." నా పీకమీద భయంకర హస్తం.

గింజుకుంటూ అన్నాను—"నా కొడుకు—"

ప్రసాద్ విగతజీవి ఐపోయాడు.

"మరొక్క ప్రాణి. చాలు...తొందరగా చెప్పు. నీదా, నీ స్నేహితుడు రామనాథానిదా?"

నా పీక మీదవేళ్లు బిగుసుకుంటున్నాయి. భయంతో కొయ్యకట్టుకుపోతూ చెప్పేశాను.

"రామనాథానిదే."

మృత్యుదేవత నవ్వుతూ వెళ్లిపోయింది. అప్పుడు నాకనిపించింది. మనిషి స్వార్థపరుడు. ప్రపంచాన్నంతటినీ బలిపెట్టి అయినా సరే తన ప్రాణంకోసం తాపత్రయ పడతాడు. భార్యనీ, పుత్రుణ్నీ... స్నేహితుణ్నీ కోల్పోయి దుఃఖాతిశయంలో మునిగిపోయాను. పశ్చాత్తాపంతో, విచారంతో కదలలేక కట్టెలా ఐపోయిన నేను—నా భార్య పలకరింపుతో ఆశ్చర్యంగా కదిలాను.

ఓహో! ఇదంతా కలే అన్నమాట. ఎవరూ చనిపోలేదు నిజానికి.

ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బవుతూ ఆవిడ భుజాలమీద చెయ్యివేసి ఉద్రేకంగా అన్నాను. "సృష్టిలో తీయనిది స్నేహమే కాని, అతి తియ్యనిది మాత్రం ప్రాణమే. సొంతప్రాణం. మరేమీ అనుకోకు. నన్ను క్షమించు."

తెల్లబోయి చూస్తూందావిడ—నావేపు.

జీవితం యింతే. ఉండుండి ఓ మొట్టికాయవేసి—నవ్వేవాళ్లను ఏడిపిస్తుంది.

ఓ చిలిపి పనిచేసి—ఏడిచేవాళ్లను నవ్విస్తుంది.

జీవితాన్ని పూర్తిగా తెలుసుకోగలగడం—గాలిని పిడికిట బంధించబోవడమే!

పూర్తిగా కళ్ళు తెరిచాను.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.